ప్రచురణ నెం. 9

# పొగాకు కనీసధరల సబ్ కమిటీ రిపోర్టు

[సబ్ కమిటీ సమావేశాల చర్చల వివరాలు
ప్రజాభిప్రాయం
గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీ తీర్మానం
మద్రాసు ప్రభుత్వ వ్యవసాయశాఖా మాత్యులు
గా॥ పి. యస్. కుమారస్వామిరాజాగారికి
సమర్పణ లేఖతోసహా]

---

గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీ

ప్రచురణ

1947

వెల ముప్పావలా

ప్రచురణ నెం. 9

# పొగాకు కనీసధరల
# సబ్ కమిటీ రిపోర్టు

[సబ్ కమిటీ సమావేశాల చర్చల వివరాలు
ప్రజాభిప్రాయం
గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీ తీర్మానం
మద్రాసు ప్రభుత్వ వ్యవసాయశాఖా మాత్యులు
గౌ॥ పి. యస్. కుమారస్వామిరాజాగారికి
సమర్పణ లేఖతో సహా]

---

గుంటూరు టుబాకో మార్కెట్ కమిటి
ప్రచురణ
1947

వెల ముప్పావలా

# గుంటూరు పొగాకు మార్కెట్ కమిటి, గుంటూరు.

శ్రీ కొల్లా వెంకయ్య, బి. ఏ.,
చైర్మన్.

గుంటూరు,
5-2-1947.

మద్రాసు వ్యవసాయ శాఖామాత్యులు
గా॥ శ్రీ పి. యస్. కుమారస్వామి రాజా గారికి,
మద్రాసు.

విషయము :- కమిటీలు - గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీ - పొగాకు సక్రమ కనీస ధరలు - తగినచర్యలు తీసికొనుటకు నివేదిక సమర్పణ.

ఆర్యా,

గుంటూరు పొగాకు మార్కెట్ కమిటీ తరఫున 25-1-'47 న చేసిన నెం. 17 ఎ తీర్మానము ననుసరించి పొగాకు సక్రమ కనీస ధరల ఉపసంఘముచే తయారు చేయబడిన యీ నివేదికను మీకు సమర్పించడానికెంతో సంతసిస్తున్నాను. దీనిని సానుభూతితో పరికించి, తగుచర్య తీసుకొనగలరని ఆశిస్తున్నాను. ఇందు (1) గుంటూరు జిల్లాలో పండించబడే పలురకములయిన, నాణ్యములు కలిగిన పొగాకులకు సక్రమ ధరలు నిర్ణయించవలసిన అవసరము, (2) వాటికి సక్రమ కనీసధరల సిఫారసులు, (3) ఈ ధరలను ఆచరణలో పెట్టడానికి వలసిన సాధనాలు, (4) ఈ సందర్భంలో మీరు చేయవలసిన శాంక్షన్స కొరకు విజ్ఞప్తిగలవు.

**మార్కెట్ చేయడానికి ఏర్పడిన పరిస్థితులు :**

సామాన్యంగా వ్యవసాయ సరుకులకు, అందు పొగాకులాంటి వ్యాపారపంటలకు ప్రత్యేకంగాను, సక్రమ కనీస ధరలను నిర్ణయించవలసిన అవసరాన్ని మీకు తెలియజెప్ప నవసరములేదు. కాగా, పొగాకు పంటలను ప్రవేశపెట్టి, పోషిస్తూ,

దాని శైశవాస్థనుండి స్వప్రయోజనాలకోసరం మెస్సర్స్. ఇండియన్ లీఫ్ టొబాకో డెవలప్‌మెంటు కంపెనీ లిమిటెడ్, వుపయోగించుకుంటున్నది. ఇది సంయుక్తరాజ్యం (U. K.), ఇండియా మొదలగు చోట్లగల బ్రిటిష్‌వారికి చెందిన పొగాకు పరిశ్రమాగారాలకు ఏజన్సీ. ఇదిగాక, తరువాత రంగములోనికి దిగిన మెస్సర్స్. నేషనల్ టొబాకో కంపెనీ ఆఫ్ ఇండియా లిమిటెడ్, మెస్సర్స్. బ్రిటిష్ ఇండియా టొబాకో కంపెనీ లిమిటెడ్, మొదలగు కంపెనీలుగూడా సంయుక్తరాజ్యం (U. K.) లోను, ఇండియాలోను గల సిగరెట్లు తయారుచేసే బ్రిటిష్ కర్మాగారాలయొక్క ఏజన్సీలే. ఈ ప్రాంతంలో తయారయ్యే పొగాకులో 80% (నూటికి 80 వంతులు) యీ వ్యాపార సంస్థల (Firms) చే కొనబడుచున్నది. పోగా మిగిలినది మాత్రమే కొద్దిమంది అయిన స్వదేశ వర్తకులకు, ఎగుమతిదారులకు చెందుచున్నది. 1940 సం॥ లో యీ సంస్థలు, కలిసి సంప్రదించి కొనుగోలు విషయంలో పరస్పర ఒడంబడికలు చేసుకున్నారు. ధరల విషయంలోకూడా ఒడంబడిక కుదిరినదంటే ఆశ్చర్యపడ నవసరంలేదు. ఇంకో విషయంగూడా జరిగింది. ఈ వ్యాపార సంస్థలు (Firms) యూరప్‌నుండి బర్మామలయాలనుండి వచ్చే దిగుమతి ఆర్డరనుగూడా అరికట్టగలిగినవి. ఇంతేగాకుండా ఈ సంస్థలకు సంయుక్తరాజ్యం, (U. K.) ఇండియా, మరి యితరదేశాల్లోని పొగాకు పరిశ్రమాగారాల్లో తమకివచ్చే స్వార్థంకోసం, ఇండియాలోని స్వదేశ ఎగుమతిదారులకు సరాసరి ఆర్డర్లిచ్చి, స్థానిక మార్కెట్‌లోని ధరలను చాలా తక్కువలో నుంచగలిగినవి. ఈ వ్యాపార సంస్థల (Firms) పోటీకి నిగ్గలేననే భయంతో స్వదేశ ఎగుమతిదారు తన సరకునకు సక్రమమైన ధర రాబట్టుకోలేకపోయాడు. U. K. లోని మార్కెట్‌లో మనదేశపు సరుకుకు, అదేరకమయిన ఇతర దేశపు సరుకులకు ఉన్న ధరలను పోల్చిచూస్తే పైవిషయం బోధపడుతుంది. పట్టిక క్రింద యివ్వబడినది.

| ఫ్లూక్యూర్డు వర్జీనియా పొగాకుధర | రొడీసియా | అమెరికా | ఇండియా |
|---|---|---|---|
| పౌ॥ 1కి | 54.2§ సెంట్లు | 50.32 సెంట్లు | 26.2* సెంట్లు |

(§32.35 పెన్నీలు; 1 పౌను = 4.02 డాలర్లు; *అమెరికా నాణెములు 100 డాలర్లు = 333 రూపాయలు. ఇది కనీస ధరల ప్రకారం మొత్తంగా (bulk) క్యాండీ ఒకటికి 436 రూపాయలకు సమానం).

| నాటుపొగాకు ధర | రొడీషియా | అమెరికా | ఇండియా |
|---|---|---|---|
| పౌను 1కి | 28.4§ | 24.85 | 12* |
| | సెంట్లు | సెంట్లు | సెంట్లు |

(§16.95 పెన్నీలు. ఇది 1 పౌను = 4.02 డాలర్లు; *అమెరికా నాణెం, కనిస ధరల ప్రకారం క్యాండి 1కి 200/- రూపాయలకు సమానం)

| సన్‌క్యూర్డు వర్జీనియా పొగాకుధర | అమెరికా | ఇండియా |
|---|---|---|
| పౌ 1కి | 32.40 | 13.5§ |
| | సెంట్లు | సెంట్లు |

(§అమెరికా నాణెం, కనీసధరల ప్రకారం క్యాండీ 1కి రూ. 225/- కు సమానం) (1సెంటు = 6 పైసాలు దాదాపుగా)

మన దేశ ఎగుమతిదారుడు యీవిధంగా పై ఏజన్సీలకి, ఉత్పత్తిదారుడికి మధ్య పడిపోయాడు. పరిస్థితులిల్లా ఉండటంచేత ఉత్పత్తిదారు (రైతు) తనుచేసిన కృషికి తగిన ఫలితాన్ని, యీ ఏజన్సీ సంస్థల (Firms) నుండి గాని, స్వదేశ ఎగుమతిదారుని వద్దనుండిగాని పొందలేక పోయాడు.

పొగాకు ఉత్పత్తిదారుని ఆర్థిక జీవితంలో యిలాంటి ఒడుదుడుకులు ఏర్పడటం మూలాన్ని అతడు ఈ పంటనే యింకా ఎక్కువగా పండించి అప్పుల్ని తీర్చుకునే ప్రయత్నంలోవున్నాడు. ప్రతిసంవత్సరం కొద్దిగా పెరుగుతున్న ధరలను చూచి, ఏజన్సీ సంస్థలవారిచే ప్రోత్సహించబడినవారైడబ్బున్న పల్లెటూరి ఆసామి తాను మోసపోవటమే గాకుండా భూమినిదున్ని పండించే రైతునుగూడా మోసపుచ్చుతున్నాడు. ఈ విధంగా వ్యవసాయం ధాన్యపు పంటలకుగాకుండా, వ్యాపార పంటలకుగాకుండా కుంటునడిపోయింది.

వ్యవసాయాభి వృద్ధికి, ప్రత్యేకంగా పొగాకు వుత్పత్తిదారునికి వున్న ఈ ప్రాథమిక అవరోధాన్ని తొలగించడం నిమిత్తం ఈ కమిటి ఏకగ్రీవామోదంతో సక్రమ కనీస ధరల నిర్ణయ సమస్యను తీసుకున్నది. ఇందుకేర్పడిన ఉపసంఘం దీని విషయమై సమగ్రంగా విచారించి నివేదికను తయారుచేసింది. ఈ ప్రయత్నం చేయడంలో ఇన్‌ఫ్లేషన్ ధరలున్న ప్రస్తుతకాలంలో పొగాకు ఉత్పత్తిదారునికయ్యే ఖర్చులకు తగిన ప్రతిఫలాన్ని పొందునట్లు చేయడానికేకాక, మీదికొస్తున్న వ్యవసాయ విషమపరిస్థితి నెదుర్కొనుటకుగూడ సంకల్పించబడినది. కాగా, సక్రమ కనీసధరల నిర్ణయం నూతనంగా ప్రవేశపెట్ట బడనున్న అపూర్వ విషయమేమీ గాదు. ఇంతకుముందే ఇండియాలో చెరుకు, ప్రత్తి, జనపనార మొదలైనవ్యాపార పంటలకు ఏదో ఒక రూపంలో వాడుకలోనున్న విషయమే. అంతేగాక ప్రపంచములోకల్లా, సిగరెట్లకు పనికివచ్చే పొగాకు నుత్పత్తిచేసి స్వంత ఉపయోగానికే కాకుండా, విదేశాలకు ఎగుమతిచేసే అమెరికా, కెనడా దేశాల్లోకూడా ఈ పద్ధతి అమలులో వున్నది.

వ్యతిరేక అభిప్రాయాల మినిట్సు :

ఈ ప్రణాళికను ఐదుగురు, వ్యాపారుల తరఫున వచ్చిన ప్రతినిధులు వ్యతిరేకించారు. 17 మంది బలపరిచారు. ఒక్కరు తటస్థంగా వున్నారు. వ్యతిరేకించిన ప్రతినిధుల ధోరణిని యిక్కడ వివరించుతాను. మిస్టర్ ఎస్. యన్. బి. జాన్సన్ గారు కమిటి 30-11-46 న చేసిన నెం 274 రు తీర్మానంలోని కనీస ధరల నిర్ణయ సూత్రాన్ని అంగీకరించారు. అంతేగాక 16-1-47 న జరిగిన చర్చలలో పాల్గొనటమేగాక నివేదికలోని మొదటి మూడుభాగములలోనున్న కనీస ధరల నిర్ణయావసరాన్ని గుర్తిస్తూ, ఆసందర్భంలో తీసుకున్న నిర్ణయానికి ఏకగ్రీవామోదం తెలిపిన వారిలో నొకరుగానున్నారు. ఉపసంఘంలోని వారి ధోరణినిబట్టి చూస్తే వారి వ్యతిరేకత స్వేచ్ఛావాతావరణంలో (బుద్ధిపూర్వకంగా) చేసినట్లు కనబడదు.

శ్రీ డి. రామారావుగారు ఇండియన్‌టొబాకో అసోసియేషన్ (గుంటూరులోని అసోసియేషన్ ఆఫ్ టొబాకో ట్రేడర్స్ అండ్ ఎక్స్‌పోర్టర్స్) ప్రతినిధిగా ఉపసంఘంలోనికి కో ఆప్టు చేసుకోబడ్డారు. వీరి వాదన, ధరలలో అవకతవకలు

రాకుండా వుండడానికై సక్రమ కనీసధరల ప్రణాళిక ఇండియా కంతటికీ కాకపోయి నప్పటికీ, మన రాష్ట్రంలోనైనా అమలులోకి వచ్చేటట్లు చూడాలని. వారి వ్యతిరేకత బుద్ధిపూర్వకమైనదిగాక వెలుపలనుంచి వారిమీద రుద్దబడినట్లున్నది. కాగా, వారే, తమ అసోసియేషన్ వారిఆజ్ఞలకు తలయొగ్గి అట్లా చేయవలసి వచ్చిందని వెలిబుచ్చారు. వ్యతిరేకించిన యితర ప్రతినిధులు యింత ప్రాముఖ్యమున్న యీ విషయాన్ని కేంద్రప్రభుత్వము అమలుపరుస్తే బాగుంటుందనే భావాన్ని బలపరిచారు. చర్చల వివరాల్ని పరిశీలించితే యీ విషయం తెలుస్తుంది.

వ్యతిరేక భావాల్ని యింకా లోతుగా వివరాలతో సహా పరిశీలించి నట్లయితే, వారుచెప్పేది 1946-47 సీజన్‌లో సగటు పౌను ధర 1కి 13.5 అణాలకి పెరిగిందని. కాని యిది నిజంకాదు. ఎందుకంటే యిప్పటికప్పుడే గోదావరి జిల్లాలో ఫ్లూక్యూర్డు వర్జీనియా పొగాకు ధరలు క్యాండీ 1 కి రు 580/- నుండి రు 80/- వరకు అనగా సగటున షుమారు పౌను 1 కి 10 అణాల చొప్పున గిడుతున్నట్టు తెలుస్తున్నది. గుంటూరు మార్కెట్ యిప్పటి కింకా యీ సీజన్‌కు పని మొదలుబెట్టలేదు. ఉపసంఘం సిఫారసుచేసిన కనీసధరలు క్యాండీ 1 కి రు 436/- వరకు వస్తుంది (అన్నిగ్రేడులు ఎంచిచూడగా). ఇది వారుకోరినట్టుగా 500 పౌనుల క్యాండీ 1 కి రు 422/- లేక సగటున పౌ 1 కి 13.5 అణాలకు సమానమౌతుంది. ఈ రెండు మొత్తాలు దగ్గర దగ్గర సమానం గనుక నియమాలులేని ధరలనిర్ణయం కంటె, సకారణంగాను, సక్రమంగాను నిర్ణయించబడిన కనీస ధరల ప్రణాళికను ఆమోదించవచ్చును. కనుక వ్యతిరేక సభ్యుల సాకులు సరియైనవికావు.

దిగుమతిదారుల వద్దనుండి వచ్చిన ఉత్తరాల సహాయంతో వ్యతిరేకించిన సభ్యులిట్లావాదిస్తారు. ఇండియా పొగాకు ధర యింక ఏమాత్రం హెచ్చించినా దానికి (యు. కె) సంయుక్తరాజ్యం, ఈజిప్టు, యూరప్ మొదలైన దేశాలలో మార్కెట్‌ను కోల్పోవలసి (నష్టపడవలసి) వస్తుందట. ఈ వాదన అసత్యం. ఈ వుత్తరంలోని మొదటిభాగంలో చెప్పినట్లుగా మనం నిర్ణయించిన కనీస ధరలు విదేశాలయొక్క, అదే నాణ్యము కలిగిన ఆయా పొగాకుల ధరలకంటె చాలా తక్కువగా నున్నవి. కనీసధరల నిర్ణయం వలన విదేశీపొగాకు పరిశ్రమాగారాలు, వాటి ఏజన్సీలు పొగాకును యింతకుముందు వస్తున్నంత తక్కువధరకు పొందలేక

పోవచ్చును. విదేశ దిగుమతిదార్లు, మోనాపలి సంస్థలు కలిగించిన భయంకరమైన కల్పనలకు గురియై, స్వదేశీ ఎగుమతిదారులు విదేశీవ్యాపార సంస్థలు చూపిన తప్పుడు మార్గంలో పడిపోతున్నారు.

వ్యాపారుల మేలు :

సామాన్యంగా అందరి వ్యాపారస్తులమేలును కోరి 18½% నుండి 19% వరకు-గుంటూరు జిల్లాలోని మార్కెట్ ననుసరించే, వారికి లాభాలు, పెట్టుబడి మీద వడ్డీలు మొదలైన వాటికి ఏర్పాట్లు చేయబడినవి. ఇవిగాక వారు విదేశ మార్కెట్‌నుండి ఎంతోలాభకరమైన ధరలు పొందటాని కవకాశం వున్నది. అన్ని గ్రేడుల విషయం ఆలోచించి చూడగా యీధర పౌ. 1 కి 2.6 అణాలకివచ్చింది. ఇది సగటున 250 పౌనుల బేలు 1 కి రు. 40-10-0 కు సమానం. ఈ రేటు ప్రకారం 500 బేల్సుతో వ్యాపారం చేస్తున్న చిన్నవ్యాపారికూడా సంవత్సరానికి రు20,000/- లాభం తీయగలుగుతాడు.

ఇంతకుముందున్న వ్యవసాయశాఖా డైరక్టరుగారి ఉద్దేశాలుగూడా తీసుకోబడినవి :

1941 లో సక్రమ కనీసధరల నిర్ణయం చేయమని మద్రాసు గవర్నమెంటు వారికి అప్పటి వ్యవసాయశాఖా డైరెక్టరుగారు సూచన చేశారు. యీ నివేదికలో కనీసధరలు శాసనంద్వారా ఆచరణలో ఎట్లాపెట్టాలనే సందర్భంలో వారి సూచనలు అంగీకరింప బడినవి.

ఉత్పత్తిదారుని (రైతు) దుస్థితి :

ఉత్పత్తిదారుని విషయంలో, నాలుగవభాగం చివరలో చూపినట్లు ఉత్పత్తి సగటు ఖర్చులు మొన్నమొన్నటివరకు ఎకరానికి రు 499/- వుండేది. కాని 1946-47 లో రు 640/- వరకు పోయింది. పంట మామూలుగా వుండేటట్లయితే (అనగా 675 పౌ.) సిఫారసు చేయబడిన కనీసధరల వలన క్యాండీ 1 కి రు 436/- లేక ఎకరం 1 కి రు 588/- సంపాదించ గలుగుతాడు. అట్లాగూడా 1946-47 లో వచ్చేధర ఉత్పత్తికయ్యే ఖర్చులకు సమానంగాదు. ఎకరానికి ఒక క్యాండీ అంతకంటే తక్కువ పండే, జిల్లాలోని అనేక ప్రాంతాలలో యింకా తక్కువ వస్తుంది.

ఈ లెక్కలలో (సూక్ష్మతకొరకు), తక్కువ ప్రాధాన్యం గలిగిన కొన్ని విషయాలు ఊహించ బడినవి. అందులో ఒకటి. కొన్ని ప్రదేశాల్లో మాత్రం కొద్దిగా సన్ కఖ్యూర్డు వర్జీనియా పొగాకు పండించే కొన్ని పొలాలలో, రైతు లెదు రొక్కనే కష్టనష్టాల విలువకే, వచ్చేధర సరిపోతుంది. రిడ్రైడ్ స్ట్రిప్స్ విషయంలో అయ్యే (స్టెమ్మింగ్) ధరలు, కాడఉంచి అమ్మడంవల్ల వచ్చేలాభానికి సరిపోతుంది. ఇటువంటివి ఆలోచింపబడలేదు.

కాని 1946–47 లలో కనీసధరలను అమలుపరచినప్పటికిని, ఎకరం 1 కి వచ్చేడబ్బు, ఉత్పత్తి ఖర్చులకే సరిపోదని నగ్నంగా కనిపిస్తున్నది. అందువల్ల కనీసధరలను వెంటనే అమలుపరచవలసిన సత్వరావసరాన్ని గుర్తించి ప్రణాళిక నామోదించి అందుకు తగిన శాంక్షన్స్ చేయవలసినదని, గుంటూరుజిల్లాలోని అనేక వేలమంది పొగాకు ఉత్పత్తిదారుల తరపున మిమ్ములను ప్రార్థిస్తున్నాను.

పొగాకు వుత్పత్తిదారులయొక్క యీ దుర్భరమైన గాధనంతా విసుగు జెందకుండా విన్నందుకు మీకు వందనాలర్పిస్తూ, 1947 సం॥ పొగాకు కొనుగోలు సీజన్ ప్రారంభం కాకముందే యీ ప్రణాళిక అమలులోకి వచ్చేటందుకు ఆర్డర్లు వేస్తారని నమ్ముతూ యున్నాను.

ఇట్లు భవదీయుడు,
(సం.) కొల్లా వెంకయ్య.
ఛైర్మన్.

## 25-1-47 తేది నంబరు 17 వ తీర్మానము.

## గుంటూరు పొగాకు మార్కెటు కమిటీ, గుంటూరు.

30-11-46 తేదీ నం. 274 రు. తీర్మానము ననుసరించి నియమించబడిన, కో ఆప్టుచేసుకొనబడిన సభ్యులతో, కనీసధరల నిర్ణయము కొరకేర్పడిన ఉప సంఘము తన పనిని విజయవంతంగా కొనసాగించి వివరాలతో సహా సమగ్ర మయిన నివేదికను యీ కమిటీ ముందుంచినందుకు ఉపసంఘ సభ్యులకు వందనా లర్పిస్తున్నాను. ఉపసంఘ సభ్యులు యీ నివేదికను తామామోదించడమే కాకుండా 25-1-47 తేదీన హాజరుకాని ఉపసంఘ సభ్యులనుండి దీనికి ఆమో దాన్నిగాని, నిరసననుగాని, ఏమైనా సూచనలుంటేవాటిని స్వీకరించెదమని చెప్పారు. ఇంకా, ఉపసంఘము మా తీర్మానంలోని సూచనలననుసరించి 1946-47 సీజనులోని పరిస్థితులకు తగినట్టుగా పొగాకు పంటకు మార్కెటులో రావలసిన కనీసధరలను సూచించడంతో పొగాకుకు సక్రమ కనీసధరల ఏర్పాటు సూత్రానికి ఎంతో ప్రాముఖ్యత కలిగించారు.

ఈ నివేదికకు మా కమిటీలో నలుగురు సభ్యులు వ్యతిరేకతను వెలిబుచ్చారు. కాని చర్చల సందర్భంలో వారు వెలిబుచ్చిన అభిప్రాయాల్ని. వ్యతిరేకాభిప్రా యాల్ని గురించిన మూడవ పేరాను పరిశీలించినట్లయితే కనీసధరల సూత్రాన్ని దేశానికంతా అమలుపరచే సందర్భములో వారికేమీ అభ్యంతరంలేనట్లు స్పష్ట మవుతున్నది. ఇట్టి అభిప్రాయాన్ని కమిటీకూడా బలపరుస్తుంది. అంతేగాక, పొగాకు విషయంలో దేశప్రాముఖ్యాన్ని వహించిన యీ ప్రాంతములో "ఏగ్మార్కు" సర్టిఫికేషన్ స్కీములాంటి ప్రాథమిక స్కీము నొకదాన్ని సిగరెట్లు, నాటుపొగాకులకు సంబంధించినంతవరకు కేంద్ర ప్రభుత్వంమే ప్రవేశ పెట్టాలని భావిస్తు న్నది. 25-1-47 తేదీన శ్రీ డి. రామారావుగారు, మిస్టర్ యఫ్. బి. యన్. జాన్సన్ గారలు వెలిబుచ్చిన వ్యతిరేక అభిప్రాయాలకు, 16-1-47 న పొగాకుకు కనీసధరల నిర్ణయం న్యాయమని ఉద్ఘాటిస్తున్న నివేదిక మొదటి మూడు భాగాలకు ఆమోదాన్ని వెలిబుచ్చడము, ఒకదానికొకటి పొసగడంలేదు. నివేదిక తెలుగు లో ఉండడంచేత దాని ప్రాముఖ్యాన్ని మొదట గ్రహించలేక పోయామనే మిస్టర్

ఎఫ్. ఎన్. బి. జాన్సన్‌గారి వాదనకూడా సబబుగాలేదు. శ్రీ రామారావు గారుకూడా తమ అభిప్రాయాన్ని ఇండియన్ టుబాకో అసోసియేషను ఆజ్ఞల ప్రకారమే 25–1–47 న మార్చుకోవలసివచ్చిందని తెలియపరిచారు. వెనుకటిదంతా సింహావలోకనం చేస్తేతేలేది మొట్టమొదట కమిటీలోని అందరు సభ్యులు పొగాకు కనీసధరల నిర్ణయావసరాన్ని ఏకగ్రీవంగా ఆమోదించారని అంతేగాక యిప్పటికీ ఆ అవసరాన్ని పునరుద్ఘాటిస్తూ ఉపసంఘము చే సిఫారసు చేయబడిన కనీసధరలను ఆచరణలో పెట్టాలని భావిస్తున్నారు. ఎందుకంటే ఇండియా నుండి ఎగుమతి అయ్యే పొగాకులో ఎక్కువ భాగం మన జిల్లానుండి ఎగుమతి అవుతున్నది గనుకను, విదేశీపొగాకు వ్యాపారులు, మ్యాన్యుఫాక్చరర్లు రాను రాను మన జిల్లా పొగాకును కొనడానికి ఎక్కువ శ్రద్ధ చూపిస్తున్నారు గనుకను, అంతేగాక కష్టపడే పొగాకు ఉత్పత్తిదారుడు తన కష్టానికి తగినలాభం రాకపోగా తన ఉత్పత్తి ఖర్చులుకూడా సంపాదించలేక పోతున్నాడు గనుకను, ఈ కమిటీ యీ నివేదిక నామోదిస్తూ, మద్రాసు ప్రభుత్వము వారి కీనివేదికను సమర్పిస్తూ వారుగూడా ఆమోదించి కనీసధరల ఉపసంఘ సూచనల ననుసరించి గుంటూరు జిల్లాలో, గుంటూరు టుబాకో మార్కెటు కమిటీవారిచే, 1947 పొగాకు సీజను మొదలుగాక ముందే, యీ కనీసధరలను అమలులో పెట్టునట్లు ఆర్డర్లు పంపవలసినదని మద్రాసు గవర్నమెంటును ప్రార్థించడమైనది.

---

## 30-11-1946 తేదీన గుంటూరు టుబాకో మార్కెట్టుకమిటీ

## పొగాకుకు కనీసధరలను గురించి ప్యాసుచేసిన తీర్మానము. నెం. 274.

గ్రేడ్ చేసి, ప్రాసెస్ చేసి, అగ్‌మార్కు వేయించి, ఫ్యాక్టరీ యజమానులకు అమ్మే పొగాకుకు గుంటూరు మార్కెట్‌లోను, విదేశమార్కెట్లలోనూ ఉన్న ప్రస్తుత ధరలను పరిశీలించినమీదట, వినిమయదారుడు చెల్లించే ధర విషయం అలాఉంచి, యీయిన్ఫ్లేషన్ రోజుల్లో ఉత్పత్తిదారునికి ఆయాధరల నిరర్ధకతను గుర్తించి, తత్ఫలితంగా కలిగే ఉత్పత్తినష్టాన్ని విచారించి, పొగాకు ఉత్పత్తిదారులకు రాబోయే ఆర్ధికమాంద్యాన్ని తట్టుకోగల శక్తిని కలిగించాలనే ఉద్దేశంతో పొగాకుకు కనీసధరలను నిర్ణయించటం అత్యావశ్యకమని, యీ కమిటీ హృదయపూర్వకంగా విశ్వసిస్తూ, గుంటూరుజిల్లాలోని వివిధ రకాల పొగాకు గ్రేడ్లకు యీ క్రింద కనపరచిన కనీసధరలను సూచిస్తున్నది. ఈ విషయంమీద అభిప్రాయం యివ్వవలసినదిగా ప్రజలనూ ప్రముఖులనూ కోరటమే కాకుండా, తుదినిర్ణయానికి రావటం కోసం, కనీసధరల అవసరాన్ని విచారించి, ధరలను నిర్ణయించి, వాటిని అమలు జరిపే విధానం యీ కమిటీకి సూచించేందుకూ, ప్రజాభిప్రాయ సహాయంతో, 30-12-46 *లోగా, 1947 సీజనుకు తగినంత ముందుగానే మద్రాసు ప్రభుత్వ అనుమతికోసం పంపటానికిగాను ఒకరిపోర్టు తయారుచేసి నివేదించ గలందులకు, కోఅప్టు చేసుకునే అధికారాలతో యీక్రింది సబ్‌కమిటీని నియమించడమైనది.

పొగాకు ఉత్పత్తిదార్లను, వ్యాపారులను, వారివారి సభలను, సంఘాలను, ప్రజానాయకులను, కనీసధరలను గురించిన తమ అభిప్రాయాలను దయతో 27-12-46 ** లోగా కమిటీకి అందజేయవలసిందని కోరటమేకాకుండా, పొగాకు ఉత్పత్తిదార్ల సహకార సంఘాలకు రిజస్ట్రేషను అవకాశాలు కలుగజేయవలసిందనీ, కనీసధరలు అమలుజరిపే సందర్భంలో, రావటానికి అవకాశాలున్న చిక్కులనుండి తప్పించుకోగలగటానికి పెద్దమొత్తములలో (మొదటిదఫా 10 లక్షలు) రైతుల సరుకు హామీమీద అప్పుసౌకర్యాలు కల్గించవలసినదనీ, మద్రాసు ప్రభుత్వాన్ని కోరటానికి తీర్మానించడమైనది.

---

* 15.1.47 కు వాయిదా వేయబడినది. ** 12.1.47 కు వాయిదా వేయబడినది.

| స్థానిక గ్రేడు. | కనీసధర |
|---|---|
| ఫ్లూకుర్యార్డ్ వర్జీనియా : | (500 పౌనుల పుట్టి 1 కి రూపాయలు) |
| 1 | 575 |
| 2 | 450 |
| 3 | 390 |
| లైట్‌గ్రీన్ (లేబచ్చ) | 325 |
| 5 | 160 |
| మొద్దుపచ్చ | 125 |
| 6 | 50 |
| ఎండు వర్జీనియా | 170 |
| నాటు | 135 |
| ఆగ్‌మార్కు గ్రేడు | |
| 1 | 655 |
| 2 | 575 |
| 3 | 545 |
| 4 | 470 |
| యల్. బి వై. | 255 |
| యల్. జి. | 300 |
| యల్. యం. జి. | 240 |
| డి. జి. | 115 |
| బి. అండ్. డి. బి. | 155 |
| పి. యల్. | 95 |

# సబ్ కమిటి.

1. మిస్టర్. యఫ్. యర్. బి. జాన్స్టన్.
2. శ్రీ కె. నరశింగరావు.
3. శ్రీ డి. వి. అప్పారావు బి. ఎ.,
4. శ్రీ కొల్లా వెంకయ్య బి. ఎ.,
5. శ్రీ కొల్లూరు వెంకటేశ్వర్లు.

# కృతజ్ఞత

సబ్ కమిటీ కార్యక్రమంలో అనేక విధాల సహాయంచేసి తోడ్పడిన ప్రముఖులకూ, పొగాకు రైతులకూ, వర్తకులకూ, మా కృతజ్ఞతా పూర్వక అభివందనాలు. సబ్ కమిటీ కార్యకలాపాల్లో యెక్కువ శ్రమతీసికొని సహకరించిన గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీ ఉద్యోగు లందరికీ మేము కృతజ్ఞులం. కనీసధరలను గురించి అమూల్యమైన పుస్తకం వ్రాసి, విచారణ సమయంలో మార్గదర్శకులై, యీ రిపోర్టు తయారు చేయుటలో అధికంగా తోడ్పడిన,

**శ్రీ. సి. వి. యస్. శ్రేష్టి B. Sc. (Ag), A. I. A. R. I., గారికి,**

మా ప్రత్యేక కృతజ్ఞతాభినందనలు అర్పిస్తున్నాం.

# విషయసూచిక

పేజీ.

—: o :—

## సబ్ కమిటీ సభ్యులు

సభ్యులు :

1. శ్రీ కొల్లా వెంకయ్య, B. A., చైరుమన్.
2. శ్రీ డి. వి. అప్పారావు, B. A., వైస్ చైర్మన్.
3. శ్రీ కె. నరసింగరావు.
4. శ్రీ కొల్లూరు వెంకటేశ్వర్లు.
5. మిష్టర్ యఫ్. యర్. బి. జాన్స్టన్.

కో ఆప్టు చేసుకోబడిన సభ్యులు :

వర్తకులు :

1. ఐ. ఎల్. టి. డి. కంపెనీ., లిమిటెడ్, చీరాల. ప్రతినిధి, మిష్టర్. జి. కమ్మింగ్.
2. బ్రిటిష్ ఇండియా టుబాకో కార్పొరేషన్ లిమిటెడ్., గుంటూరు, ప్రతినిధి, మిష్టర్ డి. ఎన్. మూర్తి.
3. ఇండియన్ టుబాకో అసోసియేషన్, గుంటూరు, ప్రతినిధి. మిష్టర్ డి. రామారావు.
4. ఈస్ట్ ఇండియా టుబాకో ఫెడరేషన్, మద్రాసు. ప్రతినిధి (జవాబురాలేదు)
5. నూతలపాటి ఆంజనేయులు అండ్ కంపెనీ, గుంటూరు, ప్రతినిధి, మిష్టర్ గట్టుపల్లి ఆంజనేయులు.
6. శ్రీ మైలవరపు గుండయ్యగారు, పొగాకు వ్యాపారులు, చిలకలూరిపేట.
7. గుంటూరు ఛేంబర్ ఆఫ్ కామర్సు, గుంటూరు, ప్రతినిధి, శ్రీ కె. రామకృష్ణమూర్తి, బి. కాం. (ఆనర్సు)

ఉత్పత్తిదార్లు :

1. గుంటూరు టుబాకో మార్కెటు కమిటి మాజీ సభ్యులు, శ్రీ జి. వి. సుబ్బయ్య, (ఈతేరు) గారు రాజాలనని వ్రాసి నందున వారిస్థానే పెదనందిపాడు నుండి శ్రీ లావు అంకమ్మగారు.

2. అఖిలభారత పొగాకు ఉత్పత్తిదార్ల సంఘంవారు యిష్టపడనందున వారి స్థానే పణిదం నుండి శ్రీ యం. అమరారెడ్డిగారు.

3. శ్రీ కాళిదాసు శంకరయ్యగారు, పొగాకు ఉత్పత్తి దారులు, టంగుటూరు ఏరియా.

4. శ్రీ పోసాని ప్రకాశరావుగారు, పొగాకు ఉత్పత్తిదారులు, కృష్ణాయపాలెం.

5. శ్రీ పాటిబండ్ల రంగనాయకులు చౌదరిగారు, పొగాకు ఉత్పత్తిదారులు, భీమవరం, ఒంగోలు తాలూకా.

6. గుంటూరు జిల్లా రైతుసంఘం ప్రతినిధి, శ్రీ యం. వీరభద్రరావుగారు, వారి స్థానే శ్రీ కె. కుటుంబరావుగారు.

ఇతర ప్రముఖులు: 1. శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు, B. Sc., M. L. A., తెనాలి, రాజ్యాంగపరిషత్తు పనిలో నిమగ్నులై యున్నందున రాజాలమని వ్రాశారు. కనుక వారిస్థానే మం. వెంకటరాజుగారు యం. ఎల్. ఏ., బాపట్ల.

2. శ్రీ మేడూరి నాగేశ్వరరావుగారు, M. L. A., ఏటుకూరు.

3. జనాబ్ యం. ఎ. సలాం, M. L. A., B. A., B. L., గుంటూరు.

4. శ్రీ కె. బ్రహ్మానందరెడ్డిగారు, M. L. A., B. A., B. L., (నరసరావుపేట) యిష్టపడలేదు. కనుక వారిస్థానే, శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు, M. L. A., బెజవాడ.

5. గుంటూరుజిల్లా ముస్లింలీగ్ ప్రతినిధి జనాబ్ యస్. మహబూబ్ (సెక్రటరీ).

6. గుంటూరుజిల్లా కమ్యూనిష్టు కమిటీ ప్రతినిధి శ్రీ యం. హనుమంతరావుగారు, వీరిస్థానే శ్రీ వున్నవ గోపాల కృష్ణయ్యగారు, బి. ఏ., బి. యల్., వకీలు, గుంటూరు.

7. గుంటూరుజిల్లా కాంగ్రెసు కమిటీ ప్రతినిధి (జవాబురాలేదు)

## సబ్ కమిటీ సంచార కార్యక్రమం.

| | | | |
|---|---|---|---|
| డిసెంబరు 1946 : | 19-12-46 | యడ్లపాడు | నర్సరావుపేట తాలూకా |
| | | గోరంట్లవారిపాలెం | ,, |
| | 20-12-46 | చిలకలూరిపేట | ,, |
| | | ఎద్దనపూడి | ,, |
| | 21-12-46 | కావూరులింగంగుంట | ,, |
| | | లంకెలకూరపాడు | సత్తెనపల్లి తాలూకా |
| | | ముప్పాళ్ళ | ,, |
| | 22-12-46 | ఇరుకుపాలెం | ,, |
| | | సత్తెనపల్లి | ,, |
| | | మేడికొండూరు | ,, |
| | | కొర్రపాడు | ,, |
| జనవరి 1947 : | 4-1-47 | గుండవరం | గుంటూరు తాలూకా |
| | | తాడికొండ | ,, |
| | | తుళ్ళూరు | ,, |
| | 5-1-47 | మందడం | ,, |
| | | వెలగపూడి | ,, |
| | | మంగళగిరి | ,, |
| | | పెనిగండ్ల | ,, |
| | 6-1-47 | ఏటుకూరు | ,, |
| | | ప్రత్తిపాడు | ,, |
| | | పెదనందిపాడు | బాపట్ల తాలూకా |
| | 7-4-47 | పరుచూరు | ,, |
| | | కొమ్మమూరు | ,, |
| | 8-1-47 | దగ్గుబాడు | ,, |
| | | ఇంకొల్లు | ,, |

| | | |
|---|---|---|
| | గంగవరం | ఒంగోలు తాలూకా |
| | భీమవరం | ,, |
| 9-1-47 | మేదరమెట్ల | ,, |
| | త్రోవగుంట | ,, |
| 10-1-47 | ఉప్పుగుండూరు | ,, |
| | నిడమలూరు | ,, |
| 11-1-47 | టంగుటూరు | ,, |
| | ఒంగోలు | ,, |
| 12-1-47 | గుంటూరులో పొగాకు వ్యాపారస్తులతోను, ఎగుమతిదార్లతోను, చర్చలు. | |

—: o :—

## విచారణ విధానాలు

**పునాది :** గుంటూరు టుబాకో మార్కెటు కమిటీ మార్కెటింగు అడ్వైజరు శ్రీ సి. వి. యస్. శ్రేష్టిగారు రచించిన "పొగాకు సక్రమ కనీసధరలు" (తెలుగు)

[ గుంటూరు టుబాకో మార్కెటు కమిటీవారి ప్రచురణ నెం. 8 రు ]

**విచారణ పద్ధతి :**

1) ప్రజాభిప్రాయసేకరణ : మదరాసు రాజధానిలో ప్రజాభ్యుదయానికీ, ప్రత్యేకంగా పొగాకు వర్తకానికీ సంబంధించిన షుమారు 300 మంది ప్రముఖులకు అభిప్రాయార్థం పైన వివరించిన పుస్తకం పంపబడింది. ప్రజాభిప్రాయం యీ పుస్తకంలో యివ్వబడినది.

2) లెక్కలు సేకరించుట : పొగాకు ఉత్పత్తిదార్లనుండి, వ్యాపారస్థుల వద్దనుండి, వ్యక్తిగతంగా ప్రశ్నావళిరూపంలో పొగాకుకు సంబంధించిన ఉత్పత్తిఖర్చులు, పంట, అమ్మకము మొదలైన లెక్కలు సేకరించబడి నవి. (చూ. అనుబంధము 6)

3) సంభాషణల్లోనూ, బహిరంగసభల్లోనూ, ఉత్పత్తిఖర్చులూ, పంట మొదలైన విషయాలమీద అభిప్రాయాలను సేకరించుట : సబ్ కమిటీ సంచార కార్యక్రమం సందర్భంలో జరిగిన 29 బహిరంగసభ ల్లోను సబ్ కమిటీ సభ్యులు కనీసధరల ప్రాముఖ్యాన్ని గురించి, కనీస ధరలు నిర్ణయింపబడే పద్ధతులను గురించి, సమావేశమైన రైతు, వర్తక ప్రముఖులకు విపులంగా వివరించారు. ప్రతి సమావేశంలోనూ, ఆయా ప్రాంతాలకు సంబంధించిన ఉత్పత్తి ఖర్చులు, పంట మొదలైన విషయాలు సేకరించడమే కాకుండా, అసలు కనీసధరల నిర్ణయం అవ సరమా కాదా అనే సమస్యమీదా, సమావేశమైన పెద్దల దృష్టిలో కనీసధరలు యెంత ఉండాలి అనే విషయంమీదా, బహిరంగ ప్రజాభి ప్రాయంకూడా సేకరించబడింది.

9

# ప్రజాభిప్రాయం

గుంటూరు మార్కెట్ కమిటీ, మార్కెటింగ్ ఎడ్వైజరయిన

## శ్రీ సి. వి. యస్. చెట్టి

బి. యస్‌సి (ఎజి), ఎ. ఐ. ఎ. ఆర్. ఐ., గారిచే వ్రాయబడిన

"పొగాకు సక్రమ కనీస ధరలు"

అను పుస్తకముపై, పొగాకుకు కనీస ధరల నిర్ణ

యావసరాన్ని గురించి ప్రముఖులనుండి,

ప్రజాసంస్థలనుండి సేకరించ బడినది.

పొగాకు కనీస ధరలవిషయం పై తమ అభిప్రాయాలను పంపిన ప్రముఖులయొక్క,

ప్రజా సంస్థలయొక్క పేర్ల పట్టిక

# I. రాజకీయ వేత్తలు

1. శ్రీ దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు, గుంటూరు.
2. శ్రీ మంతెన వెంకటరాజుగారు, ఎ. ఎల్. ఎ., మంతెనవారిపాలెం.
3. శ్రీ నడింపల్లి వెంకటలక్ష్మీ నరసింహారావుగారు, బారిష్టరు, గుంటూరు.
4. శ్రీ చావలి సూర్యనారాయణగారు, గుంటూరు.
5. శ్రీ జి. వి. పున్నయ్యశాస్త్రిగారు, ప్రధాన కార్యదర్శి,
   ఆంధ్ర మహాసభ, గుంటూరు.
6. శ్రీ దేశిరాజు కృష్ణశర్మగారు, ప్రధాన కార్యదర్శి,
   జాతీయ విజ్ఞాన పరిషత్తు, గుంటూరు.
7. శ్రీ యం. హనుమంతరావుగారు, కార్యదర్శి,
   జిల్లా కమ్యూనిష్టు కమిటీ, గుంటూరు.
8. శ్రీ నండూరి ప్రసాదరావుగారు, కార్యదర్శి,
   ఆంధ్రరాష్ట్ర రైతు సంఘం, బెజవాడ.
9. శ్రీ గుమ్మిడిదల వెంకటసుబ్బారావుగారు, "గోష్టి", బెజవాడ.
10. జనాబ్ యస్. మహబూబ్ సాహెబ్, కార్యదర్శి,
    జిల్లా ముస్లింలీగ్, గుంటూరు.
11. శ్రీ కంఠంనేని కోటేశ్వరరావుగారు, కార్యదర్శి,
    తెనాలి తాలూకా కమ్యూనిస్టు కమిటీ.
    శ్రీ వాసిరెడ్డి నారాయణరావుగారు, అధ్యక్షుడు,
    తెనాలి తాలూకా రైతు సంఘం.
12. శ్రీ చెరుమళ్ళ రామచంద్రరావుగారు, యం. ఎ., బి. యల్.,
    మాజీకార్యదర్శి, ఆంధ్రమహాసభ, బందరు.
13. జనాబ్ మహమ్మద్ ముస్తాఫా సాహెబ్,
    సెక్రటరీ, అంజుమాన్-ఇ-ఇస్లామియా, గుంటూరు.

14. శ్రీ గోగినేని వెంకటసుబ్బయ్యగారు,
మాజీకార్యదర్శి, గుంటూరు పొగాకు మార్కెటు కమిటీ, ఈతేరు.

15. శ్రీ యం. ఆర్. ఆరాధ్య, యల్. ఐ. యం., అండ్ బి. ఎ. యస్.,
అధ్యక్షులు, గుంటూరు జిల్లా వైద్యమండలి, మంగళగిరి.

16. శ్రీ కె. సత్యనారాయణరావుగారు, మెంబరు, ఐ. సి. టి. సి., ఖమ్మంమెట్.

17. శ్రీ నీరుకొండ వెంకటరామారావుగారు,
కార్యదర్శి. తూర్పుగోదావరి జిల్లా కాంగ్రెస్ కమిటీ.

18. శ్రీ కాళంగి వెంకటరత్నంగారు,అధ్యక్షుడు, పట్టణకాంగ్రెస్ కమిటీ, మంగళగిరి.

19. శ్రీ పెద్ది హనుమయ్యగారు,
వర్కింగు కమిటీ మెంబరు, తాలూకా కాంగ్రెసు, బాపట్ల.

20. శ్రీ యేళ్ల రామశేషారావుగారు,
ఆర్గనైజరు, పెదవడ్లపూడి ఏరియా కమ్యూనిష్టుపార్టీ.

21. శ్రీ ఆరి శ్రీరాములుగారు,
ఒంగోలు తాలూకా కాంగ్రెసు కమిటీ మెంబరు, మద్దిపాడు.

22. జనాబ్ సయ్యద్ అజీంసాహెబ్, సెక్రటరీ, ముస్లింలీగ్, కొమ్మూరు.

23, శ్రీ చదలవాడ ప్రసాద్‌గారు, చినరావూరు గ్రామ కమ్యూనిష్టుపార్టీ.

24. శ్రీ దొంతరాజు కృష్ణమూర్తిగారు, ఆర్గనైజరు, కమ్యూనిస్టువార్టీ, నంబూరు.

25. శ్రీ బొమ్ము నాగిరెడ్డిగారు, గ్రామ కమ్యూనిస్టు కమిటీ, ఆత్మకూరు.

26. శ్రీ వాశిరెడ్డి మల్లికార్జునరావుగారు, గ్రామ కమ్యూనిస్టు కమిటీ, కంతేరు.

## II. ఆర్థిక శాస్త్రవేత్తలు, ఇతర శాస్త్రవేత్తలు.

1. మిష్టర్ జె. బి. విలియమ్స్,
ఛైర్మన్, హిస్టరీ & ఎకనామిక్స్ డిపార్టుమెంటు, ఎ. సి. కాలేజి, గుంటూరు.

2. మిష్టర్ బుద్ధిరాజు రామచంద్రరావు, యం. ఎ., యల్. టి., గుంటూరు.

3. మిష్టర్ పి. శేషగిరిరావు,
విజయ కమ్మర్షియల్ బ్యాంక్, లిమిటెడ్, మంగళగిరి.

4. మిష్టర్ బాగు గోవిందరావు, యం. ఎ., బి. యల్.,
లెక్చరర్, హిందూకాలేజి, గుంటూరు.

## III. డాక్టర్లు, లాయర్లు మొదలైనవారు.

1. మిష్టర్ పి. వెంకటేశ్వరరావు, బి. ఎ., బి. ఎల్., గుంటూరు.
2. మిష్టర్ తురగా విశ్వేశ్వర శర్మ, అడ్వకేటు, గుంటూరు.
3. ,, కొమ్మారెడ్డి వెంకటరెడ్డి, అడ్వకేటు, గుంటూరు.
4. ,, అత్తలూరి పాపరాజు, బి. యల్., అడ్వకేటు, గుంటూరు.
5. ,, యస్. హనుమయ్యచౌదరి, బి. ఎ., బి. ఎల్., ఒంగోలు.
6. ,, వి. శ్రీరాములు, వకీలు, ఒంగోలు.
7. ,, యస్. నీరజరావు, వకీలు, తెనాలి.
8. ,, దివాకర్ల లక్ష్మీనారాయణ, బి.ఏ., బి.ఎల్., బ్రాడీపేట, గుంటూరు.
9. ,, చాపలమడుగు రామయ్య చౌదరి, అడ్వకేటు, నర్సరావుపేట.
10. ,, జి. పోతయ్య, టీచరు, ఇంకొల్లు.
11. ,, శానంపూడి సుబ్బారావు, టీచరు, కంతేరు.
12. ,, సి. హెచ్. యల్. నరసింహం, తెనాలి.
13. డాక్టర్ కొల్లూరు అంజనేయులుగారు, మంగళగిరి.
14. మిష్టర్ వి. శ్రీరాములు, ఫస్టుక్లాస్ ఆనరరీ మేజస్ట్రేట్, ఒంగోలు.
15. డాక్టరు కె. మల్లిఖార్జునరావుగారు, పరుచూరు.
16. మిష్టర్ జి. క్రిష్ణమూర్తి, బి. ఎ., బి. యల్.,
ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, పంచాయతీబోర్డు, పరుచూరు.

# IV. ఆహార కమిటీలు, పంచాయితీ బోర్డులు, రైతు సంఘాలు.

1. శ్రీ రాయపాటి వెంకటరంగారావుగారు,
గ్రామ కమిటీ ప్రెసిడెంటు, వుంగుటూరు.
2. శ్రీ నంగినేని సుబ్బయ్యగారు,
ఆహార కమిటీ ఛైర్మన్, పాలపర్రు.
3. శ్రీ గంగవరపు అంజయ్యగారు, ఆహారకమిటీ మెంబరు, స్వర్ణ.
4. శ్రీ వి. దేవలరావుగారు, గ్రామకమిటీ ఛైర్మన్, కొమ్మూరు.
5. శ్రీ ఖంటా కోటయ్యగారు, ఆహారకమిటీ సభ్యుడు, పూసపాడు.
6. శ్రీ కొప్పురావూరి శీతారామయ్యగారు,
ఆహారకమిటీ మెంబరు, దైవాలరావూరు.
7. శ్రీ దావులూరి వెంకటాద్రిగారు,
ప్రెసిడెంటు, ఆహారకమిటీ, గోనసపూడి,
8. శ్రీ వి. నారాయణరెడ్డిగారు,
ఆహారకమిటీ అధ్యక్షుడు, ఇనమనమెళ్లూరు.
9. శ్రీ వెంపరాల రామక్రిష్ణయ్యగారు,
ప్రెసిడెంటు, ఆహారకమిటీ, వేలూరు.
10. శ్రీ పి. రామాచార్యులుగారు, ప్రెసిడెంటు, పంచాయితీబోర్డు, పరుచూరు.
11. శ్రీ చుండి రంగనాయకులుగారు,
ఆహారకమిటీ ప్రెసిడెంటు, సందెపూడి.
12. శ్రీ గుంటుపల్లి వెంకటపుల్లయ్యగారు, ఆహారకమిటీ ప్రెసిడెంటు, కంతేరు.
13. శ్రీ గోరంట్ల వెంకయ్యగారు, ఆహారకమిటీ ఛైర్మన్, వీరన్నపాలెం.
14. శ్రీ లావు సుబ్బయ్యగారు, ఛైర్మన్, ఆహార కమిటి, పోతుకట్ల.
15. శ్రీ జి. దాసరయ్యగారు, ప్రెసిడెంటు, గ్రామ ఆహారకమిటీ, అమరావతి.

16. శ్రీ యన్. రామమూర్తిగారు, పంచాయితీబోర్డు అధ్యక్షులు, ఇంకొల్లు.
17. శ్రీ వంకాయలపాటి వీరయ్యగారు, పంచాయితీబోర్డు ప్రెసిడెంటు, స్వర్ణ.
18. శ్రీ కరణం శేషతల్పయిశాగారు,
కో-ఆపరేటివు స్టోర్సు సెక్రటరీ, స్వర్ణ.
19. శ్రీ చెన్నపాటి వెంకటేశ్వర్లుగారు, గ్రామ మున్సబు, కొమ్మూరు.
20. శ్రీ వై. కోటిరెడ్డిగారు, పంచాయితీబోర్డు ప్రెసిడెంటు, మేదరమెట్ల.
21. శ్రీ పోలినేని హనుమయ్యగారు,
పంచాయితీబోర్డు ప్రెసిడెంటు, దైవలరావూరు.
22. శ్రీ ఎన్. వెంకటస్వామిగారు, గ్రామ రయితు సంఘం అధ్యక్షుడు, పర్చూరు.
23. శ్రీ దుద్దెంపూడి సాంబయ్యగారు,
పంచాయితీబోర్డు ప్రెసిడెంటు, పాలపర్రు.
24. శ్రీ పి. వెంకటేశ్వర్లుగారు, శ్రీ వాకా వెంకట్రమణారెడ్డిగారు,
శ్రీ పాటిబండ్ల భద్రయ్యగారు. పొగాకు రైతులు, దొడ్డవరప్పాడు.
25. శ్రీ మంకిరెడ్డి నారాయణరెడ్డిగారు,
గ్రామ సేవాసంఘ ప్రెసిడెంటు, నెనిగండ్ల.
26. శ్రీ కందిమళ్ళ రామయ్యగారు, కార్యదర్శి, గ్రామరైతు సంఘం, వేలూరు.
27. శ్రీ కొల్లా చినవెంకయ్యగారు,
పంచాయితీబోర్డు ప్రెసిడెంటు, ఉప్పుటూరు.
28. శ్రీ వి. టి. నరసింహారెడ్డిగారు, కార్యదర్శి, గ్రామ రైతు కాంగ్రెస్, కంతేరు.
29. శ్రీ మద్దినేని పోతురాజుగారు,
ఆహారకమిటీ ప్రెసిడెంటు, దైవాలరావూరు.
30. శ్రీ కరణం రంగారావుగారు,
ప్రెసిడెంటు, తాలూకా రైతు సంఘం, నర్సారావుపేట.
31. శ్రీ నల్లపాటి ఆంజనేయులుగారు,
ప్రెసిడెంటు, రైతుసంఘం, జొన్నలగడ్డ.
32. శ్రీ నార్నె చిన్నపున్నయ్యగారు, గ్రామ కమిటి ప్రెసిడెంటు, వింజనంపాడు.

33. శ్రీ నూతక్కి వెంకటరంగారావుగారు,
అధ్యక్షుడు, కృష్ణా సిమెంటువర్కర్సు లేబరు యూనియన్, మంగళగిరి.
34. శ్రీ వి. వి. సుబ్బారావుగారు, అధ్యక్షుడు, ఫ్యాక్టరీ కార్మికసంఘం, మంగళగిరి.
35. శ్రీ యన్. పరసురామయ్యగారు,
అధ్యక్షుడు, గ్రామ పొగాకు ఉత్పత్తిదార్లసంఘం, నాగులుప్పలపాడు.
36. శ్రీ బి. వీరభద్రరావుగారు,
ఆహార కమిటీ అధ్యక్షుడు, ఉప్పుటూరు.

## V. పొగాకు ఉత్పత్తిదారులు.

1. శ్రీ చెరువు బాపనయ్యగారు, పరుచూరు.
2. శ్రీ లింగమల్లు బ్రహ్మయ్యగారు, ఉప్పుటూరు.
3. శ్రీ టి. వెంకటేశ్వర్లుగారు,
4. శ్రీ జంగా వెంకటప్పరెడ్డిగారు, లాం.
5. శ్రీ కుక్కపల్లి వెంకయ్యగారు, సబ్‌కమిటి ప్రెసిడెంటు, వేలూరు.
6. శ్రీ గొల్లపూడి గంగయ్యగారు,
వైస్ ప్రెసిడెంటు, ఫుడ్ కమిటీ, నాగులుప్పలపాడు.
7. శ్రీ ముప్పాళ్ళ వీరయ్యగారు,
పొగాకు మార్కెటు కమిటీ మాజీవైస్ ఛైర్మెన్, పొన్నెకల్లు.
8. శ్రీ దేవరపల్లి వీరారెడ్డిగారు,
ప్రెసిడెంటు, గ్రామపంచాయితీబోర్డు, ఇనమనమెళ్ళూరు.
9. శ్రీ సూర్యదేవర రాఘవయ్యగారు,
పొగాకు మార్కెట్ కమిటీ మాజీసభ్యుడు, వరుమళ్ళపాడు.
10. శ్రీ కొల్లా నారయ్యగారు, శ్రీ కె. వి. సుబ్బారావుగారు, అనంతవరం.
11. శ్రీ ఘంటా గోపాలకృష్ణయ్యగారు, పర్చూరు.
12. శ్రీ వి. కోటిరెడ్డిగారు, అంకిరెడ్డిపాలెం.
13. శ్రీ వుడుముల వెంకటసుబ్బారెడ్డిగారు, కొత్తరెడ్డిపాలెం.

# VI. పొగాకు వ్యాపారులు.

1. శ్రీ కె. రామకృష్ణమూర్తిగారు, బి. కాం. (ఆనర్సు),
పొగాకు మార్కెట్ కమిటీ మాజీసభ్యుడు, గుంటూరు.
2. శ్రీ పెద్ది చిన్న జానకిరామయ్యగారు, పాలపర్రు.
3. శ్రీ గట్టుపల్లి ఆంజనేయులుగారు, గుంటూరు.
4. మెస్సర్స్ చింతక్రింది కనకయ్య అండ్ కంపెనీ, మంగళగిరి.
5. మెస్సర్స్ టి. వెంకటకృష్ణయ్య అండ్ కో., పొగాకు వ్యాపారులు మంగళగిరి.
6. శ్రీ పి. అంకమ్మగారు, మెస్సర్సు ఎ. ప్రత్తిపాటి అండ్ కో.,
7. శ్రీ గాదె వెంకటసుబ్బారావుగారు,
పొగాకు ఉత్పత్తిదారు అండ్ వ్యాపారి, పరుచూరు.
8. మెస్సర్సు టి. శ్రీరాములు, యస్. పకీరయ్య అండ్ కంపెనీ, మంగళగిరి.
9. శ్రీ డి. రామారావుగారు,
సెక్రటరీ, ఇండియన్ టుబాకో యెసోసియేషన్, గుంటూరు.

# VII. స్థానిక సంస్థల తీర్మానాలు.

1. గ్రామ ఆహార కమిటీ, జొన్నలగడ్డ.

2. గ్రామ ఆహార కమిటీ, బొడ్డువారిపాలెం.

3. పొగాకు ఉత్పత్తిదారుల సంఘం, మేదరమెట్ల.

4. పొగాకు తూకపు కమిటీ, పమిడిపాడు.

5. ఆహార కమిటీ, మల్కాపురం.

6. ఆహార కమిటీ, మందడం.



# VIII. బహిరంగసభలు, అర్జీలు.

| వరుస నెం. | గ్రామము | | | సంతకములు చేసినవారి సంఖ్య |
|---|---|---|---|---|
| 1. | యండ్రాయి | ... | ... | 5 |
| 2. | కర్లపూడి | ... | ... | 3 |
| 3. | మందువవారిపాలెం | ... | ... | 12 |
| 4. | గంగవరము | ... | ... | 31 |
| 5. | అమ్మనబ్రోలు | ... | ... | 10 |
| 6. | నిడమలూరు | ... | ... | 18 |
| 7. | కరవాడి | ... | ... | 17 |
| 8. | ఉప్పుగుండూరు | ... | ... | 13 |
| 9. | చింతగుంపల | ... | ... | 7 |
| 10. | నాలూరు | ... | ... | 30 |
| 11. | నిడమలూరు | ... | ... | 19 |
| 12. | టంగుటూరు | ... | ... | 14 |
| 13. | కొనికి | ... | ... | 13 |
| 14. | త్రోవగుంట | ... | ... | 21 |
| 15. | ఏడుగుండ్లపాడు | ... | ... | 14 |
| 16. | చమళ్లమూడి | ... | ... | 50 |
| 17. | పోతవరము | ... | ... | 5 |

—:o:—

# ప్రజాభిప్రాయం

## శ్రీ దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు,

గుంటూరు.

గత 20 సం॥రాల్లోనూ మన జిల్లాలో పొగాకు పంట విపరీతంగా పెరిగిపోయింది. ప్రజా జీవితంలో నైతిక, ఆర్థిక దుష్ఫలితాలకు దారితీసే యీ పెరుగుదలను గురించి తీవ్రంగా ఆలోచించవలసి ఉంది. జిల్లాలో సాగు అవుతున్న 20 లక్షల యకరాల్లో దాదాపు $1\frac{1}{2}$ లక్ష యకరాలలో పొగాకు పండుతున్నది. వరి, జొన్న, రాగి లాంటి ఆహార పదార్థాలకు తావులేక, ఆహార కొరతకు యిదొక ముఖ్యకారణమైంది. జిల్లాలోని 9 తాలూకాల్లో 4 తాలూకాలే మాగాణి ప్రాంతాలు. మెట్టప్రాంతాల్లో పొగాకు అభివృద్ధి చెందటంచేత, ఆహార పదార్థములకు డెల్టా తాలూకాలమీద ఆధారపడవలసిన పరిస్థితివచ్చి, వడ్లధర పెరిగింది. భూవసతిలేని వివిధవర్గాల ప్రజలకూ, వ్యవసాయ కూలీలకు యిది దుర్భరంగా పరిణమించింది. అధికాహారోత్పత్తి స్కీములవల్లకూడా పొగాకు వ్యవసాయం తగ్గలేదు. కాంగ్రెసు మంత్రులు అధికారంలోకి రావటం, కరువు పరిస్థితులు—వీటివల్ల పొగాకు తగ్గుతుందనుకున్నాం. కాని అలా జరుగకపోగా కృష్ణా, పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి జిల్లాలలో పొగాకుపంట యెక్కువైంది. మద్రాసు ప్రభుత్వం యిటీవలచేసిన ఉత్తర్వులవల్లకూడా యెక్కువ ప్రయోజనం కలుగలేదు. పొగాకు ప్రజల ఆరోగ్యానికి హానికరం అని అందరూ అంగీకరించారు. సిగరెట్టువల్ల జీర్ణకోశానికి, ఊపిరితిత్తులకూ దెబ్బ తగులుతుంది. ఏటేటా పొగ త్రాగే అలవాటు వృద్ధి పొందు తోంది. 1929 లో నూటికి 28 మంది, యుద్ధానికి పూర్వం 54, అయితే యీనాడు నూటికి 68 మంది పొగ త్రాగుతున్నారు. దీనిని అరికట్టకపోతే, షుమారు 40 సం॥ రాల్లో దేశంలో అందరికీ యీ అలవాటు ప్రాకుతుంది. సభల్లో, సమావేశాల్లో, పెద్దమనుషుల సమక్షంలోకూడా యీ

అలవాటు మితిమీరిపోతున్నది. చివరకు బడి పిల్లలుకూడా పొగ త్రాగటం నేర్చు కుంటున్నారు. ఇంక ఉపాధ్యాయులు, పెద్దవాళ్ళసంగతి చెప్పనవసరంలేదు. స్త్రీలకుకూడా యిది అలవాటుపడిందా అంటే మనం అధోగతిపాలు అయినట్లే. పూర్వకాలం రైలు పెట్టెల్లో పొగ త్రాగరాదని నిషేధం ఉండేది. ఆనాడు త్రాగే వాళ్ళు తక్కువ కాబట్టి ఆ శాసనం అమలు జరిగింది. యివ్వాళ అధిక సంఖ్యా కులకు యిది అలవాటు పడటంచేత, అలవాటులేనివాళ్ళు మొదలకుండా కూచోక తప్పటంలేదు.

ఇన్ని దుష్ఫలితాలతోకూడిన పొగాకువల్ల రైతుకు మాత్రం ఏం లాభం? జిల్లాలోని 7, 8, కోట్ల రూపాయల పొగాకు వ్యాపారమంతా విదేశీయ పెట్టుబడి దారుల చేతుల్లోనే ఉంది. ఐ. ఎల్. టి. డి. యిందులో చాలా భాగం వ్యాపారం చేసి లాభం పొందుతున్నది. మార్కెటులోకి రాబోయేముందు వర్జీనియా పొగాకును క్యూర్ చేసి, గ్రేడ్ చేసి, రీడ్రై చెయ్యాలి. రైతు క్యూరు చెయ్యగలడు కాని సామాన్యంగా సరియైన పద్ధతిలో గ్రేడ్ చెయ్యలేడు. అతనికి దానికి తగిన విజ్ఞానంలేదు. అందుకని మంచిరకం పొగాకును వేరుచెయ్యలేక అంతా కలగాపుల గంగాచేసి తేవటంవల్ల, వ్యాపారి తన యిష్టం వచ్చిన ధర యిస్తానంటాడు. చెక్కను పగలగొట్టి, అటూయిటూ పరీక్షచేసి, ఉజ్జాయింపుగా తనకు తోచినంత ధర వ్యాపారి చెప్తాడు. ధర తనకు నచ్చకపోయినా రైతు యేమి చెయ్యనుగత్యం తరం లేక, తన సరుకు నిలబడి పోతుందేమోననే భయంతో ఆధరకే ఒప్పుకోక తప్పదు. తన సరుకు రీడ్రైచేయనందున చాలాకాలం నిల్వ ఉండదనే భయం రైతుకు ఉంటుంది. అందుకని రైతు వర్తకుడికి లొంగి పోతాడు. ఈ విధంగా రైతు నిస్సహాయస్థితిలోపడిపోతే, వర్తకుడు తన యిష్టంవచ్చిన ధరనే శాసిస్తాడు. కాని మళ్ళీరాడేమోనని, అంత తక్కువకాకుండా, ఒకమోస్తరు ధరనే నిర్ణ యిస్తాడు.

గుంటూరు పొగాకు మార్కెటు కమిటీవారు ప్రచురించిన "పొగాకు సక్రమ కనీసధరలు" అనే పుస్తకంలో వ్యాపారులు ఒకటోరకం పొగాకుకు 500 పౌనులు పుట్టికి కనీసం రు. 575 లు అయినా యివ్వవలసి ఉంటే, వ్యాపారులు రు. 432 మాత్రమే యిస్తున్నారు అని ఉంది. కాబట్టి పొగాకు వ్యాపారులు ఆర్జించే లక్ష

లాది లాభాలతో పోల్చుకుంటే రైతుకువచ్చే ధర న్యాయమైంది కాదని తేలుతున్నది. సత్యాన్ని, న్యాయాన్ని దృష్టిలో పెట్టుకొని ఆలోచిస్తే, వ్యాపారులు రైతులను దోచుకోకుండా ఉండేందుకు ఒక నిర్ణీతమైన కనీసధరను నిర్ణయించి అమల్లో పెట్టటం శ్రేయస్కరం.

శ్రీ మంతెన వెంకటరాజు గారు, ఎం. ఎల్. ఎ.,
మంతెనవారిపాలెం.

మార్కెటింగు కమిటీచే నిర్ణయించబడిన సబ్ కమిటీవారు నిర్ణయించిన కనీసపు ధరలన్నిటితోను ఏకీభవించుచున్నాను. అందులో అనుభవముగల వారిని కమిటీలో వేసినందున అందరూ ముఖ్యముగా రైతులయి యుండిన కారణాన రైతు శ్రేయస్సును దృష్టిలో వుంచుకొనియే యీ ధరల నిర్ణయముచేసి యుందురనుట కేవిధమైన సందేహములేదు. నేను నాశక్తి వంచన లేక గవర్నమెంటువారు యీ ధరల నంగీకరించుటకు ప్రయత్నము చేయుదును.

శ్రీ నడింపల్లి వెంకటలక్ష్మీనరసింహారావు గారు,
బారిష్టరు, గుంటూరు.

ఇంతవరకు దేశము పరాధీనమైనందున ప్రభుత్వమువారు తమ భాగ్యము పెంపుకొరకే యీ దేశములోని సస్య,ఖనిజముల సమూహమును యేదో విధముగా సాధ్యమైనంతవరకు తమ దేశమునకు రాబట్టుకొనుచుండుటలో ఉత్పత్తిదారుల మంచిచెడ్డలు కనుపెట్టు నవకాశము కలుగలేదు. అందువలన దళారిదండు ప్రబలుటయు ఉత్పత్తిదారులు ఋణగ్రస్తులగుటయు జరిగినది. దేశము రాజకీయ ఆందోళన వలన మేల్కొని తన ఆర్థిక దుస్థితి తెలుసుకొని కారణముల నన్వేషించ ప్రారంభించగా పారతంత్ర్యమే గాక దళారి దండుయొక్క స్వలాభా విజృంభణకూడ కారణమని తేటతెల్లమయ్యెను. దానికి ఫలితము ప్రజలలో ద్విగుణీకృత ఆందోళనము. ఈ ఆందోళనకొంత శమింపజేయుటకు ప్రభుత్వమువారు సహకార సంఘముల జనసామాన్యముయొక్క యుపయోగము నిమిత్తము యేర్పాటుచేసిరి. కాని వారికి పూర్తిగా సానుభూతి లేమిచేతను, దళారిదండు కుతంత్రములచేతను సహకారసంఘములు తీవ్రముగా పనిచేయలేకపోయెను.

రాజకీయ రంగములో నవయుగము ప్రారంభమైనది. రాజ్యము జనసామాన్యముయొక్క హస్తగతమగు సూచనలు కలుగుచున్నవి. ఇప్పుడు ఆర్థిక స్వరాజ్యములేని యెడల రాజకీయ స్వరాజ్యము వచ్చినను నిస్సారము, నిష్ప్రయోజనము. నూతన మంత్రులు దళారిదండుయొక్క ప్రబలత్వమును తగ్గించుటకు కంకణబద్ధులై యున్నారు. ఉత్పత్తిదారులయొక్కయు, వాడుక దారుల యొక్కయు సహకార సంఘములు విరివిగా స్థాపించుచున్న యీకాలములో పొగాకు ప్రపంచము పాత పద్ధతులలో దళారిదండు స్వాధీనములో నుండుట శోచనీయము. ఇందు మార్కెటింగ్ కమిటివారు చేయుచున్న కృషి అమోఘము ప్రశంసార్హము. వారు కేవలము కనీసధర నిర్ణయమందె నిమగ్నులుగాక, ఉత్పత్తిదారుల కల్పవృక్షమై పరదేశములలోని మార్కెట్లు అన్వేషించియు, రిడ్రైయింగ్ యంత్రముల తెప్పించియు, సహకారసంఘము నెలకొల్పియు సహస్ర బాహువులు గల సంస్థగా విరాజిల్లుటకు నేనాశించుచున్నాను.

ఇందు ప్రస్తుతము గమనించవలసిన విషయము కనీస ధర నిర్ణయము. ఈ విషయము కమిటీవారు విపులముగా ధరలు మొదలైనవి వివరించుచు పుస్తకమునొక దానిని ఆచ్ఛాదించినారు. పొగాకు వివిధదేశముల కెగుమతి అగుచుండుటచే కోట్లకొలది పెట్టుబడి పెట్టిన పెద్దకంపెనీలేగాక ఒక రిద్దరితోకూడిన స్వల్పకంపెనీలు కూడ మొలకలెత్తి ధరల ప్రపంచమును చికాకుపరిచి జ్ఞానోదయములేని ఉత్పత్తిదారులను తమ స్వలాభములకొరకు పూర్తిగా యుపయోగించుకొనుచున్నారు. ఉత్పత్తిదారగు రహితు విత్తనమునకు సేద్యమునకు ధనము లేక యున్నప్పుడు కంపెనీలవారు సహకారులవలె వారిని ఆకర్షించి వారిని అసమాన కంట్రాక్టులలో బద్ధులజేసి లోబరుచుకొనుచున్నారు. ఉదహారణకు ఎండు వర్జీనియా పుట్టి 1కి రూ. 237 లు సామాన్యముగా యీ కంపెనీలు యితర దేశములకు అమ్ముచున్నప్పుడు ఆసరకునే రహితులనుండి పుట్టి1కి రూ. 80 లు మొదలు రు. 135 లు వరకు కొనుచున్నారు. కొనుగోలు మొదలైన ఖర్చులు రూ. 50 లు కన్న కొనువారికి తగులుటలేదు. అట్టి సమయములో మెట్టభూమి రహితు సేద్యము విత్తనములు మొదలైనవాటిక్రింద యకరము ఒకటికి షుమారు రూ. 450 లు ఖర్చుపెట్టవలసివచ్చినచో రహితుకు ఎంత నష్టము కలుగుచున్నదో తేటతెల్లమగు

చున్నది. అదిగాక కొనువారందరైనను ఒకే ధర నిర్ణయించనందున కొనుగోలు దారుల చాకచక్యముల బట్టియు ఉత్పత్తిదారుల తిమిరశాతముల బట్టియు ధరలు యేర్పడుచున్నవి. ఇట్టి చిక్కులు తొలగించి ఉత్పత్తిదారులకు తగిన రక్షణ యొసంగవలయునన్న ప్రభుత్వమువారు కనీసధరల నిర్ణయ చట్టమును సాధ్యమైనంత త్వరలో అమలు పరచుట ముఖ్యావసరమైయున్నది.

శ్రీ చావలి సూర్యనారాయణగారు, గుంటూరు.

పొగాకు పండించుటలో తనుచేసిన శ్రమకు తగినప్రతిఫలాన్ని రైతుకు కలిగించే నిమిత్తం పొగాకు కనీస ధరల నిర్ణయం విషయంలో తీవ్రమైన కృషి చేస్తున్న మార్కెటుకమిటీ సభ్యులునూ, అధ్యక్షుణ్ణి నేను అభినందిస్తున్నాను. వారి కృషి. విజయవంతము కావలెనని అభిలషిస్తున్నాను.

శ్రీ జి. వి. పున్నయ్యశాస్త్రిగారు,
ప్రధానకార్యదర్శి, ఆంధ్రమహాసభ, గుంటూరు.

మీరు పొగాకు కనీసధరల గురించి పంపిన కరపత్రం అందినది.

ఆంధ్ర రైతాంగం 1930–40 ల మధ్య అనుభవించిన ఆర్థికక్షోభ అందరికి తెలిసినదే. ఋణభారము తట్టుకోలేక విచ్ఛిన్నమైన రైతుకుటుంబములు యెన్నియో నేనెరుగుదును. రైతాంగానిని రాబోవు ఆర్థిక దుస్థితినుండి కాపాడుటకు ముడి సరకుల కనీసధరలు నిర్ణయించడము అవసరమనేది నిర్వివాదాంశము. ఇందులో ముఖ్యమైన పంటలలో పొగాకు ఒకటి. గుంటూరు మండలములో వేలకొలది మెట్టరైతులు ముఖ్యముగా యీపంటను పండించెదరు. ఇదియే అత్యధికమైనపంట. ఈ సందర్భములో గుంటూరు పొగాకు మార్కెటు కమిటివారు యీ పంట యొక్క కనీసధరల నిర్ణయంకై కృషిచేయుచుండుట యెంతయు ప్రశంసనీయము. వీరు సలుపుచున్న కృషి. జయప్రదమగునని ఆసిస్తున్నాను.

శ్రీ దేశిరాజు కృష్ణశర్మగారు,
ప్రధాన కార్యదర్శి, జాతీయ విజ్ఞాన పరిషత్తు, గుంటూరు.

విదేశాలకు ఎగుమతితో కూడిన ప్రతివ్యాపారమందలి లాభము, ఆ వస్తువుల కనీసమైన కొనుగోలు ధరలమీద ఆధారపడి వుంటుంది. ఒక నిశ్చయమైన

వ్యవస్థలేని నేటి, మన దేశవర్తకులు చేయు విదేశవ్యాపారం డబ్బుగల మధ్య మనుష్యుల పోటీలకులోనై ఆవస్తువుల ఉత్పత్తిదారులు ఈ ఎగుమతి వ్యాపారంలో పూర్తిగ విస్మరింపబడుతున్నారు. నేడు మన ఆర్థిక, సాంఘిక, రాజకీయ వ్యవస్థలను అభ్యుదయ జీవిత దృక్పథంలో సరి దిద్దుకోవలెననే భావ చైతన్యం అంతటా ప్రసరిస్తున్న ఈ రోజులలో ప్రధాన ఎగుమతి వ్యాపారాలలో ఒకటైన పొగాకుకు కనీసధరలను నిర్ణయించేయడం అంతకష్టమైనపని కాదు. ఒక వ్యాపారంలో ఎక్కువలాభము పొందడము నేటి తిరుపతికొండ నెక్కడంగా భావించుకుంటే ఆవస్తువుకు కనీసధరలను నిర్ణయించడం ఆకొండకు మొదటి మెట్లను ఎక్కడంవంటిది. తిరుపతికొండ నెక్కి దేవదర్శనం చేయడం అందరికీ, అందులో ప్రత్యేకంగా హరిజనులకు అవకాశం కల్పించుదామనే ఒక విశాల సంఘ ఐక్యతా భావం నేడు సర్వత్రా వినబడుతున్నది. మరి పొగాకును పండించే రైతుకు సక్రమ కనీస ధరలను నిర్ణయించినప్పుడు-ఆ రైతు కొండనెక్కినట్లు సంతోషిస్తాడు.

దేశంలోని అంతరవ్యాపారం - కొద్దిపెట్టుబడులకు సంబంధించినవి-ప్రత్యేక వ్యక్తుల చేతుల్లో ఉంచవచ్చును. గాని ప్రభుత్వపు కంట్రోలు, ధరలను నిర్ణయించడంలో, చాలాఅవసరం. అంతర్జాతీయమైన ప్రతివ్యాపారం ప్రత్యేక వ్యక్తుల చేతుల్లో ఉంచకూడదు. వేరుశెనగ వ్యాపారాన్నే-విదేశాలకు ఎగుమతికి సంబంధించినంతవరకు-తమ స్వాధీనం చేసుకున్న మద్రాసు ప్రభుత్వం ఈ పొగాకు విదేశ వ్యాపారాన్నికూడా తమ స్వాధీనంచేసుకోవలయును. పొగాకుకు సక్రమ కనీస ధరలతో పాటు ఆశ్రామికులకు కనీస వేతనాలనుకూడా త్వరలో నిర్ధారణచేయాలి. క్రొత్తగా పొగాకు వ్యాపారాన్ని సంకల్పించుకొనే వారలకు లైసెన్సులు ఇవ్వకూడదు. ఈవ్యాపారం ఎడల వ్యామోహాన్ని, పోటీని - ప్రజలలో నిర్మూలనం చేయాలి.

శ్రీ యం. హనుమంతరావుగారు,

కార్యదర్శి, జిల్లా కమ్యూనిష్టు కమిటీ, గుంటూరు.

వివిధరకాల పొగాకుకు కనీస ధరలను నిర్ణయించి అమలుజరిపే సందర్భంలో, పొగాకు ఉత్పత్తిదార్లకు అత్యవసరమైన యిలాంటి స్కీమును అమలు జరుపుచున్నందుకు పొగాకు మార్కెటుకమిటీ వారిని అభినందిస్తున్నాను. పొగాకువచ్చే

ధరలలో ఉత్పత్తిదార్లకు కొద్దిభాగం కూడ రావడంలేదు. రైతులు మార్కెటు లోని ధరల వ్యత్యాసాల వల్ల యెక్కువగా దెబ్బతింటున్నారు. మీరు పంపించిన పొగాకు సారస్వతం చూశాను. ముఖ్యంగా శ్రీ సి. వి. యస్. శ్రేష్టిగారు వ్రాసిన పుస్తకాన్ని కూడా చదివాను. మీరు చేస్తున్నకృషి అభినందింపదగింది. మీరు ప్రకటించిన కనీస ధరలు మొత్తంమీద సంతృప్తికరంగానే ఉన్నాయి. కాని నాటు పొగాకుకు మాత్రం రు. 135 లు నిర్ణయించటం న్యాయంగాలేదు. కష్టజీవుల పార్టీగా ప్రసిద్ధి కెక్కిన కమ్యూనిష్టుపార్టీ సభ్యుణ్ణిగా, నా అభిప్రాయం యేమంటే- పొగాకుకు వచ్చేధరలలో వర్తకునికి నూటికి 6 వంతుల న్యాయమైన లాభము, యితర రాకపోకల ఖర్చులూపోను, మిగిలినదంతా రైతుకు చెందవలసిందే. మార్కెట్ కమిటీకిఉండే అధికారాలు పరిమిత మైనవని నాకు తెలుసు-యితర అడ్డంకులను కూడా నే నెరుగుదును. అయినప్పటికీ, మార్కెటులో స్వార్థపరుల యిష్టానుసారం జరిగే ధరల హెచ్చుతగ్గులను ఆపేందుకై మీరు చేస్తున్నకృషిని నేను అభినందిస్తున్నాను. ఈ విషయంలో మీకు సంపూర్ణసహాయం చెయ్యటానికి మేము యెల్లప్పుడూ సిద్ధమే.

శ్రీ నండూరి ప్రసాదరావుగారు,

కార్యదర్శి, ఆంధ్రరాష్ట్ర రైతు సంఘం, బెజవాడ.

మన రాష్ట్రంలో రైతుకువచ్చే ఆదాయం చాలా స్వల్పం. దానితో కుటుం బాన్ని పోషించటం దుర్లభమైపోతోంది. అందుచే, పొగాకు, వేరుశనగ మున్నగు వ్యాపారపంట లేమైనా వేస్తే నాలుగురాళ్ళు అదనంగా చేతులోపడుతాయేమో నన్న ఆశతో, వున్న చారెడంత భూమిలో, చేత్రాడు జాగాలో ఈ వ్యాపార పంటలు వేస్తున్నాడు. ఈ విధంగా వ్యాపారపంటలు రైతుల జీవనంలో చాలా ప్రధానస్థానాన్ని ఆక్రమిస్తున్నవి.

అయితే రైతు ఈ పంటలను తాను తింటానికికాదు: అమ్ముకుంటానికి గాను పండిస్తున్నాడు. కాని ఈనాడు సరియగు మార్కెటింగు కంట్రోలులేదు. సరుకుకు వ్యాపారస్థుడు ఎంత ధరయిస్తే రైతుకు అంతే భాగ్యం. మధ్యదళారీలు అనేకం. సరుకుకు, కొనుక్కొనేవారిచ్చేధరలో 1/4 వంతుకూడా రైతుకు ముట్ట

టుంలేదంటే అతిశయోక్తి కాదు. పైగా ఈ వ్యాపారపంటలు అంతర్జాతీయ మార్కెటు పోటీకి తట్టుకోవాలి. ప్లాను, కంట్రోలులేని నేటిపెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలో, స్వేచ్ఛావాణిజ్యంలో ఇందువల్ల రైతులు ఎంతో దెబ్బతింటున్నారు. ఆర్థికక్షోభలో వ్యావసాయిక పంటలే ముందుగాను, హెచ్చుగాను పడిపోతాయి. ఇందువల్ల ఎంతో ఆశతో హెచ్చుపెట్టుబడులుపెట్టి వ్యాపారపంటలను పండించే రైతు మట్టమై పోతాడు. 1930 లో మన దేశములో సంభవించిన ఆర్థిక క్షోభను చూస్తే ఈ సత్యం బోధపడుతుంది. ధరల పతనం మూలంగా అనేక లక్షల రైతు కుటుంబాలు సర్వనాశనమై పోయినవి.

ఈ విధంగా రైతు దెబ్బతింటానికి ప్రధాన కారణాలలో ఒకటి మార్కెటు మీద కంట్రోలు లేక పోవటం: ధరల నిర్ణయం లేక పోవటం. ఇందువల్ల రైతులే నష్టపడుతారన్నది ప్రస్తుత పరిస్థితులను బట్టే తెలుసుకోవచ్చును. బజారులో అన్ని సరుకుల ధరలు విపరీతముగా పెరిగియున్నవి. కాని రైతులు పండించే పంటలకు మాత్రం చాలా స్వల్పధరలే వున్నవి. ఈ ధరలకైనా నిలకడలేదు. రైతులు కొనే జీవితావుసరవస్తువుల ధరలు యింకా పెరుగుతున్నవిగాని రైతుల పంటల ధరలు మాత్రం తగ్గుతున్నవి. సిగరెట్లు, బట్టలు, నూనెలు, బియ్యం మున్నగు వాటికి ఈనాడున్న ధరల ప్రకారం రైతుల పొగాకుకు పత్తికి, వేరుశనగ మున్నగు కాయలకు, వడ్లకు ధరలు యివ్వబడటంలేదు. ఇందువల్ల రైతు విశేషమగు కష్ట నష్టములకు గురియాతున్నాడు. దొంగ వ్యాపారంలో విపరీతంగా దోచుకోబడుతూ వున్నాడు.

దీనివల్ల ముందుముందు రైతుకు మరీ ప్రమాదం వాటిల్లగలదు. పెట్టుబడిదారీవిధానంలో అప్పుడప్పుడూ ఆర్థిక క్షోభ రావటం ధరలు పడిపోతూవుండటం, ఆ పడిపోవటంలో రైతులపంటల ధరలే హెచ్చుగా పడిపోతూ వుండటం సహజం. ఇట్టి ఆర్థిక క్షోభ త్వరలో సంభవించవచ్చును. అమెరికాలో షేరు మార్కెటులో ఇది అప్పుడే ప్రారంభమైంది. పెట్టుబడిదారీ దేశాలన్నింటిలోకి బలమైన అమెరికాలోనే ఇది ప్రారంభమైతే, తక్కిన పెట్టుబడిదారీ దేశాలలో రావటానికి ఎంతోకాలంపట్టదు. ముఖ్యంగా ఈ బలహీనదేశాలే మరీపతనమై పోయేది.

అందుచేత, రాబోవు ఆర్థిక సంక్షోభంలో కొంతవరకైనా రైతులకు రక్షణకల్గ జేయాలంటే మార్కెట్టును అదుపు ఆజ్ఞలలో వుంచటం, పంట సరుకులకు ధరల నిర్ణయం గావించటం అత్యవసరం.

ఈ అవసరాన్ని గుర్తించియే ఆంధ్రరాష్ట్ర రైతు సంఘం ఉవ్వెత్తుగాలేచి పోయిన జీవితావసరవస్తువుల ధరలను తగ్గించి, కంట్రోలు చేయాలనియు, రైతులు పండించే ధాన్యాలకు, పొగాకు, వేరుశనగ, పత్తి, మున్నగు పంటలకు కనిష్ట ధరలను నిర్ణయించవలెననియూ, అన్నింటి ధరలను నిలకడగా వుంచాలనియూ ఆందోళన జేస్తూవుంది. ఇందువల్ల ఒడుదుడుకు సమయాలలో, రైతుల పంటల ధరలు మరీపడిపోవటం అనేది జరగదు. ఒక న్యాయమైన ధరయైనా వస్తుందనే హామీ రైతుకు వుంటుంది. రైతు కొనుక్కోవలసిన జీవితావసరవస్తువుల ధరలుకూడా రైతుకు అందుబాటులో లేకుండా అమాంతంగా లేచిపోతాయనే భయమూ వుండదు. అందుచే ధరల కంట్రోలుయన్నది రైతాంగముయొక్క ప్రధాన కోర్కెలలో ఒకటై యున్నది. పొగాకుకు కనిష్టధరలను నిర్ణయించాలని గుంటూరు టుబాకో మార్కెటు కమిటీకూడా ఆందోళనజేయుటకు పూనుకొన్నందులకు కమిటీవారిని అభినందిస్తున్నాను.

ఈ విధంగా నికరమైన ధరలు వుండాలని ఒక్క రైతుసంఘమేకాదు: అనేకమంది ప్రముఖ ఆర్థిక శాస్త్రవేత్తలుకూడా కోరివున్నారు. వ్యవసాయార్థిక శాస్త్రంలో పరిశోధనలుగావిస్తున్న "ది యిండియన్ సొసైటీ ఆఫ్ అగ్రికల్చరల్ ఎకనమిక్స్" కూడా కోరివున్నది. చివరకు కేంద్ర ప్రభుత్వంచే నియమింపబడిన కృష్ణమాచారి కమిటీకూడ కోరిఉన్నది. కొంతవరకు, ఫుడ్ హెడ్ కమీషన్ కూడా అంగీకరించినది. అయినా, ఇందు విషయమై కేంద్ర ప్రభుత్వము, రాష్ట్ర ప్రభుత్వము కూడా కాలయాపనచేస్తూ వుండటం విచారకరం.

కాబట్టి, 'పొగాకు కనీస ధరలు' అన్న మీ కరపత్రం తగుసమయంలో ప్రకటింపబడి నందులకు, దాని రచయిత శ్రీ సర్వయ్యశ్రేష్ఠిగారిని, ప్రకటన కర్తలూ, ప్రోత్సాహకులూ అగు మార్కెటు కమిటీవారిని అభినందిస్తున్నాను. కరపత్రములోని అన్నివాదనలతోనూ నేను ఏకీభవించలేక పోయినా, వారినిర్ణయ

ములతోనూ, కోర్కెలతోనూ ఏకీభవిస్తున్నాను. పొగాకువేసే భూములకు కవుళ్లు ఎందుకు ఎక్కువగావున్నవి అన్నవిషయముపై వారుచూపిన లాభ నష్టాల లెక్కలతో నేను ఏకీభవించను. అయినా, ఇట్టి స్వల్ప పొరపాట్లు సరియగు ప్రధాన నిర్ణయములకు వచ్చుటకు అభ్యంతర కరములు కాలేదు.

ఏఏరకాల పొగాకుపై ఏఏకనిష్ఠ ధరలు నిర్ణయించాలి అన్నవిషయంపై నేను ఎక్కువగా వ్రాయదలచలేదు. పొగాకు వుత్పత్తిదారులు, వ్యాపారులూ కూడియున్న మార్కెటు కమిటీవారు ఈ పనిని జేయ సమర్థులు. కాని ఏ సూత్రాలపై ధరలు నిర్ణయింపబడాలి అనేదే ప్రధానం. ధరలను నిర్ణయించడంలో ముఖ్యంగా గమనించవలసినవి (1) ఉత్పత్తి ఖర్చులు (2) ఉత్పత్తిదారుని జీవన ప్రమాణం: అనగా రైతుకొనే ఇతర జీవితావసర వస్తువుల, ఇతర సరకుల ధరలు. (3) తిరిగి పంటను పండిస్తానికి ప్రోత్సాహం కల్గించేటట్లుగా లాభం. అంటే "ప్యారిటీ ప్రైసెస్" (ఇతర జీవితావసర వస్తువుల ధరలకు అనుగుణ్యంగా వుండే ధరలు) నిర్ణయింపబడాలి. ఈ ప్రధాన విషయాలను గమనించనిచో, రయితుల పంటలకు తక్కువ ధరలు నిర్ణయింపబడటం, వారికి అన్యాయంజరగటం సంభవిస్తుంది. కనిష్ఠ ధరలను నిర్ణయించుటను గూర్చి ఆలోచించునపుడు మార్కెటు కమిటీ ఈ విషయాలను దృష్టిలో వుంచుకుంటుందని ఆశిస్తాను. శ్రీ సర్వయ్య శ్రేష్ఠిగారు సూచించిన ధరలు కొంతవరకూ సక్రమమేనని అంగీకరిస్తున్నాను.

పొగాకుకు సక్రమ కనీసధర నిర్ణయింపబడాలన్న మీ మార్కెటు కమిటీ ప్రధాన కోర్కెను ఆంధ్రరాష్ట్ర రైతుసంఘం పూర్తిగా బలపరుస్తూ, ఇందుకై జరిగే ఆందోళనలో కమిటీకి సర్వవిధాల తోడ్పడగలదని తెలియజేయుచున్నాను.

**శ్రీ గుమ్మడిదల వెంకటసుబ్బారావు గారు,**
**"గోష్ఠి" బెజవాడ.**

ఒక్క విషయము మాత్రము నేను రూఢిగ చెప్పగలను. మనదేశమందలి ప్రస్తుత ధరలన్నియు హిమాలయ శిఖరములకు గాక పోయినను, వింధ్యాఎత్తుల కైనను పోయినవి. ఒక వైపు పన్నుపోటు-రెండవ వైపు యుద్ధకాలపు పెంపుదల (inflation) ఇవి అన్ని వస్తువులకు సంబంధించినవి. త్వరలో యీధరలు కొంత

వరకైన తగ్గనిచో యీ దేశమంతయు అరాజక మయముకాక తప్పదు. ఇందు ఉత్పత్తిదారు, విక్రయదారు, కొనుగోలుదారు, ప్రభుత్వము తోడ్పడుబాధ్యత ఎల్లరిదియు నైయున్నది.

జనాబ్ యస్. మహబూబ్ సాహెబ్,
కార్యదర్శి, జిల్లా ముస్లింలీగ్, గుంటూరు.

నేను సబ్ కమిటీలో సభ్యునిగా యుండుటకు అంగీకరిస్తూ యున్నాను. నేటి పరిస్థితులలో రయితులకు పొగాకు ధర నిర్ణయించుట చాలా అవసరము. రైతులకు మీరు చేసే యీసేవను నేను అభినందించుచు కమిటీ సభ్యుల యీప్రయత్నం జయంపొంద గలుగుతుందని ఆశించు చున్నాను.

శ్రీ కంఠంనేని కోటేశ్వరరావుగారు,
కార్యదర్శి, తెనాలి తాలూకా కమ్యూనిస్టు కమిటీ.

శ్రీ వాసిరెడ్డి నారాయణరావుగారు,
అధ్యక్షుడు, తెనాలి తాలూకా రైతు సంఘం.

గుంటూరు జిల్లాలో దాదాపు 1 లక్ష యాభై వేల యెకరాలలో పుగాకు పండించబడుతున్నది. పొగాకు పంట మెట్ట తాలూకా ప్రజలకు ప్రధాన ఆదాయంవచ్చే పంటగా ఈ నాడు తయారయింది. వేలాది మెట్ట తాలూకా రైతాంగంయొక్క జీవిత మార్గాలకే పొగాకుపంట ఆధారమవుతుంది. అటువంటి స్థితిలోవున్న పొగాకు, ప్రపంచంలోవచ్చే ఆర్థిక ఒడుదుడుకులలో మునిగి పోకుండా ఉండేందుకుగాను, సక్రమమైన కనీస ధరలు నిర్ణయింపబడుట అత్యంత ప్రధానమైన విషయం. గుంటూరు జిల్లా మార్కెటింగు కమిటి ఈ సమస్యను ప్రజల్లోకి తీసికొని వచ్చి, సరియైన ఆందోళనచేసి రయితులు తమపంటలకు కావలసిన రక్షణలు సంపాదించుకునేందుకు దారి చూపినందులకు అభినందించుతున్నాము.

పుగాకు పండించే రయితు తన అవసరాలకొద్దీని, ఎక్కువకాలం నిల్వచేసే శక్తిలేకను, నిల్వచేస్తే రంగుపోయి పూర్తిగా నష్టపడుతాననే భయంతోను, నిల్వ చేసుకునేందుకు అవసరమైన పెట్టుబడి, ప్రభుత్వ సహాయంలేకను పొగాకు తయారు కావటంతోనే మార్కెటుకు తీసికొనివచ్చి అమ్ముకుంటున్నాడు. అందువలన తన

సరకుకు సక్రమమైన ధర రాబట్టుకోలేక పోతున్నాడు. రయితు పండించిన పుగాకును నిల్వచేసి అమ్ముకుంటున్న వ్యాపారులు లక్షలు గడించుతుంటే పండించే రయితు ఖర్చులు మినహా, కుటుంబ అవసరాలుగూడ గడుపలేనిస్థితిలో ఉండి పోతున్నాడు.

ఈ స్థితినుండి రయితు బయటపడటానికిగాను, వ్యాపారస్థులు తమ యిష్టం వచ్చిన ధరను రయితులపై రుద్దకుండా కాపాడేందుకుగాను కనీస ధరల నిర్ణయం అవసరం. పొగాకు మార్కెటింగు కమిటీవారు ప్రకటించిన రేట్లు సరసమైనవిగానే ఉన్నవి. కాని ఈ సంవత్సరం వర్షాలవల్ల రెండు మూడు సార్లు మొక్క వేయ వలసివచ్చుటచే పండించే రయితులు అధికకష్టనష్టాలకు లోనుగావలసివచ్చింది. అందుచే కమిటి ప్రకటించిన ధరలు ఈ సంవత్సరమునకు గిట్టుబాటు కాజాలవు. కాన ఈ సంవత్సరానికి, ప్రకటించిన రేట్లపై షుమారు 16% వరకు పెంపకంతో ధరలునిర్ణయించిన రయితులకు న్యాయము గల్గును.

కనీస ధరల నిర్ణయం జరగటంతో రయితుల యిబ్బంది తీరదు. వ్యాపారస్థుడు ఆధరలకు కొనకుండా రయితులను యిబ్బందికి గురిచేసే అవకాశం ఉన్నది. సరకు నిల్వచేసికొని ధర వచ్చినపుడు అమ్ముకొనటానికిగాను, సరకుమీద అప్పు యిచ్చే పద్ధతిని సహకార సంఘాలద్వారా ఏర్పాటు చేయటంద్వారా రయితులకు తమ సరకును అనుకూలమైనపుడు అమ్ముకునే అవకాశం ఏర్పడుతుంది.

రయితు తన సరకును అప్పుచేసి నిల్వచేసికోవాలంటే ప్రమాదం మరొకటి ఎదుర్కొంటున్నది. సరుకును నిల్వచేస్తే ఉన్నరంగు కాస్త పోయి అసలుకే ముప్పువచ్చే పరిస్థితి యేర్పడుతుంది. కాన బారన్లమీదనుండి తీసి తయారుచేసిన పొగాకు నిల్వ ఉండినా చెడకుండా చేసికొనేందుకుగాను రిడ్రైయింగ్ యంత్రాలను ప్రజలకు అందుబాటులో ఉండేలాగ ప్రభుత్వం యేర్పరచి సరకు చెడిపోకుండా సదుపాయం కలిగించుకునేందుకు అవకాశం కల్పించవలెను.

గ్రేడులవారీగా మార్కెటింగు కమిటి నిర్ణయించిన ధరలు సరసంగా ఉన్నవి. కాని రయితుకు వచ్చే యిబ్బంది ఆగ్రేడులు చేయించటంలో వస్తున్నది. ఒకటి ఏగ్రేడ్ అయినది నిర్ణయించేది వ్యాపారి అవుతున్నాడుగాని పండించి

తయారుచేసిన రయితుగానటంలేదు. రయితులు ఏదో తమకున్న కొద్దిపాటి అనుభవాలతో గ్రేడ్ చేయించటం, అదిసరిగా రావలసిన గ్రేడ్ క్రిందికిరానందున తక్కువ ధరలు రావటం వల్ల సరియైన ఫలితాన్ని పొందలేక పోతున్నారు. కాన గ్రేడింగు యిన్‌స్పెక్టర్లను యేర్పాటుచేసి, గ్రేడింగు సెంటర్సు యేర్పాటుచేసి మార్కెటింగు కమిటివారు సక్రమ గ్రేడింగు పద్ధతిని అలవర్చేలాగున చేయుట అవసరము. దానికి ప్రభుత్వం పూనుకొని మార్కెటింగు కమిటిద్వారా చేయించవగును.

రయితులు పండించిన పొగాకు దళారీల చేతులలోగుండా పోయి పంట దాలకకంటే దళారీలు విపరీత లాభాలు ఆర్జించే పద్ధతిని పోగొట్టి, రయితు సరాసరి తన సరకును ఒక నిలకడగల మార్కెటింగు సెంటరులోపెట్టి అమ్ముకోటం ద్వారా సక్రమ ధరను పొందగలడు. ఈ పద్ధతుల నవలంబించి పొగాకు పండించే రయితులకు మేలుకల్గించగోరుచున్నాము.

రయితుల ఓట్లతో ప్రభుత్వంలో ఉన్న ఈనాటి ప్రజా ప్రభుత్వం పొగాకు రయితుల యిబ్బందులను తీర్చుటకు, రయితులకు సక్రమ ధరవచ్చేలాగ చేయుటకు పూనుకోవాలనియు, గుంటూరు జిల్లా మార్కెటింగు కమిటీవారు కనీస ధరల కొరకై చేస్తున్న కృషిని అభినందించుతు, రయితు సేవకులంతా పార్టివిభేదాలు లేకుండా, వ్యాపారులబారినుండి రయితును కాపాడ గోరుచున్నాము.

### శ్రీ టేకుమళ్ళ రామచంద్రరావు గారు, యం. ఏ., బి. యల్.,

మాజీకార్యదర్శి, ఆంధ్రమహాసభ, బందరు.

తమరు పంపిన "సక్రమ కనీస ధరలు" అను పుస్తకమును చూచినాను. కనీస ధరలు నిర్ణయించుట అత్యవసరము అనుట నిస్సందేహము. తగిన ఆందోళన చేసి సరియైన కనీసధరలు నిర్ణయము అయేలాగున కృషిచేయవలెను. ప్రజా నాయకులు ప్రభుత్వమువారు ఇందులకు తోడ్పడుట తప్పదు. మీ ప్రయత్నము సఫలము కాగలదు.

జనాబ్ మహమ్మద్ మస్తాన్ సాహెబ్,
సెక్రటరీ, అంజుమాన్-ఇ-ఇస్లామియా, గుంటూరు.

ఈ పుస్తకం (పొగాకు సక్రమ కనీస ధరలు) లో వివరించిన 15 సూత్రాల లోనూ మధ్య దళారీలు రయితులకు ఎంత హానిజేస్తున్నారో విపులంగా విశదీకరింపబడింది. అనేక సంవత్సరాలనుంచీ అమాయక పొగాకు రయితులు మధ్య దళారీలచే, వర్తకులచే దోపిడి చేయబడుతూ గత్యంతరం లేక మౌనముద్ర వహించి, కష్టాలను ఓర్పుతో సహించారు. మార్కెటు కమిటీ చేస్తున్న నిరంతర కృషి ఫలితంగా రయితులోకంలో జ్ఞానోదయమై, పొగాకుకు కనీసధరల నిర్ణయ సిద్ధాంతం విరివిగా ప్రచారం చేయబడుచున్నది. ఈ దోపిడి ఆగేసూచనలు కనిపిస్తున్నవి. కనీస ధరలను నిర్ధారణచేసి సూచించే సందర్భంలో యీ పుస్తకంలో వివరించబడిన అనేక విషయాలు యదార్ధములు. కనీస ధరలు అమలుపరచని యెడల రైతులు క్షీణించుటయే కాకుండా ప్రభుత్వానికికూడా యెక్సైజుపన్ను తగ్గిపోతుంది. ఇలాంటి రక్షణ లేకపోయినట్లయితే, రైతుకు పొగాకు మీద శ్రద్ధ తగ్గిపోయి పంట క్రమంగా సన్నగిల్లిపోయే అవకాశం యెంతైనావుంది.

శ్రీ గోగినేని వెంకటసుబ్బయ్యగారు,
మాజీకార్యదర్శి, గుంటూరు పొగాకు మార్కెటు కమిటీ, ఈతేరు.

పొగాకు పంటకు సంబంధించిన విషయములు తెలిసిన అనేకమంది స్నేహితులతో సంప్రదించి, ఉత్పత్తి ఖర్చులు వివరంగా సేకరించినాను. య 1 కి ఖర్చు రు. 490 లు అవుతుంది. నేను సంప్రదించిన స్నేహితులందరూ 'పొగాకు సక్రమ కనీస ధరలు' అనే పుస్తకంలో 19 వ పేజిలో మీరు ప్రకటించిన రేట్లు సంతృప్తికరంగానే ఉన్నవనే అభిప్రాయం వెలిబుచ్చారు.

ఉత్పత్తి ఖర్చుల వివరాలు :

| | | | |
|---|---|---|---|
| కవులు | ... | ... | రు. 200 |
| దుక్కి | ... | ... | 40 |
| కలుపు | ... | ... | 4 |

| | | | |
|---|---|---|---|
| ఎరువు | ... | ... | రు 50 |
| నారు | ... | ... | 40 |
| నాటు | ... | ... | 10 |
| బేరన కూలి | ... | ... | 25 |
| బేరన్ అద్దె | ... | ... | 30 |
| బొగ్గు | ... | ... | 30 |
| కొస | ... | ... | 10 |
| బాడుగ (ఆకుతోలకం) | ... | | 8 |
| బొగ్గు వేయువారికి కూలి వగైరా | | | 10 |
| కిరొసిన్ | ... | ... | 1 |
| గ్రేడింగ్ | ... | ... | 15 |
| చెక్కులు కట్టుటకు | | ... | 5 |
| పట్లలు వగైరా | | ... | 2 |
| చేర్చబడని హంశములు | | | 10 |
| | | మొత్తం రు. | 490 |

శ్రీ యం. అర్. ఆరాధ్య యల్. ఐ. యం., అండ్ బి. ఎ. యస్.,

ఆధ్యక్షులు, గుంటూరు జిల్లా వైద్యమండలి, మంగళగిరి.

గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీవారు పొగాకుకు నిర్ణయించిన గ్రేడ్లు, ధరలు న్యాయసమ్మతంగానే ఉన్నవి. ఈ నాడు పొగాకు రయితులు తాము పండించిన పొగాకుకు తక్కువ ధరలను మాత్రమే పొందగలుగు తున్నారు. తాము నిర్ణయించిన కనీస ధరలకు త్వరలో ప్రభుత్వ అనుమతిని పొందవలసినదని కమిటీవారిని కోరుతున్నాను.

శ్రీ కె. సత్యనారాయణరావుగారు,

మెంబరు, ఐ. సి. టి. సి., ఖమ్మంమెట్.

మీరుచేయుచున్న కృషి అత్యావసరము. కనీస ధర నిర్ణయము యిది వరకే ఎంతకాలమందో జరిగియుండవలసినది. యీ సంవత్సరం వర్షాధిక్యతవల్ల రయితులు పడరానిపాట్లుకున్నా, చాలా ధననష్టమునకు కూడా లోనై యుండిరి గాన మీరుదహరించిన కనీస ధర నిర్ణయము జరుగని యడల రయితు లోకముకు తీరని హాని నిరుత్సాహము కల్గ గలదు. కాబట్టి తమరు యీ విషయములో తీవ్రకృషి సల్పి తమ వుద్యమములో సంపూర్ణ విజయమునకై ఎంత త్యాగమయినను చేయగలరని నమ్ముచున్నాను. పూర్తి రయితు లోకము మీవెంట వుండగలదని నమ్ముతూ అచ్చట కాంగ్రెసు గవర్నమెంటు కావున ప్రజల యిబ్బందులను వెంటనే గుర్తించుకొని తగుచర్య తీసికోగలదని నమ్ముచూ మీకు నై జాంస్టేటు తరఫునుండి సంపూర్ణ సహకారము చేయ ప్రయత్నించెదను.

శ్రీ నీరుకొండ వెంకటరామా రావుగారు,

కార్యదర్శి, తూర్పు గోదావరి జిల్లా కాంగ్రెస్ కమిటి,

పొగాకు రయితాంగము తరఫున మీరు చేయుచున్న కృషిచాల ప్రశంస నీయము.

ఆ పుస్తకములో వ్రాసిన సక్రమ కనీసధరలకు ఈ సంవత్సరపు ప్రత్యేక పరిస్థితులను బట్టి పుట్టి 1 కి రూ. 75 లు ఎక్కువ కలిపిన బాగుండునని నా అభిప్రాయము.

శ్రీ కాశంగి వెంకటరత్నంగారు,

అధ్యక్షుడు, పట్టణ కాంగ్రెస్ కమిటి, మంగళగిరి.

ప్రతి వస్తువుకు వుత్పత్తిదారునకు నష్టములేకుండా కనీసధర నిర్ణయించు టయు, ఆహార పదార్థములు కొంత విపరీతముగా వున్నందున రయితు సోదరులు ఆహార పదార్థములకు ప్రాముఖ్యమునిచ్చి పండించిన యడల దేశములో కరువు కాటకములు రాకుండా తోడ్పడిన వారగుదురని తలంచుచున్నాను.

### శ్రీ పెద్ది హనుమయ్యగారు,

వర్కింగు కమిటి మెంబరు, తాలూకా కాంగ్రెసు, బాపట్ల.

మీరు ప్రకటించిన కనీసపు ధరల విషయపు కరపత్రములను, పుస్తకమును చదివినాను. కనీస ధరలు నిర్ణయించుట రయితుకు చాలా అవుసరమని నమ్ము చున్నాను.

### శ్రీ యేళ్ల రామశేషారావుగారు,

ఆర్గనైజరు, పెదవడ్లపూడి ఏరియా కమ్యూనిస్టుపార్టీ.

పొగాకు రయితు లందరు ఈనాడు కనీస ధరల నిర్ణయములేక చాలా యిబ్బంది పడుచున్నారు. ఏలాగైతే పరిశ్రమలలో పనిజేసే కార్మికులకు ఇతర ప్రభుత్వోద్యోగులకు కనీస జీతాల నిర్ణయము చేస్తున్నారో, ఏ విధముగ ఇతర ముగ రయితులు పండించే ధాన్యానికి ఇతర వస్తువులకు కనీసధరలు నిర్ణయించారో అదేవిధముగ పొగాకు పండించే రయితులకు కూడ కనీస ధరల నిర్ణయము చేయక పోయినచో రయితులు ఆర్థిక యిబ్బందులకు లోనై పొగాకు పండించుటకు విముఖముత చూపించే అవకాశాలున్నవి. కాబట్టి వెంటనే పొగాకుకు కనీస ధరల నిర్ణయముచేసి రయితులకు తోడ్పడవలసినదిగ కోరుచున్నాను.

### శ్రీ ఆరి శ్రీరాములుగారు,

ఒంగోలు తాలూకా కాంగ్రెసు కమిటీ మెంబరు, మద్దిపాడు.

నేను పొగాకు వుత్పత్తిదారును. వర్జీనీయా పొగాకు షుమారు య. 15-0లు. సాగుచేస్తూ వుంటాను. పొగాకునకు యితర పైరులకన్న వుత్పత్తిఖర్చులు నాల్గు ఐదు రెట్లు హెచ్చుగానున్నవి. యేటేట పొగాకు మీదవచ్చు సొమ్ము ఉత్పత్తి ఖర్చులకే సరిపోవుచున్నది. ఈ సంవత్సరము నారు, కూలి వగైరా నాల్గు అయిదు రెట్లు పెరుగుటవలన ఖర్చులకు అపారమైన నష్టము వచ్చును. కాబట్టి పుగాకు ధరలను వ్యాపారస్తుల చేతులలో వదలివేయక సక్రమమైనటువంటి ధరను కాబట్టుట అవ సరమైవున్నది. గాన ఒకటవ గ్రేడుకు పుట్టి 1కి రూ. 700 లున్నూ గుల్లకు పుట్టి1కి రూ. 150 లున్నూ కనీసపు ధరలుగా నిర్ణయించవలసినదని గుంటూరు మార్కెటు

కమిటీని కోరుచున్నాను. ఇది పొగాకు వుత్పత్తిదారుల అందరి సమస్యగాబట్టి ప్రభుత్వమువారు వెంటనే ఆమోదించి గుంటూరు మార్కెటింగువారిచేత అమలు జరిపించవలసినది.

జనాబ్ సయ్యద్ అజీం సాహెబ్,

సెక్రటరీ, ముస్లింలీగ్, కొమ్మూరు.

మీరు ప్రచురించిన పుగాకు కనీస ధరల పుస్తకము చదివితిని. అది చేయుట చాలా అవసరము. రయితులకు ఇది తప్పకుండా అమలులో పెట్టవలసినదని ప్రార్థించుచున్నాను.

శ్రీ చదలవాడ ప్రసాద్ గారు,

చినరావూరు గ్రామ కమ్యూనిష్టుపార్టీ.

నేడు పొగాకురైతులు కనీస ధరలు లేక చాల బాధపడుతున్నారు. పొగాకు వేయుటవల్ల అధికాహారోత్పత్తికి దెబ్బతగులుతుందని మద్రాసు ప్రభుత్వందాన్ని నిషేధించింది. కాని మన రాష్ట్రములో, కొన్ని లక్షల యెకరాల భూమి, యే యితర ఆహార ధాన్యాల్ని పండించినప్పటికిని రైతులకు గిట్టుబాటు కానందుననూ తరువాత కొన్ని భూముల ప్రత్యేక పరిస్థితులబట్టి ఏ యితర పైరులు వేయుటకు వీలుకానందుననున్నూ పొగాకు వేయుచున్నారు. ఇంకను రైతులు పండించే యితర ధాన్యములు అంటే వేరుశనగ, వడ్లు యితర ధాన్యములకు కనీస ధరల నిర్ణయము జరిగింది. కాని పొగాకుకు యింతవరకు కనీస ధరలు యింకా నిర్ణయం కాలేదు. ఇదిగాక యీ పొగాకు కొనుగోలు కంపెనీలు, అంటే ఐ. యల్. టి. డి. లాంటివి వారి యిష్టము వచ్చినటులు నిరంకుశంగా ధరలు నిర్ణయించడం జరుగు తోంది. ఈ అన్యాయాన్నుంచి రయితుల్ని తప్పించాలంటే తప్పకుండా కనీస ధరలు గ్రేడుల ప్రకారం నిర్ణయించవలసిన అవసరం వుందని నే నభిప్రాయ పడుచున్నాను. యింకా కూలీ రేటు కూడా నిర్ణయించడం జరిగినప్పుడు పుగాకుకు కూడా గుంటూరు పుగాకు సబ్ కమిటీ నిర్ణయించిన రేట్లు, అంటే గ్రేడుల ప్రకారం చాల సవ్యముగానున్నందున అదే ప్రకారం నిర్ణయించవలసిన అవ సరం వుందని నేనభిప్రాయపడుచున్నాను.

**శ్రీ దొంతరాజు కృష్ణమూర్తి గారు,**

ఆర్గనైజరు, కమ్యూనిష్టుపార్టీ, నంబూరు.

గుంటూరు, కృష్ణా, ఉభయ గోదావరి లాంటి జిల్లాలలో మెట్ట ప్రాంతాలందు రయితాంగానికి ఆర్థికంగా సాయపడగలది పొగాకు పంట మాత్రమే. అయితే దీని పూర్తి ఫలితము రయితాంగానికి చెందడంలేదు. ప్రయాస అధిక ఖర్చులు రయితు పరం అవుతున్నవి. లాభము వ్యాపారస్తుని పరం అవుతున్నది. సక్రమమైన ధర రయితునకివ్వక సరుకంతాకొని విదేశ, దేశీయ మార్కెట్లలో అమ్మి అధిక లాభాలు గుంజడం వ్యాపారస్తుల నిత్య కార్యక్రమమయింది. కాగా రయితాంగము తమ ప్రయాస, పెట్టుబడి ఖర్చులను రాబట్టుకోగల కనీస ధరలు కూడా లేక సరుకును విడుదలచేయవలసివస్తున్నది. యీ సందర్భంలో ప్రభుత్వ దృష్టికి యీ క్రిందివి పరిష్కార సూచనలుగా యిస్తున్నాను.

(1) పొగాకు రకాలను బట్టి కనీస ధరలు నిర్ణయించాలి. (2) సకాలంలో డబ్బుకోసం తన పొగాకు తక్కువ ధరకు రయితు అమ్ముకోవలసి వచ్చుట వల్ల అతనికి తాత్కాలిక ఆర్థిక సౌష్ఠవం కల్పించుటకుగాను సదరు సరుకును తాకట్టు పెట్టుకొని అప్పు యివ్వగల పొగాకు రయితుల సహకార సంఘాలు యేర్పరచాలి. ప్రభుత్వము పెట్టుబడి యివ్వాలి.

సామ్రాజ్య వాద ప్రభుత్వం యుద్ధకాలంలో తమ ఖర్చులను నిలవరించుకోడానికి రయితాంగంపై పొగాకు ఎక్సైజుచట్టం రుద్దింది. యిది ప్రధానంగా రయితాంగాన్ని క్రుంగదీస్తున్నది. తానుపండిస్తున్న సరుకుపై ఆతనికి అధికారంలేకపోతున్నది. దుర్నీతిపరులగు అధికారుల జబర్దస్తి అమాయకులైన రయితాంగానికి దుర్భరావస్థను కలిగిస్తున్నది. ఇది వెంటనే తొలగించాలని కోరుతున్నాను.

**శ్రీ బొమ్మ నాగిరెడ్డి గారు,**

గ్రామ కమ్యూనిష్టు కమిటి, అత్మకూరు.

పొగాకు రయితులందరు యీనాడు కనీస ధరలు నిర్ణయం లేకపోవుటచే యిబ్బందిపడుచున్నారు. పరిశ్రమలలో పనిచేసే కార్మికులకు యితర ప్రభుత్వోద్యోగులకు కనీస జీతాల నిర్ణయం జేయుచున్నారు. పొగాకు పండించే రయితు

లకుకూడా కనీస ధరలు నిర్ణయంచేసి రయితులకు తోడ్పడ కోరుచున్నాను. ఎక్సైజు విధానమువల్ల రయితులు అనేక యిబ్బందులకు లోనగుచున్నారు. కనుక దానిని వెంటనే రద్దుచేయుటకు ప్రయత్నించవలసినదిగా కోరుచున్నాను.

శ్రీ వాశిరెడ్డి మల్లిఖార్జున రావుగారు,
గ్రామ కమ్యూనిస్టు కమిటి, కంతేరు.

పుగాకు రయితులు తమ పొగాకునకు సక్రమమైన ధరలు రాబట్టుకొనుటకు చాలా సంవత్సరములనుండి ప్రభుత్వమువారిని కోరుచున్నారు. పొగాకు రయితులు ఆర్థికముగా బాధపడుచున్నారు. యీ పరిస్థితులలో వ్యాపారస్తుల అధికలాభములను అరికట్టి సక్రమమైన కనీస ధరలు నిర్ణయించుట ముఖ్యావసరము. ఇప్పుడు ప్రజాప్రభుత్వము పనిచేయుచున్నది. కనుక పొగాకు రయితులు కోరు గ్రేడువారీ సక్రమ కనీస ధరల నిర్ణయించుట పొగాకు పండించే రయితులకు శ్రేయోదాయకము. పొగాకు ఎక్సైజు చట్టము రయితులకు అనవసరము. ఈచట్టమువల్ల రయితులు అనేక బాధలకు గురియగుచున్నారు. ఎక్సైజుపన్ను వుత్పత్తిదారులమీద గాక విని మయదారులమీద వేయుట అవుసరము.

మిష్టర్ జె. బి. విలియమ్స్,
చైర్మన్, హిష్టరీ & యెకనామిక్స్ డిపార్టుమెంటు, ఎ. సి. కాలేజి, గుంటూరు.
చైర్మన్, యెకనామిక్ బోర్డు ఆఫ్ స్టడీస్, ఆంధ్రయూనివర్సిటీ, వాల్తేరు.

ఆర్థిక శాస్త్ర సిద్ధాంతాల ప్రకారం వ్యాపారములోని పోటీవిధానాల ననుసరించి వస్తువుల ధరల నిర్ణయములు అవుతుంటవి. పోనుపోను చివరకు ఉత్పత్తి ఖర్చులు, యితర వ్యాపార ఖర్చులకు సమీపంలో ధరలు నిర్ణయింపబడుతవి. కాని మనదేశంలో పోటీ వ్యాపార పరిస్థితులు అంత సుముఖంగా లేనికారణంచేత, వ్యాపార పరిజ్ఞానం కలవాళ్ళు, లేనివాళ్లను యిబ్బందిపెట్టి, కొద్దిమంది అధిక సంఖ్యాకులను దోపిడిచేయటం జరుగుతున్నది. క్రయ విక్రయ విధానాల్లో దురాశ, స్వార్థ పరత్వము మితిమీరి పోతున్నది. రాకపోకలకూ, నిలువలకూ, తగిన సౌకర్యాలు లేక రయితు నష్టపడుతున్నాడు. డబ్బును గురించి రయితులకుండే అక్కర, నిల్వ సౌకర్యాలు లేక పోవటం, ధర యింకాపడిపోతుందేమోననే భయమూ,

తనకుముందే అప్పిచ్చిన షాహుకారుతో ఉండే మొగమాటమూ, యిలాంటి వాటి వల్ల రయితు తన సరుకును తక్కువ ధరలకు అమ్మవలసివస్తున్నది. ఈ పరిస్థితుల్లో ధరల కట్టడి రయితుకూ, వ్యాపారికి కూడా అత్యవసరమైనది. పాశ్చాత్య దేశాలలో సహకార పద్ధతులద్వారా కొన్నిచోట్ల ధరలకట్టడి జరుగుచున్నది. ఇటీవల ధాన్యము, గడ్డ, రబ్బరు మొ॥ వస్తువులకు ధరల నిర్ణయం జరిగి ఉత్పత్తిదార్లకు, వినియోగదార్లకు కూడా ఉపయోగపడింది. అందువలన యీ కనీస ధరల కట్టడి విధానాలకు నేను అనుకూల అభిప్రాయం కలిగి ఉన్నాను. న్యాయమైన ధరల నిర్ణయంమీదనే మన సాంఘిక, పారిశ్రామిక అభ్యుదయం ఆధారపడి ఉంటుంది.

మిస్టర్ బుద్ధిరాజు రామచంద్ర రావు,

ఎం. ఎ., ఎల్. టి., గుంటూరు.

"పొగాకు అంతర్జాతీయ మార్కెటుగల పంట. దానిలో అనేక రకాలు ఉన్నవి. శాస్త్రీయపరిశోధనలు పొగాకుమొక్క పెరుగుదలలో అభివృద్ధికి అనేక అవకాశాలను బుజువుచేస్తున్నవి. "కోల్‌కిసైన్" అనే ఒక విషప్రాయమైన దాని ప్రయోగఫలితంగా మొక్కలోవచ్చే మార్పులను త్వరితంచేయవచ్చు. యిది 1937 లో కనిపెట్టబడింది. కొన్నివిధానాల్లో ఉపయోగిస్తే యిది అద్భుతమైన ఫలితాలను యిచ్చింది." ("మేక్ హు మేక్ ది ఫ్యూచర్" — బ్రేస్ బ్లివెన్ నుండి.)

అంతర్జాతీయ మార్కెటుగల యేవస్తువుకైనా దానిసప్లయి, డిమాండును బట్టి ధరలలో వ్యత్యాసం కలుగుతుంటుంది. పొగాకులోని కొన్నిరకాలలో గుత్త వ్యాపారం తీసివేయరానిది. మనదేశంలో స్పెక్యులేట్‌చేసే వ్యాపారులు పొగాకు యొక్క ఉత్పత్తి, పంపిణీ, మొ॥ విషయాలలో తగిన విజ్ఞానం లేకుండా చేస్తున్నారు. ఇలాంటి ప్రమాదభరితమైన స్పెక్యులేషన్ ఆపి, కష్టించి పండించే వ్యవసాయదారులను రక్షించటం అవసరం. అందుకని వ్యవసాయదారులకు ఒక కనీస ధరను గ్యారంటీచేయటం అత్యావసరమైయున్నది. కాని యీవిషయంలో పొగాకు పొలంనుంచి ఫ్యాక్టరీదాకా వచ్చేవరకు జరిగే పద్ధతిని గురించిన లెక్కలను సేక

రించటానికి తగినసంస్థ ఒకటి ఉండాలి. యీసంస్థ స్వెక్కు్యలేర్మన్ వల్ల కలిగే ధరల వ్యత్యాసాలను జాగ్రత్తగా గమనిస్తూ, ధరలను గురించిన సలహాలు యెప్పటి కప్పుడు యిస్తుండాలి."

మిస్టర్ పి. శేషగిరిరావు,

విజయ కమ్మర్షియల్ బ్యాంక్, లిమిటెడ్, మంగళగిరి.

పొగాకురైతులు ఆర్థికంగా చాలాబాధపడుతూ, ఈ ఆర్థికమాంద్యాన్ని తట్టుకోలేనిస్థితిలో నున్నారు. రైతులు ఉత్పత్తిచేసిన పొగాకుకు ధరగిట్టే పద్ధతిని తప్పకుండా కనీసపుధరలు నిర్ణయించాలి. వ్యాపారస్తులు వారి చిత్తం వచ్చిన ధర రైతులకిస్తూ విపరీతమైన లాభాలు పొందుతున్నారు. ఈ దోపిడీ విధానాన్ని అరికట్టాలంటే, గుంటూరు పొగాకు మార్కెట్ సబ్ కమిటీ నిర్ణ యించిన ధరలకన్నా కొద్ది హెచ్చుధరలుండిన రైతులకు శ్రేయోదాయకముగా వుంటుంది.

మిస్టర్ భారు గోవిందరావు, యం. ఎ., బి. యల్.,

లెక్చరర్, హిందూకాలేజి, గుంటూరు.

'పొగాకు సక్రమ కనీసధరలు' అనే కరపత్రిం సకాలంలో గుంటూరు టుబాకో మార్కెటు కమిటీ వారిచే ప్రకటింపబడిన రిపోర్టు. గ్రంథకర్తగారు అధిక శ్రమచేసి, సాధికారకమైన ఒకనిర్ణయానికి రాగలిగారు. కరపత్రంలో మూడవవంతు చైర్మన్‌గారు వ్రాసిన పరిచయవాక్యాలు. యిందులో పొగాకు పంటయొక్క చరిత్ర, పొగాకు రైతుల ప్రస్తుత స్థితిగతులు, వ్యాపారంలోని అనేక విషయాలు విపులంగా చర్చించబడినవి.

నేటి ఆర్థికశాస్త్రంప్రకారం కూడా వినియోగదారుడు యిచ్చేవెలలో సక్రమభాగం ఉత్పత్తిదారునకు చెందునట్లు చేయవలసిన అవసరాన్ని అందరూ గుర్తించారు. దీనికొరకై కనీసధరలు నిర్ణయించేటప్పుడు అనేకవిషయాలు గుర్తులో ఉంచుకోవాలి. గ్రంథకర్తగారు ఉత్పత్తిఖర్చులు, క్యూరింగు, బేలింగు ఖర్చులు మొ॥నవి సమగ్రంగా చర్చించి సక్రమధరలు సూచించారు. ప్రభుత్వం, యెక్సైజు పన్నువల్ల చాలా ఆదాయాన్ని పొందుతున్నందువల్ల, రైతులకు సక్రమధరలు

వచ్చేటట్లు చూడవలసిన బాధ్యతకలదని సూచించబడిందికూడా. ఈపుస్తకంలోని విషయాలు అందరికీ – ముఖ్యంగా మనదేశపొగాకు కేంద్రమైన గుంటూరు ప్రాంతంలోని వారందరి దృష్టికీ తీసుకురాబడుతుందనీ, యీ విషయంలో తగిన చర్యలు తీసుకోబడాలనీ వాంఛిస్తున్నాము.

మిష్టర్ పి. వెంకటేశ్వరరావు, బి. ఏ., బి. ఎల్., అడ్వకేటు,
గుంటూరు.

"పొగాకు పంటలోనై తేనేమి క్యూరింగులోనై తేనేమి మిగతా పంటల కంటె ఎక్కువకష్టం రైతు పడవలసి వున్నది. దీనితోపాటు ఖర్చులుకూడా. రైతు హెచ్చుగా పెట్టుబడి పెట్టవలసివున్నది. యీ రోజులలో బొగ్గుకుగాని, క్యూరింగు చార్జీలకుగాని, నారుకుగాని అగు ఖర్చులు యిరివరకున్న (అనగా యుద్ధమునకు పూర్వం) వాటికంటె మూడు రెట్లు పెరిగినవని చెప్పుట అతిశయోక్తిగాదు. ప్రతి రైతుకున్ను యిది అనుభవమైన విషయమే. యింత వ్యయ ప్రయాసలకులోనై పొగాకును గ్రేడుకూడాచేసి అమ్మకుటకు తీసుకొనిరాగా రైతునకు అన్నియు అడ్డములే. ఒకవేళ సరుకును గుంటూరు పొగాకు కంపెనీలకు తీసుకొనిరాగా గ్రేడింగు సరిగా లేదని తక్కువ ధర వేయుటయు, యిదే సరుకు రైతు యింకొక కంపెనీకి తీసుకొని వెళ్లిన యింకా తక్కువ ధరలకు యిమ్మని అడుగుటయు పొగాకు సీజనుయందు ప్రతిరోజు జరుగు విషయమే. పొగాకు కంపెనీ ప్లాటుఫారములవద్ద రైతులకు జరుగు న్యాయము కసాయివాని యింటివద్ద పశువులకు జరుగు న్యాయమే అని చెప్పుట కెంతయు సందియములేదు. సరుకును బస్తీలకు తీసుకొనిరాకుండా పల్లెటూళ్లలోనే అమ్ముదామంటె బస్తీల దాపునవున్న పల్లెలలోతప్ప మిగిలిన వాటిలో సరియైన మార్కెటు ధరలే తెలియవు. యిదిగాక బ్రోకరు డిబాచరులు పట్టుకొని ప్రతిక్షణం పీడించుచూ ఎప్పుడో ఒకప్పుడు బోల్తాకొట్టింతురు. ఇట్టి కష్టములకన్నిటికిని 1 టన నంబరు గ్రేడుకు ఎక్కువ రేటు ప్రకరం రు. 450/-లు లేక రు. 475/- లు కంటె ఎక్కువ రైతుకు వచ్చుటలేదు. ఒక బేరన్ సరుకులో 1 టవ గ్రేడు 1/5 గాని 1/7 గాని గూడ లేదు. 1 టవ గ్రేడుకు రు. 475/ లు వచ్చినదని రైతు సంతోషించుచుండగానే రెండవ బేలు దగ్గఱకు వెళ్లి కంపెనీ

దారు సగముకుపైగా ధరను తగ్గించును. యిదిగూడా మొదటి గ్రేడే అయినప్పుటికి యిది కొనేవానికి ఫ్యాషన్ అయినది. ప్రిన్సిపల్ ఆఫ్ యావరేజన్ నుబట్టి (అనగా సగటున ధర పుట్టి 1 కి యింతే మొత్తమునకు ఖరీదు, అనగా సరియైన గ్రేడు లేక, మోస విధంగా కల్తీచేసి తెచ్చిన బ్రోకర్ల సరుకుతోగూడ) సరుకును ఖరీదు చేయుడమేగాని, సరుకుయొక్క నాణ్యమును బట్టి వ్యాపారులు ఎప్పుడున్నూ కొనుటలేదు.

పొగాకు వ్యాపారము అన్ని వ్యాపారములకంటె ఎక్కువ రహస్యములతో గూడుకొన్నందుననున్నూ రైతుకున్ను ఎగుమతిదారుకున్ను మధ్య మనుష్యులు ఎక్కువగా వున్నందుననున్నూ పొగాకు వ్యావారస్తునికి విస్తారిలాభం రావలయునని ఆశవున్నందుననున్నూ రైతుకు ఏసంవత్సరపు పొగాకు మార్కెట్టు రేట్లు ఆసంవత్సరం తెలియవు. యిదియుగాక పొగాకు మిగతా పంటలవలె నిల్వచేసుకొనుటకు వీలుకానందున ఏదోఒక రేటుకు సీజనులోపల రైతు తనసరుకును విడువవలసి వచ్చుచున్నది. రిడ్రయింగు అవకాశాలుగనుక వున్నపక్షమున రైతుకు సరుకును నిల్వచేసుకొనుటకు అవుకాశముండును. యీ విషయములన్నియు శ్రీ సి. వి. సర్వయ్య శేషిగారు విచారణచేసి వ్రాసినరిపోర్టు చాలా వుపయోగకరము. ప్రతి రైతు యిందలి విషయములు గ్రహించుకొని మెలగుట అత్యావస్యకము.

గుంటూరు పొగాకు మార్కెట్టు కమిటీని గవర్నమెంటువారు ఏర్పరచి కొన్నిసంవత్సరములు అయినప్పటికి అందువలన కలుగు లాభములు రైతులు పూర్తిగా పొందుటలేదు. పొగాకుకు కనీసధరలు నిర్ధారణచేయుట రైతుకు ఎంతయు శ్రేయోదాయకము. గ్రేడింగువిషయమై కొనేవారికున్ను రైతుకున్ను తగాదావచ్చినచో డిస్ప్యూట్సు కమిటీకి రిపోర్టుచేసి దానియొక్క తీర్పును అమలులో పెట్టేటట్టు చేయుట చాలా అవుసరమైయున్నది. వీటితోపాటు గ్రామములలో కొంత ప్రచారముచేసి గ్రేడువిషయమై కొంత పరిజ్ఞానము యిచ్చుట అవుసరం. కల్తీసరుకును అమ్మవలెనని రైతునకు కూడా కొంతవరకు దురాశ ఏర్పడుచున్నది. అటులచేయుట రైతునకు ఎంతమాత్రము లాభముకాదు. యిప్పుడు మార్కెట్టులోనున్న పరిస్థితులనుబట్టి పొగాకు అమ్ముటకు వ్యాపారస్తునివద్ద

రైతుకు పెద్ద భయము ఏర్పడుచున్నది. రయితువద్దకు వచ్చినను కొనువానికే చివరకు లాభము ఏర్పడుచున్నది. సరియైన గ్రేడింగు, కనీసధరలు, తూకం, చెక్కింగులను గురించి సరియయిన నిబంధనలు ఏర్పరచిన పై కష్టములన్నియు తొలగి రయితుకు పొగాకుపంటవలన క్షేమదాయకమగునని నా నమ్మకం.

నా అనుభవము ననుసరించి నాకు తోచినది చెప్పుటకు అవకాశము యిచ్చినందుకు గుంటూరు పొగాకు మార్కెటు కమిటీ ఛైర్మెన్ అయిన శ్రీ కొల్లా వెంకయ్యగారికి నేను కృతజ్ఞుడను.

### మిష్టర్ తురగా విశ్వేరశర్మ,

అడ్వకేట్, గుంటూరు.

నేను పొగాకు ఉత్పత్తిదారుణ్ణి కావటంచేత 'పొగాకు సక్రమ కనీస ధరలు' అనే పుస్తకం శ్రద్ధతో పరిశీలించాను. వర్జీనియా పొగాకుకు కనీస ధరలు నిర్ణయించి అమలుజరిపే విషయంలో భేదాభిప్రాయాలు ఉండటానికి అవకాశం లేదు. గ్రంథకర్తగారు, తమవాదనలో, జొన్న వేరుశెనగలాంటి యితర పైరుల విషయంలో ఖర్చులు తగ్గించి, రాబడి యెక్కువగా చూపించటానికి ప్రయత్నించారు. వర్జీనియాపండే పొలాలలోనే యితరపైరులనుకూడా పండించే అవకాశాలుండటంచేత అవిలాభదాయకమైతే రైతు వాటినే పండించేవాడు. వేరుశెనగపైరు విషయంలో, విత్తనాలకూ, యెరువులకూ, కోతకూ మొ॥ వాటిఖర్చులు చాలా తక్కువగా చూపించబడినవి. జొన్న విషయంలో ఖర్చులు తగ్గించి చూపించటమే కాకుండా, రాబడి 3 రెట్లుకుపైగా యెక్కువ చూపించబడింది. లేబరు విషయంలో కంటే, పెట్టుబడి విషయంలో ఖర్చులు యెక్కువగా చూపించబడినవి. కాని యీ రోజుల్లో లేబరుకు అమితఖర్చులు అవుతున్న సంగతి వ్యవసాయదారులందరికీ అనుభవమే.

వర్జీనియాపొగాకు విషయంలో కనీసధరల నిర్ణయం అత్యవసరం. పైగా, క్యూరింగ్, గ్రేడింగ్, మార్కెటింగ్ మొ॥ విధానాలలో రైతులకు యెంతో సహాయం జరుగవలసివుంది. పెట్టుబడిదారుడు అడిగినంతకు, తక్కువ ధరకు యివ్వ

కుండా తన సరుకును నిల్వజేసుకొనే శక్తి, అవకాశాలు, రయితులకు కావలసి ఉన్నవి. యిలాంటి అనేక విషయాలలో రయితులకు ప్రభుత్వం తోడ్పడవలసిన అవసరం ఉన్నది.

మిష్టర్ కొమ్మారెడ్డి వెంకటరెడ్డి,
అడ్వకేటు, గుంటూరు.

పొగాకు కనీస ధరల విషయంలో మీరు ప్రచురించిన పుస్తకము చూచినాను. చాలాకాలంనుండి నాకు యీ ప్రాంతంలోని పొగాకు రయితుల స్థితిగతులతో పరిచయంఉంది. మధ్య దళారీలవల్ల తరచుగా కలుగుతుండే ధరల వ్యత్యాసాలనుండి రయితులను రక్షించటానికి పూనుకొని మీరుచేసే కృషి విషయం విని చాలా అనందిస్తున్నాను. ఉత్పత్తిదారుని దృష్టిలో యుద్ధం ఒకరకంగా ధరలకు కొంత స్థిమితత్వాన్ని కలిగించకపోలేదు. కాని యీనాడు మనం యుద్ధానంతరం కలిగే ఆర్థిక రాజకీయ ఒడుదుడుకుల కాలంలో ఉన్నాము. అందువల్ల ధరల వ్యత్యాసాలను తగ్గించటానికి చేయవలసిన కృషినంతా యీనాడు ప్రభుత్వం చేయవలసిన బాధ్యత వుంది. న్యాయమైన సక్రమ కనీస ధరలను రయితుకు వచ్చేటట్లు చేయటానికి ప్రయత్నిస్తున్న మీ ఉద్యమంలో నేను హృదయపూర్వకంగా తోడ్పడి, పాల్గొనటానికి సంసిద్ధంగావున్నాను.

మిష్టర్ అత్తలూరి పాపరాజు, బి. యల్.,
అడ్వకేట్, గుంటూరు.

'పొగాకు సక్రమ కనీసధరలు' అనే పుస్తకం చాలా ఉత్సాహంతో చదివాను. సత్తెనపల్లి, గుంటూరుతాలూకాలలోని పొగాకు రయితులతో నాకుగల పరిచయం ఆధారంచేసుకుని ఆలోచిస్తే శ్రీ సి. వి. సర్వయ్యశ్రేష్ఠిగారు వర్జీనియాకు, నాటుకు, తేల్చిన కనీసధరలు చాలా సమంజసమైనవని, సక్రమమైనవని నా అభిప్రాయము.

యుద్ధానంతరం రయితుజీవితంలో కలిగే ఆర్థిక ఒడుదుడుకులనుండి, హెచ్చుతగ్గులనుండి రయితును రక్షించాలంటే, సక్రమమైన కనీసధరలను నిర్ణయించి అమలుజరపటం చాలా అవసరం. గతయుద్ధానంతర ఆర్థిక సంక్షోభ

కాలంలో పొగాకుధరలు పడిపోయి, నామమాత్రపు ధరలువచ్చి అనేక రయితులు దెబ్బతిన్న విషయం, ఆనాటి సంఘటనలు మనము యిప్పటికైనా తగిన రక్షణలు కలిగించుకోవలసిన అవసరాన్ని సూచిస్తున్నవి. గుంటూరు, కృష్ణా, గోదావరి జిల్లాలలో పొగాకుపంటకు వ్యాపారప్రాముఖ్యతను యిచ్చుటేకాక, అంతర్జాతీయ రంగంలోకూడా మనపొగాకుకు పేరుప్రతిష్ఠలు రావాలంటే కనీసధరల నిర్ణయం అవసరము.

అధికవడ్డీలకు అప్పులిచ్చి, రయితాంగాన్ని జలగలవలె పీడించుతున్న వడ్డీ వ్యాపారుల బారినుండి రక్షింపబడటానికి, పొగాకు ఉత్పత్తిదార్ల సహకార సంఘాలు స్థాపించటం విషయంలో గ్రంథకర్తగారితో నేను సంపూర్ణంగా ఏకీభవిస్తున్నాను.

గ్రంథకర్తగారుచేసిన యీకృషిని అభినందిస్తూ, యీ పుస్తకములో యివ్వబడిన సూచనలను తగినంత శ్రద్ధగా పరిశీలించి ఆచరణలోకి తేవాలని అధికారులకు విజ్ఞప్తిచేస్తున్నాను.

మిస్టర్ యస్. హనుమయ్యా చౌదరి, బి. ఏ., బి. ఎల్.,
ఒంగోలు.

యుద్ధకాలంలో వచ్చినధరలు వ్యవసాయదారులను ఉత్సాహపరచినవి. కాని యుద్ధానంతరం వర్తకులు అవకాశాలను ఉపయోగించుకొని పొగాకుకు, యితర వస్తువులకు సక్రమధర రాకుండా చేస్తున్నారు. ఇంకోవైపున రయితుకు కావలసిన జీవితావసర వస్తువులధరలన్నీ విపరీతంగా పెరిగిపోయాయి. 1930 లో లాగా మళ్ళీ ఆర్థికమాంద్యంరావచ్చు. గ్రేడులవారీగా కనీసధరలు నిర్ణయించి అమలుజరుపకపోతే, అప్పుడు రైతు చాలా దెబ్బతినవలసిన పరిస్థితి ఏర్పడుతుంది.

సబ్ కమిటీ నిర్ణయించిన కనీసధరలు న్యాయంగానే ఉన్నవి. కాని తగిన కాలంలో పొగాకునుకొనక వ్యాపారులు రయితులను నిర్బంధించవచ్చు. అలాంటప్పుడు సరుకు చెడిపోయి రయితు యిబ్బందిపడతాడు. అందుకని కమిటీ తన సొంత మార్కెటు యార్డుల్లోనే పొగాకునుకొని రయితుకు చెల్లించేస్థితిలోఉండాలి.

## మిష్టర్ వి. శ్రీ రా ము లు,

వకీలు, ఒంగోలు.

ఈనాడు వ్యాపారస్తుల దయాధర్మాలమీద ఆధారపడిన పొగాకు రయితుల శ్రేయస్సును దృష్టిలో ఉంచుకుని చూస్తే వివిధ గ్రేడ్లకు కనీస ధరలు నిర్ణయించి అమలు జరపటం యెంతైనా అవసరం. వ్యాపారంలో రైతుల స్వల్ప జ్ఞానాన్ని అవకాశంగా తీసుకొని వ్యాపారులు అధికలాభాలు గడిస్తున్నారు. రయితు ఆర్థిక స్థితిని బాగుపరచేందుకు మార్కెటు కమిటీలాంటి సంస్థ యీ సమస్యను తీసుకొని ప్రభుత్వంవారిచేత తగిన చట్టం చేయించవలసివుంది. ఈ ఉద్యమానికి ప్రజలు తమ సామభూతిని, తోడ్పాటునుకూడా యివ్వవలసివుంటుంది.

## మిష్టర్ యన్. నీ ర జ రా వు,

వకీలు, తెనాలి.

రైతు శ్రేయస్సుకోరే ప్రతివారూ యీరోజున పొగాకు మార్కెటులో యేమిజరుగుతున్నదో చూడండి. సంవత్సరం పొడుగునా కష్టించి పండించిన రైతుకు న్యాయంగా రావలసినంత ధర రావటంలేదు. శ్రీ కొండా వెంకటప్పయ్య పంతులు గారు-31-12-46 న పత్రికలలో ప్రకటించబడిన ప్రకటనలలో, చెప్పినట్లుగా, రయితుకు 500 పౌనుల పుట్టి 1 కి రు. 575 లు న్యాయంగా రావలసివుంటే, రు 432 లు మాత్రమే రైతు పొందగలుగుతున్నాడు. గ్రేడింగ్ విధానంలోని కష్టసాధ్యమైన వివిధపద్ధతులను పురస్కరించుకొని విదేశ వ్యాపారులు నిరంకుశంగా తమ యిష్టంవచ్చిన ధరనే యిస్తామంటారు. యీ సంవత్సరం వర్షాలవల్ల మూడుసార్లుకూడా నాటువేసిన బీదరైతులు యీ పరిస్థితులను తట్టుకోవలసివుంది. మన ప్రజాప్రభుత్వం, మార్కెట్ యార్డులను స్థాపించి, కంపల్సరీ మార్కెటింగ్ ప్రవేశపెడితే రయితుకు మధ్య దళారీలబాధలు తప్పి వర్తకులతో ప్రత్యక్షసంబంధం ఏర్పడుతుంది. ప్రభుత్వం రయితులకు అప్పులిచ్చే సౌకర్యాలుకూడా చేయటం మంచిది. దీనివలన పట్టణంలోని మార్కెట్లకు తనసరుకును తెచ్చిన రయితు, సూర్యాస్తమయానికి ముందే కొంపచేరుకోవాలని యేదోఒక ధరకు అమ్మకుండా, ధరవచ్చేవరకు నిలవచేసుకునే శక్తిని పొందుతాడు. పైగా ఉత్పత్తి

దార్ల సహకారసంఘాలు స్థాపించ వచ్చునుగదా! సీజను అప్పుడే సమీపిస్తున్నందున ప్రభుత్వం వెంటనే ఒక నిర్ణయం చేయాలి. మన ముడిసరుకును చౌకగా కొని, విదేశ వర్తకుడు, తయారైన వస్తువులు మళ్లీ మననెత్తినే రుద్దుతాడు. దేశానికి వెన్నముకవంటివాడైన రయితుకు తగిన రక్షణలు కలిగించుట ప్రభుత్వ ధర్మం.

మిస్టర్ దివాకర్ల లక్ష్మీనారాయణ,
బి. ఎ., బి. ఎల్. వకీలు, బాడీపేట, గుంటూరు.

'పొగాకు సక్రమ కనీస ధరలు' అని మీరు ప్రకటించిన పుస్తకము చదివినాను. నేను గుంటూరులో న్యాయవాద వృత్తిలో నున్నప్పటికీ, నైజాంలో నాకు భూములున్నవి. నేనూ వ్యవసాయదారుణ్ణే. అందువల్ల పంటలు పండించే వ్యవసాయదారుల కష్టనష్టాలు నేనెరుగుదును.

మీ పుస్తకంలో చేసిన సూచనలు, చూపిన కారణాలు, యిచ్చిన లెక్కలు మొదలైనవి న్యాయసమ్మతమైనవనే నా అభిప్రాయము.

పెద్దపెద్ద పెట్టుబడిదారులు, మధ్య దళారీలు, యేమైపోయినప్పటికీ, కష్టించి పండించే రయితుకు మాత్రం గిట్టుబాటు అయ్యే ధర రావాలి. యిది లేనినాడు పొగాకు వ్యాపారమే పడిపోతుంది.

ప్రభుత్వంవారు రయితుల స్థితిని యెక్కువ వాత్సల్యంతో పరిశీలించి, న్యాయమైన కనీస ధరలను పొగాకుకు నిర్ణయించి అమలు జరపాలి.

మిస్టర్ చాపలమడుగు రామయ్యచౌదరి,
అడ్వకేటు, నర్సరావుపేట.

మీరుపంపిన ప్రచురణలు చాలా అభినందింపదగియున్నవి. అవి ముఖ్యంగా రయితులకు చాలా ప్రయోజనకరమైనవని నా అభిప్రాయము.

అనేక అడ్డంకులు ఉన్నప్పటికీ, వాటిని అధిగమించి, మీరు తలపెట్టిన యీ మహోద్యమం విజయవంతంకాగలదని ఆశిస్తున్నాను. స్వార్థపరులు కల్పించే ఆటంకాలను, రయితులోకం యెదుర్కొనగలదని నా నమ్మకం. మీరు సూచించిన విధానం ఈ ఆర్థిక సంక్షోభ కాలంలో రయితులను తప్పక రక్షించగలుగుతుంది.

మీరు ప్రకటించిన రేట్లు పూర్వ సంవత్సరాలకు కాబోలు. యీ యేటికి అవి యేమాత్రం చాలవు. యుద్ధానికిపూర్వం 5 సంవత్సరాలు, తర్వాత 5 సం॥ రాలు సగటు ఖర్చులు తీసికొని కనీసధరలు నిర్ణయించవచ్చు. నాటు పొగాకు ధర రూ. 200 ల వరకు పెంచుతారని ఆశిస్తున్నాను. అది న్యాయమైన ధర అని నా అభిప్రాయము. పొగాకులో యితర రకాల సంగతి నాకు అంతగా తెలియనందున వాటి విషయం ప్రస్తావించలేదు.

మిస్టర్ జి. పోతయ్యా, టీచరు,
ఇంకొల్లు.

“పొగాకు సక్రమ కనీసధరలు” అను కరపత్రమును చూచితిని. కనీసధరలు నిర్ణయించడంవల్ల రైతుకు యెంతో మేలుచేసినవారగుదురు. ఈకనీసధరలు నిర్ణయం జరిగినపుడు రైతు తాత్కాలికముగా తనసరుకును అపుకొనుటకు వీలగునట్లుగా గవర్నమెంటు తక్కువ వడ్డీతో ధనసహాయము చేయవలయును. లేనిదే ఈస్కీము జయప్రదము కాజాలదని నాతలంపు. నాటుపొగాకుకు నిర్ణయించిన ధర అనుభవముగల రైతులు చాలా తక్కువగా నున్నదని భావించుచున్నారు. కనీసధర రు. 150/- లు నిర్ణయించినను స్వంతభూమిగల వ్యవసాయదారులకు సరిపడవచ్చును. కాని కౌలుదారుకు కనీసము రు. 200-0-0 లైనధరయుండిన సాగుంటునని చెప్పుకొంటున్నారు. గ్రేడు నిర్ణయము కమిటీచేతులలో నుంచుట ఉత్తమము.

మిస్టర్ శావంపూడి సుబ్బారావు, టీచరు
కంతేరు.

“పొగాకు కనీసధరలు” అను కరపత్రమును చూచితిని. మీరు ఈ సమయములో పొగాకుకు కనీసధరలు నిర్ణయించుటచే రైతుకెంతయు శ్రేయస్సు గూర్చినవారగుదురు. ప్రస్తుత పరిస్థితులలో రైతు ఆర్థికముగా చాలా బాధపడుచున్నాడు. ఈ కనీసధరలు నిర్ణయించటం మూలమున రైతునకు వర్తకులుచేసే అన్యాయమును తగ్గించువారగుదురు. 1947 పొగాకు సీజనుకైనా ఈధరలు అమలుపరచెదరని ఆశిస్తున్నాను. మీరు ప్రకటించిన ధరలుకూడా రైతునకు తగిన ఆదాయములను గూర్పజాలవనియు, రైతునకు ఎ 1 కి షుమారు రు. 400-0-0 లు

ఖర్చులు అగుచున్నవిగనుక సాధ్యమైనంతవరకు రయితు శ్రమకు తగిన ఆదాయ మును జూపవలయును. అనగా తగిన ధరలను నిర్ణయింపవలయును. అనగా కమిటీ వారు నిర్ణయించినవాటికంటె అధికముగా ధరలు వేస్తేనేగాని రయితునకు గిట్టదని నా ఆశయము.

మిష్టర్ సి. హెచ్. ఎల్. నరసింహం,

తెనాలి.

విదేశవ్యాపారుల అధికాశలమూలకంగా మన రయితు దెబ్బతినకుండా ఉండాలంటే ప్రభుత్వమువారు తక్షణమే పొగాకుకు కనీసధరలు నిర్ణయించి, రయితులకు 10 లక్షల రూపాయల వరకు హామీమీద అప్పులుయిచ్చి, రయితాంగానికి తోడ్పడాలి. రయితుశ్రేయోభిలాషు లందరూ కనీసధరలకొరకు ఆందోళన చేయవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాను.

డాక్టర్ కొల్లూరు ఆంజనేయులుగారు,

మంగళగిరి.

పొగాకు రయితు బాగుపడాలంటే రయితు ఉత్పత్తి చేసిన పొగాకుకు సక్రమైమన ధరరావాలి. ప్రస్తుత పరిస్థితులలో పొగాకు రయితు ఆర్థికంగా చాలా దెబ్బతింటూవున్నాడు. పండించిన పొగాకు పంటమీద అమితవ్యయంచేసి, తిట్టుకో లేకుండా వున్నాడు. వ్యాపారస్తులు రయితుల అజ్ఞానాన్ని పురస్కరించుకొని, అమితమైన లాభాలు గుంజుతూ, రయితును పీడిస్తున్నారు. ఈ పొగాకు వ్యాపారస్తుల దోపిడీ విధానాన్ని సమూలంగా రూపుమాపాలంటే, గుంటూరు పొగాకు మార్కెటు కమిటీ సబ్ కమిటీచే నిర్ణయింపబడిన కనీస ధరలుకూడా చాలవు. 1, 2 గ్రేడులకన్నా లోయరు గ్రేడులకు హెచ్చుధరలు నిర్ణయిస్తే బాగుండును.

| | |
|---|---|
| 1 వ. గ్రేడుకు | రూ. 750/- లు |
| 2 వ. ,, | 600/- లు |
| 3 వ. ,, | 450/- లు |
| లైట్ గ్రీన్ | రూ. 400/- లు |
| 5 వ. గ్రేడు | 190/- లు |

నాటు పొగాకు కనీసం రూ. 150/- ఉంటే సమంజసముగా నుండును.

## మిస్టర్ వి. శ్రీరాములు,

ఫస్టుక్లాస్ ఆనరరీ మేజస్ట్రేట్, ఒంగోలు.

షుమారు 13 సంవత్సరాలనుండి నా స్వంతశారనులో, నా పొలములో పండినపొగాకును ఉపయోగిస్తున్నాను. నాటుఖరీదు యిదివరకెన్నడూ యీసంవత్సరమంతగా పెరగలేదు. ఈసంవత్సరం సగటున య 1 కి నారు, నాటుకూలి షుమారు రు. 150 లు అయింది. పైగా యిటీవలి వర్షాలవల్ల ప్రతి రైతూ మూడు సార్లకు తక్కువలేకుండా నాటు వేయవలసివచ్చింది. బొగ్గుఖరీదుకూడా చాలా యెక్కువగానే ఉన్నది. అందుకని కనీసధరలను నిర్ణయించి అమలుజరుపని యెడల రయితు అధికనష్టానికి గురికావలసిన పరిస్థితులు ఏర్పడుతవి. కనీసధరలు యీ క్రింది విధంగా ఉండాలని నా సూచన.

| గ్రేడు : | రేటు : |
|---|---|
| నెం 1 | : రు 700 |
| 2 | : రు 650 |
| 3 | : రు 600 |
| 4 | : రు 525 |
| ఎల్. జి. | : రు 350 |
| డి. జి. | : రు 175 |
| 6 (బిట్సు) | : రు 200 |

## డాక్టర్ కె. మల్లిఖార్జునరావుగారు,

పరుచూరు.

12 సం॥ల నుండి డాక్టరు ప్రాక్టీసు చేస్తున్నాను. అనేకమంది పొగాకు రయితులతో నాకు పరిచయముంది. పొగాకు ఉత్పత్తిఖర్చుల వివరాలు, ఆదాయము మొదలగు విషయాలలో అనుభవముంది. నాదృష్టిలో వ్యవసాయదారుడు

చాలానష్టానికి పాలవుతున్నాడు. పొగాకుకు అయ్యే ఉత్పత్తిఖర్చులనుబట్టి, ఆపంట యేమాత్రం లాభదాయకంకాదు. అందువల్ల పొగాకుకు కనీసధరలు నిర్ణయించి అమలుజరుపటం అత్యావసరం అవుతున్నది. ఈవిషయంలో మార్కెట్ కమిటీ వారిని అభినందిస్తున్నాను.

మిస్టర్ జి. కృష్ణమూర్తి, బి. ఎ., బి. యల్.,
ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్, పంచాయతీబోర్డు, పరుచూరు.

కనీసధరల నిర్ణయసందర్భంలో మీరు ప్రకటించిన పుస్తకమూ, తీర్మానమూ చూచినాను. ఈ ప్రాంతంలో పొగాకుపంట యెక్కువైనందున అనేక మంది రయితులతో నాకు పరిచయముంది. ఒకవైపు వినిమయదారుడు వస్తువులకు హెచ్చువెల యిస్తుండగా, పండించిన రయితుకు సరియైన ధరమాత్రం రావటంలేదు. పొగాకు వ్యాపారంలోని మధ్యదళారీలు రైతులను దోపిడిచేసి అధిక లాభాలు గుంజుతున్నారు.

ఒక్కొక్కప్పుడు రయితుకు వచ్చేధర, పెట్టిన ఖర్చులకుకూడా చాలదు. ఉత్పత్తిదారుడు గిట్టుబాటుధర పొందగలిగేటట్లు చేయటం ప్రజలవిధి. ముఖ్యంగా మీకమిటీవంటి ప్రజాసంస్థల విధియునై యున్నది. ఈసందర్భములో మీరు చేస్తున్న కృషిని మనఃపూర్వకంగా అభినందిస్తున్నాను.

శ్రీ రాయపాటి వెంకటరంగారావుగారు,
గ్రామ కమిటీ ప్రెసిడెంటు, వుంగుటూరు.

మా గ్రామములో ఎకరము 1 కి సగటున ఒక పుట్టి అగును. సదరు యకరమునకు ఈ కాలపరిస్థితులను బట్టి ఖర్చు దాదాపుగా రు. 500 లు పెట్ట వలసియుండును. కాబట్టి కనీసము ధర పుట్టి 1 కి రు. 500 లు ఉండవయును. మార్కెటు సిస్టము పెట్టి వేలము పద్ధతిలో ఉత్పత్తిదారు సరుకును అమ్ముకొనుటకు అవకాశములు కల్పించవలయును. లైసెన్సు తూకపుదారుడు ఉండుట అవసరము. ఆసామీ ఖర్చునుబట్టి త్రాగుడు పొగాకుకు ఎక్సయిజు పన్ను లేకుండ తీసి వేయుట అవసరము.

శ్రీ నంగినేని సుబ్బయ్యగారు,

ఆహారకమిటీ చైర్మన్, పాలపర్రు.

మీరు కనీస ధరలపై ప్రకటించిన కరపత్రము చూచినాను. కనీస ధరలు నిర్ణయించడం చాలా అవసరం. అయితే కనీసధరలు యీ క్రింది విధముగా పెంచమని నా సూచన.

| గ్రేడు : | రేటు : |
|---|---|
| 1 నెం. | రు. 600 లు |
| 2 నెం. | 500 లు |
| 3 నెం. | రు. 450 లు |
| 4 నెం. | రు. 350 లు |
| 5 నెం. | రు. 255 లు |
| డి. జి. | రు. 150 లు |
| 6 నెం. | రు. 50 లు |
| వాడు వర్జీనియా | రు. 170 లు |
| నాటు | రు. 170 లు |

శ్రీ గంగవరపు అంజయ్యగారు,

ఆహారకమిటీ మెంబర్లు, స్వర్ణ.

మీరు పొగాకు కనీస ధరల విషయమై ప్రచురించిన కరపత్రము, పుస్తకమును చదివినాను. కనీసధర నిర్ణయించుట రయితుకు ఎక్కువ సహాయకరము కాగలదు. నాటు పొగాకు కనీసధర రు. 135/- చాలా తక్కువ. రయితు నాటు పొగాకు ఉత్పత్తికి చాలా ఖర్చులు పొందుచున్నాడు. ఖర్చులున్నూ విపరీతముగా పెరిగినవి. అందువల్ల నాటు పొగాకు కనీసధర రు. 150 లకు తక్కువ లేకుండా వుండవలెను.

## శ్రీ వి. దేవలరావుగారు,

గ్రామకమిటీ చైర్మన్, కొమ్మూరు.

పొగాకు కనీస ధరల విషయములో మీరు ప్రకటించిన కరపత్రం నేను చదివినాను. కనీసధరలు నిర్ణయించటము రయితుకు చాలా శ్రేయస్కరము, కాని ఈ సంవత్సరము 1946–47 సీజనుకు ఎకరము ఒక్కంటికి ఈ క్రింది విధముగా ఖర్చు అయినది.

| | | | |
|---|---|---|---|
| కవులు | రు. 250/- | ఆకువిరుపు అల్లకం తా...కు | రు. 40/- |
| నారు | 100/- | క్యూరింగు, గ్రేడింగు | 25/- |
| నాటు | 10/- | బొగ్గు | 30/- |
| కలుపు | 10/- | బ్యారను అద్దె | 50/- |
| మల్లె | 20/- | తదితర ఖర్చులు | 10/- |
| | | మొత్తము రు. | 545/- |

ప్రతిరైతుయొక్క పొగతోటలలో మల్లెనగయిరాలు పడి పంటపోను మిగిలినది అన్ని నెంబర్లు కలుపుకొని యకరము 1కి పుట్టి కన్ననూ కాదు. కాని మీరు ఇచ్చిన కనీసధరలకు వ్యాపారస్తులు మించికొనరు. పుగాకునకు పై లెఖ్ఖ ప్రకారం గరిష్ఠధర ఎంతవుంటే రయితుకు గిట్టుబాటు అవునో మీరుచూచి దానినే కనీసపు ధరగా నిర్ణయించవలయును.

## శ్రీ ఖంటా కోటయ్యగారు,

ఆహారకమిటీ సభ్యుడు, పూసపాడు.

పొగాకు సక్రమ కనీసధరల నిర్ణయ విషయములో ప్రచురించిన కరపత్రములు, "సక్రమ కనీసధరలు" అనేపుస్తకము, మార్కెట్ కమిటీవారి రిజల్యూషన్ నెం. 274 రు చదివియున్నాను. సదరు పుస్తకములో చర్చించిన విషయములను బట్టియు, ప్రస్తుతము పొగాకు ఉత్పత్తిచేయు విషయములో రయితుకగు జిరాయితీ

ఖర్చులనుబట్టియు ప్రస్తుతము పొగాకునకు రైతుకుయిచ్చే వెల చాలా స్వల్పమై రైతుకు నష్టదాయకముగా వున్నది కాబట్టి వినియోగదారుడు యిచ్చువెలలో సాధ్యమైనంతవరకు ఎక్కువగా ఉత్పత్తిదారునకు చెందునట్లు చేయవలెనంటే పొగాకునకు కనీసధరలు నిర్ణయించుట ముఖ్యఅవసరము. నాటుపొగాకు ఉత్పత్తి దారునకగు ఖర్చులనుబట్టి నాటుపొగాకునకు కనీసం రు 150-0-0 లు ధర నిర్ణయించుట న్యాయమని నాఅభిప్రాయము.

శ్రీ కొప్పురావూరి శీతారామయ్యగారు,

ఆహారకమిటీ మెంబరు, దైవాలరావూరు.

యీ సంవత్సరము స్థానిక రేట్లు దొరపొగాకుకు :—

| గ్రేడు | రేటు | గ్రేడు | రేటు |
|---|---|---|---|
| నెంబరు 1 | 675-0-0 | డార్కుగ్రీను | 230-0-0 |
| ,, 2 | 575-0-0 | నెంబరు 6 | 150-0-0 |
| ,, 3 | 490-0-0 | ఎండు వర్జీనియా పొగాకు | 275-0-0 |
| లైటుగ్రీను | 425-0-0 | | |
| ,, 5 | 270-0-0 | నాటుపొగాకు | 225-0-0 |

పై రేట్లు కనీసముగా భావించి మీరు పై రేట్లు యిప్పించవలయునని కోరుచున్నాను.

శ్రీ దావులూరి వెంకటాద్రిగారు,

ప్రెసిడెంటు, ఆహారకమిటి, గోనసపూడి.

మీరు పొగాకు సక్రమ కనీసధరల నిర్ణయ సంబంధములో ప్రచురించిన పుస్తకము, యితర ప్రచురణలు చూచినాను. నాటు పొగాకు కనీసధర రు. 150/- నిర్ణయించడము మంచిది. రయితుకు పొగాకు హామిమీద అప్పులు తక్కువ వడ్డీతో యివ్వనిదే కనీసధరలు అమలుపరచుట కష్టమని నా అభిప్రాయము.

## శ్రీ వి. నారాయణరెడ్డిగారు,

ఆహారకమిటీ అధ్యక్షుడు, ఇనమనమెళ్ళూరు.

యీసంవత్సరం ప్రపంచ ఆర్థికపరిస్థితులవల్ల కలిగే రయితులయొక్క క్షేమమునకుగాను వర్జీనియా పొగాకునకు య 1 కి అయినఖర్చు యీక్రింద చూపబడినది. అందుకుగాను ధరలు యిదివరకు వలెగాక యీక్రింది కనీస రేట్లు యిచ్చిన యెడల రయితులకు అనుకూలముగా నుండునని యీగ్రామ కమిటీచే తీర్మానించడమైనది.

కనీసం య 1కి అయిన ఖర్చు

| | | |
|---|---|---|
| 1. | ఎరువు | రు 60-0-0 |
| 2. | వ్యవసాయం వగైరా | 65-0-0 |
| 3. | నారు | 65-0-0 |
| 3. | నాటు | 20-0-0 |
| 5. | కలుపువగైరా | 30-0-0 |
| 6. | ఆకుతోలకము | 80-0-0 |
| 7. | గ్రేడుకూలి | 20-0-0 |
| 8. | పురి, పట్లలు, నులక | 10-0-0 |
| 9. | బొగ్గువగైరా | 50-0-0 |
| 10. | స్టోకర్ | 10-0-0 |
| 11. | బేరన్ పెట్టుబడి | 35-0-0 |
| 12. | శిస్తు | 5-0-0 |
| 13. | మేనేజిమెంటు | 25-0-0 |
| 14. | కర్రలు వగయిరా | 60-0-0 |
| | ఖర్చు మొత్తం రు. | 535-0-0 |

య 1 కి తేలుబడి అయ్యే ఆకు 500 పౌనులకు కనీసం యీధరల ప్రకారం వచ్చు ఆదాయము.

| గ్రేడు నెం. | పౌన్లు | రేట్లు | మొత్తం |
|---|---|---|---|
| 1, 2 | 100 | రు.900-0-0 | రు.180-0-0 |
| 3 | 100 | 750-0-0 | 150-0-0 |
| 4 | 75 | 550-0-0 | 82-8-0 |
| 6 | 100 | 400-0-0 | 80-0-0 |
| డార్కు గ్రీన్ | 50 | 250-0-0 | 25-0-0 |
| 7 గుల్ల | 75 | 200-0-0 | 30-0-0 |
| య 1 కి రాబడి మొత్తం | | | 547-8-0 |
| య 1 కి ఖర్చు మొత్తం | | | 535-0-0 |
| నిల్వ | | | 12-8-0 |

కాలమునుబట్టి యింకా రైతు చెల్లించనున్న మక్తాలు, య 1 కి రు 100/- లు హెచ్చుఖర్చు లగుచుండుటచే కనీసము పై ధరలకు తగ్గకుండా వుండగలందులకు కోరడమైనది.

### శ్రీ నెంపరాల రామక్రిష్ణయ్యగారు,

ప్రెసిడెంటు, ఆహారకమిటీ, నేలూరు.

గుంటూరు పుగాకు మార్కెటింగు కమిటి పుగాకు సక్రమ కనీస ధరలను గురించి ప్రయత్నము చేయుట యెంతేని అభినందనీయము. ప్రస్తుతము రైతులు తప్పని సరియై వ్యాపారపంటలను పండించడమేగాని వాటికి రావలసిన ధరలు రావడములేదు. అందులో వేరుశనగ, పుగాకు చాలా ముఖ్యము. యీ సంవత్సరము పుగాకు రయితులు పెట్టిన ఖర్చులు విపరీతము. అధికవర్షములవలన పుగాకు దిగుబడి చాలా తక్కువ. దానినిబట్టి మీరు నిర్నయించిన కనీసధరలు చాలా తక్కువగా ఉన్నవని నా అభిప్రాయము. కాబట్టి

| గ్రేడు నెం. | | ధర. | |
|---|---|---|---|
| 1 | రు. | 780 | |
| 2 | | 700 | |
| 3 | | 640 | |
| 4 | | 550 | ఉండవలయును. |

మిగతా గ్రేడ్లుకు మీరు సూచించిన రేట్లకన్న పౌను 1 కి రు. 0-1-0 చొప్పున పెంచుట అవసరమనిన్ని, నాటు పొగాకు ధర పుట్టి 1 కి రు. 200 కనీస ధరగాను రు. 250 లు గరిష్ఠ ధరగాను నిర్నయించుటవల్లనే రయితు అధిక నష్టములకు పాల్పడకుండ వుండగలడు. కాబట్టి నేను సూచించిన పై రేట్లు వెంటనే అమలులోకి వచ్చుటకు మద్రాసు ప్రభుత్వాన్ని వత్తిడి చేయుటకు మా రయితుల అండ మీకున్నదని గమనించవలసినది. కాబట్టి వెంటనే కార్యాచరణకు పూనుకుంటారని ఆసించుచున్నాను.

### శ్రీ పి. రామాచార్యులుగారు,

ప్రెసిడెంటు, పంచాయతీబోర్డు, పరుచూరు.

మార్కెటు కమిటీవారు పుగాకు సక్రమ కనీసధరలు వుండవలెనను చేయు కృషి ముఖ్యమైనది. వినియోగదారుడు యిచ్చు లెఖలో సాధ్యమైనంతవరకు వుత్పత్తిదారునకు చెందునట్లు చేయవలెనంటే పుగాకు సక్రమ కనీసధరలు గవర్నమెంటువారు నిర్నయించి పుగాకు వుత్పత్తిదారునకు తోడ్పడుట ముఖ్యమైన విషయము.

శ్రీ చుండి రంగనాయకులు గారు,

ఆహారకమిటీ ప్రెసిడెంటు, సందెపూడి.

వ్యాపార పంటలలో యీ ప్రాంతములకు పొగాకు ప్రధానమైనది. అందువలన పొగాకుకు సక్రమ కనీసధరలు నిర్ణయించడము ఎంతయినా అవుసరము. యితరపంటల ధరలతో పోల్చిచూచినచో, పొగాకు రైతులకు యేమియు గిట్టుబాటు అగుటలేదు. ప్రత్యేకించి యీ సంవత్సరమునకు రైతులుపెట్టిన ఖర్చులనుబట్టి పొగాకు యు॥ నకు దిగుబడి అంచనానుబట్టి, మీరు నిర్ణయించుటకు సూచించిన ధరలు చాలా తక్కువగా నున్నవి. అయితే ప్రధానముగా మీరు నిర్ణయించిన ధరలలో 1, 2, 3, 4 గ్రేడ్లకు ధరలు యీ క్రిందివిధముగానైన వుండుట అవుసరము.

| గ్రేడు నెం. | ధర |
|---|---|
| 1 | రు 780/- |
| 2 | 700/- |
| 3 | 640/- |
| 4 | 550/- |

ఎగ్మార్కు గ్రేడ్లకు పై రేట్లున్నూ,

మిగతా గ్రేడ్లకుకూడా ఎగ్మార్కు గ్రేడ్లకు పౌ 1 కి రు 0-1-0 చొప్పున పెంచుట అవుసరమని నా అభిప్రాయము. కనుక మీరు ప్రస్తుత పరిస్థితుల నాలోచించి నేను పైన సూచించిన ధరలనైనను మద్రాసు ప్రభుత్వము నిర్ణయించుటకు ప్రియత్నము చేయుదురని నా అభిప్రాయము.

శ్రీ గుంటుపల్లి వెంకటపుల్లయ్య గారు,

ఆహారకమిటీ ప్రెసిడెంటు, కంతేరు.

మీరు వేసిన "సక్రిమ కనీసధరలు" నేను చూచినాను. దానిలో మీరు నిర్నయించిన రేట్లకన్నా యింకా యెక్కువగా వుంటేనేకాని రయితులకు గిట్టుట కష్టము. కనుక మీరు నిర్నయించిన సక్రమ కనీసధరలు త్వరలో అమలు

జరుపు ఏర్పాటు చేయించవలెను. యీ సంవత్సరము య 1 కి షుమారు రు. 450 నుండి రు. 500 ల వరకు రైతులకు వ్యవసాయం, యెరువులు, లేబరు, నారు ఖర్చులు అయియున్నవి. మీరు నిర్ణయించిన ధరలకు తగ్గినట్లయితే రయితులకు చాలా యిబ్బంది కలుగుతుంది. త్వరలో యీ కనీసధరలు అమలు జరిపించగలరని ఆశించుచున్నాను.

### శ్రీ గోరంట్ల వెంకయ్యా గారు,

ఆహారకమిటీ చైర్మన్, వీరన్నపాలెం.

ఈ యుద్ధానంతర పరిస్థితులలో ధరలు విపరీతముగా పెరిగినందున యీ రోజులలో రైతులు పొగాకుపండించుటలో కష్టములపాలవుతూ యున్నారు. యీ సంవత్సరము పొగనారు య 1కి రు 150/- లు అమ్మియున్నది. మక్తాభూములు య 1 కి రు 300/- లు వరకు వున్నవి. యీ పరిస్థితులలో రయితులు పోయిన సంవత్సరం పుట్టి 1కి రు. 500/- లు పెచ్చుధరయిచ్చి కొనియున్నారు. యీ సంవత్సరం అధరకే వ్యాపారస్తులు కొనేయడల పొగాకు రయితు విపరీతనష్టమునకు గురియగును. కాన మార్కెట్టు కమిటీవారు తీసుకొన్న కనీసధరల నిర్ణయమును, పుట్టి 1కి రు. 575/- లు ధరను గవర్నమెంటువారు యీ సంవత్సరమే అమలు పరచునట్లు చేయవలసినది.

### శ్రీ లావు సుబ్బయ్యా గారు,

చైర్మన్, ఆహారకమిటి, పోతుకట్ల.

ఈ యుద్ధపరిస్థితులలో ఆర్థికమాంద్యము యెక్కువై ధరలు విపరీతముగా పెరిగియున్న యీరోజులలో రైతు పొగాకుపండించుటలో పెద్దదెబ్బతినుచున్నాడు. యీ సంవత్సరము పొగనారు, బేరనుసామానులు, బొగ్గు వగైరాల ధరలు విపరీతముగా పెరిగి రయితు యెక్కువ అప్పులపాలవుచున్నాడు. కాన ఇట్టిపరిస్థితులలో మార్కెటు కమిటీవారు పొగాకు కనీసధరల నిర్ణయము తీసుకొని రయితుకు గిట్టుబాటయ్యే ధరలు ఇప్పించుటకు ప్రయత్నము చేయుచున్నారు. ఇదియెంతయో రయితుకు వుపయోగము. వారు నిర్ణయించిన ధరలు ఇంకాచాలవు. పెచ్చు

కనీసధరలు నిర్ణయించవలసినదిగా నేను నా అభిప్రాయమును ఇచ్చుచున్నాను. కాన దీనిని గవర్నమెంటు వెంటనే తీసుకొని కనీసధరలు యీసంవత్సరమునుండి అమలులోనికి వచ్చునట్లు చూడవలసినది.

శ్రీ జి. దాసరయ్యగారు,
ప్రెసిడెంటు, గ్రామ ఆహారకమిటీ, అమరావతి.

పుట్టి 1 కి సగటున రు 480/– ల ప్రకారము అమ్ముటకు వీలగునని మా కమిటీవారు అభిప్రాయపడుతున్నారు. ఎకరం 1కి అయ్యేఖర్చులు క్రింద తెలియ పరుస్తున్నాను.

| | |
|---|---|
| పొలముల కౌలు ఖరీదు | రు. 175/– |
| నారుకొనుగోలు, పడిమొక్కలు వేతతోసహా | 75/– |
| బ్యారక్ ఖర్చులు | 115/– |
| కలుపులు, మల్లెతీయించుటకు | 15/– |
| లాభం | 100/– |
| మొత్తం రు. | 480/– |

శ్రీ యస్. రామమూర్తిగారు,
పంచాయితీబోర్డు అధ్యక్షులు, ఇంకొల్లు.

"పొగాకు సక్రమ ధరలు" అనే కరపత్రం చదివి ఈ క్రింది సూచనలు యివ్వాలని కుతూహలపడు తున్నాను.

1. కనీసధరల నిర్ణయం మంచిదే. కాని మీరు సూచించిన ఉత్పత్తి ఖర్చులు – ముఖ్యంగా లేబరు ఛార్జీల - విషయంలో చాలా తక్కువగా నున్నవి.
2. అమ్మకానికి పోకముందే పొగాకు గ్రేడును మార్కెటు కమిటీవారే సర్టిఫై చేయాలి. దానివల్ల తరువాత తగాదాలు వచ్చే అవకాశాలు ఉండవు.

3. శాంపిళ్ళు తమ వద్ద ఉంచుకొని. కమిటీవారు యెప్పటి కప్పుడు ఆగ్‌మార్కు ఉద్యోగులకు సలహాలు యిస్తుండాలి.
4. విదేశ మార్కెటు ధరలు, పొగాకు అభివృద్ధి మొ॥ లగు విషయాలను మార్కెటు కమిటీవారు పత్రికల్లో ప్రచారం చేయాలి.
5. ప్రభుత్వంవారు పొగాకు నోడప్పన్నను ఊరిబైటకు తీసివేయాలనిచేసే ప్రయత్నాలను మీరు వ్యతిరేకించాలి. దీనిని పంచాయితీబోర్డుగల గ్రామాలకు వర్తించనీయకూడదు.

### శ్రీ నంకాయలపాటి వీరయ్యగారు,

పంచాయితీబోర్డు ప్రెసిడెంటు, స్వర్ణ.

కనీసధరలు నిర్ణయించుట చాలా అవసరము. మీరు నాటు పొగాకుకు ప్రకటించిన కనీసపురేటు పుట్టి 1 కి రు. 135/- గా వున్నది. కాని రయితుకుఅయ్యే ఖర్చులు విపరీతముగా పెరిగి పోయినందున రు. 135/- ధరను రు. 150/- ధరకు మార్చవలెను. కనీసపుధర రు. 150/- లేనిది మాకు గిట్టదు.

### శ్రీ కరణం శేషతల్పశాయిగారు

స్వర్ణ కో-ఆపరేటివు స్టోర్సు సెక్రటరీ, స్వర్ణ.

మార్కెటింగు కమిటివారు నిర్ణయించిన కనీసపు ధర నాటు పుగాకుకు చాలా తక్కువయనియు కనీసపు ధర ముఖ్యముగా రు 150/- లకు తక్కువగాకుండా నిర్ణయించిన రైతు నష్టపడడనియూ, ముఖ్యముగా కనీస ధరలు నిర్ణయించు విధానము నమలుపరచుట అవసరమని నా అభిప్రాయము.

### శ్రీ చెన్నపాటి వెంకటేశ్వర్లుగారు,

గ్రామ మున్సబు, కొమ్మూరు.

కనీస ధరల విషయములో మీరు ప్రకటించిన కరపత్రములను, పుస్తకమును చదివినాను. కనీస ధరలు ఉండుట చాల అవసరము.

## శ్రీ వై. కోటిరెడ్డిగారు,

పంచాయతిబోర్డు ప్రెసిడెంటు, మేదరమెట్ల.

రైతుయొక్క ఆర్థిక పరిస్థితిని, వ్యవసాయపు సామానుల, పశువుల ధరలున్నూ, కూలీల రేట్లున్నూ, భూముల మక్తాలున్నూ, భూముల ఖరీదులున్నూ, నానురాను మితిమీరి ఖరీదులు పెరిగినందువల్ల వచ్చు ఆదాయము యీ ఖర్చులకే సరిపోక రయితు గుణస్థుడై వున్నాడు.

యీనాడు గుంటూరు మార్కెటింగు కమిటీ రయితులకు పొగాకు పంట యొక్క శ్రమ విలువను నిర్ణయించుట ధర్మమని గుర్తించినందులకు మిక్కిలి అభినందించుచున్నాను.

ఇతర దేశములలోని రయితులు పొగాకు పంట య 1 కి సాలుకు (ఎరువుల ఖర్చులు, దున్నకంతోసహా) రు 500-0-0 ఖర్చుపెట్టి రు 3000-0-0 వరకు లాభం పొందుట జరుగుచున్నది. మన దేశములో య 1 కి మక్తాతోసహా రు 320-0-0 ఖర్చుపెట్టి దాని ఫలితమును పొందకయే రైతు ఋణగ్రస్థుడై చెడిపోవుట తటస్థించినది. యీ కృషీవలునియొక్క ఫలితమును వ్యాపారస్తుడు పొందుచున్నాడు. నాటుపొగాకుకు వు 1 కి రు 225-0-0 కనీసపు రేటు నిర్ణయించవలసినదిగా నేను కోరుచున్నాను. రైతులు ఆమాత్రపు ధరలు యేర్పడితేనే కొద్ది లాభము పొందుట తటస్థించును.

దొరపుగాకు విషయమును గురించి య 1కి సాలుకు ఖర్చులు రు 500-0-0 కనీసము అవుటవల్ల రేట్లు పుట్టి 1కి 1వ నెంబరు రు 650-0-0 లకు తక్కువ లేకుండా యుండుటయున్నూ, చివర సరుకుకు పుట్టి 1కి రు 100/- లున్నా వుండవలయునని కోరుచున్నాను.

## శ్రీ పోలినేని హనుమయ్యగారు,

పంచాయితిబోర్డు ప్రెసిడెంటు, దైవలరావూరు.

మేము, మెంబర్లు అందరము మీటింగుపెట్టుకొని మీయొక్క కనీసపు రేట్లను పరిశీలించినాము. చాలా తక్కువగా కనిపించినవి. పూర్వము జరిగిన సంవత్సరములలో రయితు యెప్పుడును యిలాంటి కష్టనష్టములను ఎరుగడు. యీసంవత్స

రము వర్షాధిక్యమువలన పైరులు యేమియు పండించలేకపోయినాడు. అదియును గాక, ఎరువులు అధికధరలు అయినవి. పొగనారు పోయినసంవత్సరము 1000 మొక్కలు రు 2/- లు అమ్మినది. యీసంవత్సరము 1000 మొక్కలు 16 రూపాయలకు తక్కువ అమ్మలేదు. దొరనారువిషయము యిది. నాటునారు 1000 మొక్కలు రు 5/- లకు తక్కువలేదు. ఇది యిలావుండగా కూలివారి విషయంలో రోజు 1కి మనిషికి కనీసం 1 రూపాయకు తక్కువలేదు. అదియునుగాక ఒకసారి మొక్కవేసినపొలములో 5 సార్లకు తక్కువ వేయలేదు. కాన మీరు రయితు కష్టనష్టములను విచారించి మాకు కనీసరేట్లు యిప్పించవలెను.

దొరపొగాకుకు స్థానికరేట్లు.

| గ్రేడు | రేటు | గ్రేడు | రేటు |
|---|---|---|---|
| నెం. 1 రు. | 675/- | నెం. 5 రు. | 270/- |
| నెం. 2 | 575/- | డార్కు గ్రీను | 230/- |
| నెం. 3 | 490/- | నెం. 6 | 150/- |
| లైటు గ్రీను | 425/- | | |

ఎండువర్జీనియా పొగాకుకు రు 275/- లున్ను, నాటు పొగాకుకు కనీసము రు 225/- లున్ను యిస్తే యీ సంవత్సరము రయితుకు లాభముగాని, నష్టముగాని యుండబోదు. కాన తమరు ఆలోచించి పై కనీసపురేట్లు యిప్పించగలందులకు ప్రార్థిస్తూయున్నాము.

శ్రీ ఎన్. వెంకటస్వామిగారు,

గ్రామ రయితు సంఘం అధ్యక్షుడు, పర్చూరు.

పొగాకు కనీసధరల సందర్భంలో గుంటూరు టుబాకో మార్కెటు కమిటీ ప్రచురణలు చూచినాను. కమిటీవారు తలపెట్టిన ఉద్యమాన్ని అభినందిస్తున్నాను.

రైతుయొక్క శ్రేయస్సును గమనించి, కనీసధరలు నిర్ణయించి అమలు జరుపటం అత్యవసరమని భావిస్తున్నాను. మీరు సూచించిన పుట్టి 1 కి రు. 150 లు అయినా కనీసం ఉండాలి.

**శ్రీ దుద్దెంపూడి సాంబయ్యగారు,**

పంచాయతీబోర్డు ప్రెసిడెంటు, పాలపర్రు.

పుగాకుకు కనీసధరల నిర్ణయించుట చాలా అవసరం. కాని ధరలు యీ క్రింది మాదిరిగా పెంచవలసినదిగా కోరుచున్నాను.

| గ్రేడ్ | రేటు |
|---|---|
| 1 నెం | రు 600 |
| 2 నెం | 500 |
| 3 నెం | 450 |
| 4 నెం లైట్ గ్రీన్ | 350 |
| 5 నెం | 225 |
| డార్క్ గ్రీన్ | 150 |
| 6 నెం | 50 |
| ఎండు వర్జీనియా | 170 |
| నాటు | 170 |

**శ్రీ పి. వెంకటేశ్వర్లుగారు, శ్రీ వాకా వెంకట్రమణా రెడ్డిగారు,**

**శ్రీ పాటిబండ్ల భద్రయ్యగారు,**

పొగాకు రైతులు, దొడ్డవరప్పాడు.

వర్జీనియా పొగాకు, నాటుపొగాకు యీ దిగువ నుదహరించబడిన ప్రకారము ధరలు నిర్ణయించవలయునని కోరుచున్నాము.

| | గ్రేడు | రేటు | గ్రేడు | రేటు |
|---|---|---|---|---|
| వర్జీనియా | 1 నెం | రు 700/- | 6 నెం | 280/- |
| | 2 నెం | 625/- | 7 నెం | 200/- |
| | 3 నెం | 550/- | నాటు పొగాకు | 135/- |
| | 4 నెం | 480/- | తడుపు | 400/- |
| | 5 నెం | 350/- | | (పన్ను లేకుండా) |

## శ్రీ మంకిరెడ్డి నారాయణరెడ్డిగారు,

గ్రామ సేవాసంఘ ప్రెసిడెంటు, వెనిగండ్ల.

ఈ ప్రాంతములో ఎక్కువగా రయితు నాటు పొగాకుపై ఆధారపడి యున్నాడు. ప్రస్తుత పరిస్థితులను బట్టి ప్రతిరైతుకు సాధారణముగా ఎకరము 1 కి నాటు పుగాకుకు ఉత్పత్తి ఖర్చులు యీ క్రింది విధముగానుండును.

| | | |
|---|---|---|
| 1) | ఎరువులు | రూ. 100/- |
| 2) | దున్నడం, గొర్రు, పొట్టిగొర్రు, గుంటకలు వగైరా | రు. 55/- |
| 3) | ఎరువులు చిమ్ముట | 2/- |
| 4) | నారు | 15/- |
| 5) | నాటు కూలి | 10/- |
| 6) | కలుపు పిలకతీయుట | 10/- |
| 7) | మల్లె వగయిరాలు | 10/- |
| 8) | ఆకుకోత కూర్చడం, పురి | 20/- |
| 9) | పందిళ్ళు (గదులు) | 12/- |
| 10) | మండె పెండెలు కట్టుట | 8/- |
| 11) | కవులు | 100/- |
| | మొత్తము | రు. 342/- |

దీనిని బట్టి ఎకరమునకు రు. 342/ లు ఖర్చు అగును. ఎకరములోని పంట షుమారు 800 వౌనులు అగును. కాబట్టి పుట్టి 1 కి ఉత్పత్తి ఖర్చు కనీసము రు. 212-8-0 అగును. రయితుకు 10% లాభించవలెనన్న కనీసము పుట్టి 1 కి రు. 240 లు ఉండవలెను. యీ నిర్ణయము 47 సం॥ పు సీజనుకైనా ప్రభుత్వ ఆమోదముపొంది అమలు జరుపుదురని నమ్ముచున్నాను.

## శ్రీ కందిమళ్ళ రామయ్యగారు

కార్యదర్శి, గ్రామ రైతు సంఘం, వేలూరు.

గుంటూరుజిల్లా పొగాకు మార్కెటు కమిటీ పుగాకుకు సక్రమ కనీసధరలను గురించి ప్రయత్నించడం ఎంతైనా అభినందనీయం. ప్రస్తుతం రయితులు వ్యాపార పంటలైన పొగాకు, వేరుశనగ విపరీత ఖర్చులతో పండించడం, వాటికి గిట్టుబాటైన ధరలురాక నష్టపడటం జరుగుతున్నది. యీ సంవత్సరము పొగాకు దిగుబడి వర్షాలవల్ల చాలా తక్కువ. అందువల్ల యీదిగువ సూచించబడిన ధరలు నిర్ణయించాలని నా అభిప్రాయము.

| గ్రేడు. నెం. | ధర. |
|---|---|
| 1 | రూ. 780/- |
| 2 | 700/- |
| 3 | 640/- |
| 4 | 550/- |

మిగతా గ్రేడ్సుకు మీరు సూచించేధరకన్న పౌను 1 కి రు. 0-1-0 చొప్పున పెంచుట అవసరమనిన్నీ నాటు పుగాకు ధర పు 1 కి రు. 200 లు కనీసధరగాను రు. 250 లు గరిష్ఠ ధరగాను నిర్ణయించటంవల్లనే రయితులు నష్టానికి లోను గాకుండా వుండగలరు. కాబట్టి పైసూచించిన రేట్లు వెంటనే అమలులోకి వచ్చుటకు మద్రాసు ప్రభుత్వాన్ని వత్తిడిచేయుటకు మా రయితు సంఘం అండ మీకున్నదని గమనించునట్లు మేము ఆందోళన చేయుచున్నాము. కాబట్టి వెంటనే కార్యాచరణకు పూనుకుంటారని ఆశించుచున్నాను.

## శ్రీ కొల్లా చినవెంకయ్యగారు,

పంచాయతీబోర్డు ప్రెసిడెంటు, ఉప్పుటూరు.

గుంటూరు పొగాకు మార్కెట్ కమిటీవారు పొగాకు సక్రమ కనీస ధరల విషయంలో ప్రచురించిన కరపత్రములు పుస్తకము చదివినాను. సదరు పుస్తకములో చూపించిన కనీస ధరలు కొంతవరకు రయితులకు సహాయకారిగా వుండగలవు.

వినియోగదారుడు యిచ్చు వెలలో సాధ్యమైనంతవరకు ఉత్పత్తిదారునకు చెందునట్లు చేయవలెనంటే మద్రాసు గవర్నమెంటువారు పొగాకుకు కనీస ధరల నిర్ణయం చేయుట ముఖ్యమని నా అభిప్రాయము. సదరు పొగాకు కనీస ధరల నిర్ణయ విషయములలో పొగాకు కమిటీవారు చేయు కృషి మిక్కిలిగా ప్రశంసింపతగినది. సదరు పొగాకు మార్కెట్టు కమిటీవారి కృషికి గవర్నమెంటువారు సహాయపడి రయితు క్షేమము నిమిత్తం వెంటనే పుగాకుకు కనీస ధరల నిర్ణయం చేయుట ముఖ్యమని నమ్ముచున్నాను.

శ్రీ వి. టి. నరసింహారెడ్డిగారు,

కార్యదర్శి, గ్రామ రైతుకాంగ్రెస్, కంతేరు.

మా గ్రామములో యెక్కువ పొలములో పుగాకు, మిర్చి మొదలగు మెట్ట పైరులు పండించెదరు. ఈసంవత్సరము అతివృష్టివల్ల ఇటువంటి మెట్టపైరులకు విపరీతనష్టములు సంభవించినాయి. అదీగాక మాగ్రామములో వర్షములు మొదలిడకముందుగానే ముదురుతోటలు వేయవలయునను వుద్దేశ్యముతో రైతాంగమంతా యకరమునకు 30 రూపాయలు నారు ఖరీదుచేసి తోటలువేసినారు. తరువాత విపరీతమైన వర్షములుకురిసి వేసినతోటలు వురకవేసిపోయినవి. మరల తోటలువేయడం మొదలిడగా, గోరుచుట్టుమీద రోకటిపోటుమాదిరిగా ఇదివరకే నానాబాధలుపడి రయితుకి వీలుగావున్నచోటల్లా అరువుకి తెచ్చి తోటలువేయగా వర్షాధిక్యతచేత తోటలు వురకెత్తిపోయినవి. అందువల్ల నారు యెక్కడా దొరకనందున విపరీతధరలుపెట్టి య 1 కి 70 రూ॥ 80 రూపాయలుపెట్టి కొనివేయవలసివచ్చినది. ఈవిధంగా మా గ్రామములో వేసినతోటలు మరల మూడుసార్లకి తక్కువ వేయకపోవడంవల్ల యకరమునకు నారుతెచ్చి తోటలువేసినందుకు ఖర్చులన్నీ చూచుకొనగా 256 రూపాయలకు తక్కువలేకుండా అయినది. తరువాత, రయితు ఆ యకరములో మరమ్మతు చేయుటకు ఎరువు, వ్యవసాయ ఖర్చులు, కలుపు, మల్లెతీయుట మొదలగు ఖర్చులన్నీ వేసుకొనిన యకరము 1కి రు. 150 లు తక్కువలేకుండా అవుతుంది. ఈసంవత్సరము కంట్రోలు వస్తువులన్నీ రయితుకి సక్రమమైన ధరకు 'దొరకవలయుననిన చాల్లా కష్టము. బ్యేరన్ సాగు

టకు పైరబాళ్లు, తీగె, కొస మొదలగు వస్తువులన్నీ దొరకుట చాలాకష్టము. రయితు యేదో ఒకవిధంగా నానా అవస్థలుపడి ఈవస్తువులన్నీ సంపాదించుకొని బ్యేరన్ సాగుబడికి తయారయ్యేటప్పటికి యెంతో ఖర్చుపెట్టవలసి వుంటుంది.

ఈ ఖర్చులన్నీ లెక్కచూడగా—అదీగాకుండ యీసంవత్సరము లేతన వేయుటవల్ల యకరములో అన్నిరకముల ఆకు కలిపి ఒకపుట్టికంటె యెక్కువ తయారయ్యేలాగు కనుపించుటలేదు. కాబట్టి రయితు యిటువంటి దుర్భరపరిస్థితులన్నీ యెదుర్కొని, క్యూరింగుచేసుకొని అమ్మపొయ్యేటప్పటికల్లా ధరలు ఏమీ లేవు. అయినప్పటికి మీకమిటీవారు నిర్ణయించిన కనీసధర రు. 675 (1వ నంబరు) యేమాత్రము చాలదు. ఈమధ్య కమీషనుదారులు, వ్యాపారస్తులు వీళ్ళఅందరి లాభములుపోను రయితుదగ్గిర కొనేటప్పటికి చాలా ధరతక్కువకు కొందురు. మీకమిటీ రయితుల తరఫున రయితుయొక్క క్షేమాన్ని ఆశించి పాటుపడుతుంది. కాబట్టి రయితులకి మీరునిర్ణయించిన కనీసధరలకంటె పెంచినగాని లాభములేదు. అందువల్ల మా గ్రామరయితులందరు మీరు నిర్ణయించిన కనీసధరలకంటె యెక్కువధరకు రయితువద్ద కొనేలాగున ప్రయత్నించుదురు, అనే ఆశయముతో మీకమిటీకి మా రయితుల తరఫున రిపోర్టుపంపించుచున్నాము.

### శ్రీ మద్దినేని పోతురాజుగారు,

ఆహారకమిటీ ప్రెసిడెంటు, దైవాలరావూరు.

ప్రస్తుతం మనగుంటూరుజిల్లాలో సుప్రసిద్ధమైన పొగాకును మనరైతాంగం పండించుచున్నప్పటికి సక్రమమైన ధరలు గిట్టుబాటు గాకపోవుటయేగాక నా అనుభవములో చాలామంది నష్టపడుటగూడ జరిగియున్నది. పుగాకురయితులు ఆర్థికబాధలకు గురియై రాబోవు ఆర్థికమాంద్యమును తట్టుకోలేని స్థితిలో నున్నారు. దీనికి పరిష్కారమార్గము పుగాకుకు కనీసధర నిర్ణయించుటయె. మీరు నిర్ణయించిన కనీసధరలను నేనుచూచియున్నాను. అవిచాలా తృప్తికరముగానున్నవి. యీవిషయములో మాగ్రామ రయితాంగముయొక్క సహకారము యిచ్చుటకు ఉద్యుక్తులమైయున్నాము.

## శ్రీ కరణం రంగారావుగారు,

ప్రెసిడెంటు, తాలూకా రైతు సంఘం, నర్సారావుపేట.

పుగాకు వుత్పత్తిదారులకు రక్షణ కలిగించుటకు మీరు కనీస ధరలు నిర్ణయించుటకు కొన్ని సూచనలుచేసియున్నారు. ఉత్పత్తి ఖర్చులు, భరించుటకు వీలు లేనంతగా యీ సంవత్సరం రైతు పెట్టుబడి పెట్టుచున్నాడు. అధికవర్షాలవల్ల పంటలు చాలానష్టపడి పోయినవి. అందువల్ల కనీస ధరలు నిర్ణంచుటలో మీరు సూచించిన ధరలు చాలా తక్కువగా యున్నవి. యీ క్రిందివిధంగా రేట్లు మీరు మార్పుజేసి, మద్రాసు ప్రభుత్వం అమోదించునట్లు చూడవలసియుంది. ప్రజల సహకారం పూర్తిగా మీకుంటుందని మీ సబ్‌కమిటి పని తొందరగాముగించి, మద్రాసు ప్రభుత్వం కదిలి సరియైన కాలంలోనే కనీస ధరల చట్టం అమోదించునట్లు చూడాలి. పుగాకు పండించు రైతాగం సరియైన ధరలు వచ్చునో రావో అని ఆందోళన పడుచున్నారు. రైతాంగం అండ మీకుందని గ్రహించి, మద్రాసు ప్రభుత్వము కదలి తగుచర్య తీసుకొనేటట్లు చూడాలి.

స్థానిక గ్రేడ్లకు యీ క్రింది విధంగా ధరలుండాలని అభిప్రాయ పడుచున్నాను.

| స్థానిక గ్రేడ్లు | మార్కెట్టు కమిటీవారు సూచించిన ధరలు | కనీసం వుండవలసిన ధరల వివరం |
|---|---|---|
| (1) | రూ. 575/– | రూ. 630/– |
| (2) | రూ. 450/– | రూ. 540/– |
| (3) | రూ. 390/– | రూ. 475/– |
| (4) | రూ. 325/– | రూ. 450/– |
| (5) | రూ. 160/– | రూ. 270/– |
| (6) డార్క్‌గ్రీను | రూ. 125/– | రూ. 180/– |
| ఎండు వర్జీనియా | రూ. 170/– | రూ. 225/– |
| నాటుపుగాకు | రూ. 135/– | రూ. 180/–to250/– |

గమనింపు : నాటు పుగాకుకు మీరు కనీస ధర రూ. 180/– లు గరిష్ఠ ధర రూ. 250/– లుగా మార్చాలి. నాటు పుగాకులోకూడ గ్రేడ్లవారిగా ధరలు రు. 180/– 250/– మధ్య యుండవలయునని సూచించుచున్నాను.

## శ్రీ నల్లపాటి ఆంజనేయులు గారు,

ప్రెసిడెంటు, రైతుసంఘం, జొన్నలగడ్డ.

మా పరిసర గ్రామములలో యకరము 1 కి పొగాకు వేయుటకు అగు ఖర్చులు.

| | రు | అ | పై. |
|---|---|---|---|
| ఎకరము కౌలుకు | 50 | 0 | 0 |
| సేద్యము | 40 | 0 | 0 |
| నారు | 25 | 0 | 0 |
| వేతకూలి | 8 | 0 | 0 |
| చెల్లు పాతించుట | 2 | 0 | 0 |
| కొమ్మ కొట్టుట | 1 | 0 | 0 |
| పిలక తీయుటకు 3 పర్యాయలు | 3 | 0 | 0 |
| పురికొస | 4 | 0 | 0 |
| కోత కోయుట | 15 | 0 | 0 |
| పందిరికట్టుట, ఎండినతర్వాత కోయుటకు | 4 | 0 | 0 |
| ఎరువు వేయుటకు | 50 | 0 | 0 |
| మండి తిరిగివేయుటకు 3 పర్యాయములకు | 3 | 0 | 0 |
| రెండువందల ఐదురూపాయలు | 205 | 0 | 0 |

దిగువడి యకరము 1 కి $1\frac{1}{2}$ పుట్టి యగును.

కనుక పుట్టి 1 కి కనీసధర రు 135-0-0 లు. లైన లేనియెడల రైతు పొగాకు పండించటములో, దండగల పాలగును. మద్రాసురాష్ట్ర ప్రభుత్వమును నాటు పొగాకు కనీసధర పుట్టి 1 కి రు 135-0-0 లు కాని, అంతకుపైనగాని నిర్ణయించబడుటకు కోరడమైనది.

## శ్రీ నార్నె చినపున్నయ్యగారు,

గ్రామ కమిటి ప్రెసిడెంటు, వింజనంపాడు.

ఈ సంవత్సరం వర్షంవల్ల పొగతోటలకు, యింతనష్టమని చెప్పుటకు వీలులేకుండా వున్నది. మీరు లోగడ సంవత్సరం సగటున పుగాకు పుట్టి 1 కి రు. 305/- అమ్మకం వచ్చినదినిన్నీ యీ సం॥ రం॥ సగటున పుట్టి 1 కి రు. 410 లు అమ్మకం యివ్వవచ్చుననిన్నీ మీయొక్క వుద్దేశం వెల్లడించినారు. కాబట్టి మీరు వెల్లడించిన ప్రకారంకూడా రయితుకి పుగాకు గిట్టుబాటు వుండదు.

ఈ సంవత్సరం పొగతోటలకు మేము చేసిన ఖర్చులు :

| | | | | |
|---|---|---|---|---|
| పొగతోటలు దుక్కులు, య 1 కి మక్తాలు | రూ. | 250 | 0 | 0 |
| వ్యవసాయం (వర్షంవల్ల రెండు పర్యాయములు) చేసినందుకు య 1 కి అయిన ఖర్చులు. | | 40 | 0 | 0 |
| పొగనారు య 1 కి రెండు పర్యాయములకు అయినఖర్చులు | | 110 | 0 | 0 |
| పొగ మొక్కలు నాటిన కూలిగాని పడిమొక్కలు నాటిన కూలిగాని మొత్తం య 1 కి అయిన ఖర్చులు | | 25 | 0 | 0 |
| పొగతోటలు వేసిన భూముల మరమ్మతులకు వేసిన యెరువు, పిండి బస్తా 1 కి రు. 18-6-0 చొ॥ య 1కి బస్తాలు. 3 కి అయిన ఖరీదు | | 55 | 2 | 0 |
| బస్తాలు మా గ్రామము చేరినందుకు బాడుగ బస్తాలు 3 కి | | 3 | 0 | 0 |
| పొగాకు బేరన్‌లో వేసినందున అద్దె పుట్టి 1 కి | | 40 | 0 | 0 |
| ఆకు అల్లకం పుట్టి 1 కి | | 18 | 0 | 0 |
| డ్రైవర్లకు బేరను 1 కి యిచ్చే జీతము | | 20 | 0 | 0 |
| బొగ్గు బేరను 1 కి టన్నుం బావు చొ॥ ఖర్చు | | 43 | 12 | 0 |
| బేరను 1 కి పట్టెపురి మూడుకట్టలు 1 కి అయినఖర్చు | | 17 | 4 | 0 |
| గ్రేడు చేసినందుకు పుట్టి 1 కి | | 20 | 0 | 0 |
| కిరసనాయిలు బేరను 1 కి | | 1 | 8 | 0 |
| జుమలా మొత్తం | | 643 | 10 | 0 |

సదరు పై పట్టీ ప్రకారం ఖర్చులు గాక, యీ సంవత్సరం రయితు పుగాకు విషయంలోగాని తోటలు వేయించే విషయంలోగాని పడ్డ అవస్థలు మీకు గూడా కొంతవరకు తెలుసును. కాబట్టి రయితుకి వాడిన ఖర్చులు గాక పుట్టి1కి యెంతలాభము ఇవ్వవచ్చునో మీ ఇష్ట ప్రకారం నిర్ణయించి సదరు పట్టీలో వ్రాసిన ఖర్చులును, మీరు రైతుకి నిర్ణయించే లాభమున్ను మొత్తముజేసి సదరు మొత్తం డబ్బును రైతుకి యిప్పించగలందులకు ప్రార్థిస్తాయున్నాను.

శ్రీ నూతక్కి వెంకటరంగారావుగారు,

అధ్యక్షుడు, కృష్ణా సిమెంటువర్కర్స్ లేబరుయూనియన్, మంగళగిరి.

పొగాకు మార్కెటింగ్ సబ్‌కమిటీ సూచించిన ధరలను పరిశీలిస్తే తక్కువలో తక్కువగా కన్పించుతోంది. యీవిషయం పుగాకు వ్యాపారంచేసే గుత్త వ్యాపారస్థుల లాభాలకు సరిపోల్చిచూస్తే యీరోజు రయితుకోరే కనీసధర చాలా సబబైనదని రుజువవుతోంది. యీగుత్తవ్యాపారస్తులు ఒక్క రయితులనే గాక, యీ పరిశ్రమలో పనిచేయు లక్షలకొలది కార్మికులనుకూడా దోచివేస్తున్నారు. యీ దోపిడీని అరికట్టాలంటే పుగాకు ఉత్పత్తిదారులంతా కార్మికుల కనీసకోర్కెలను బలపరచితీరాలి. ఈవిధంగా జరిగినప్పుడే రయితులకు, కార్మికులకు కనీసఆదాయం వస్తుంది.

శ్రీ వి. వి. సుబ్బారావుగారు,

అధ్యక్షులు, ఫ్యాక్టరీ కార్మికసంఘం, మంగళగిరి.

మీరు ప్రకటించిన కరపత్రము చూచినాను. అందులో సూచింపబడిన రేట్లు సమంజసముగానే యున్నవి. ఇదివరలో రైతులు పొందిన ధరలు వారు పెట్టిన ఖర్చులకుగూడా సరిపోనంత తక్కువగానున్నవి. పొగాకు వ్యాపారంలోని విదేశీయకంపెనీలు మాత్రం అత్యధిక లాభాలను సంపాదిస్తునే యున్నవి. ఎన్నికల ప్రణాళికలో వాగ్దానాలు చేసిన నేటి ప్రజాప్రభుత్వం రైతుల యీదుర్భరస్థితిని గుర్తించి. వ్యాపారుల దోపిడినుండి పొగాకు రైతాంగాన్ని గట్టెక్కించటానికి ఇదే మంచి తరుణమని నా అభిప్రాయము.

## శ్రీ యన్. పరసురామయ్యగారు,

అధ్యక్షుడు, గ్రామ పొగాకు ఉత్పత్తిదార్ల సంఘం, నాగులుప్పలపాడు.

యీ సంవత్సరం అనగా 1946 సంవత్సరం పొగాకు వుత్పత్తికి అయ్యేడు ఖర్చులున్ను, రాబడి పొగాకు ఫలితమున్ను, స్థానువారి రూపముగా వివరించుట మన్నాముగాన కనీస రేట్లు సగటు అన్ని నెంబరులుకలసి పుట్టి 1 కి రు 507/- లు కనీసధర గిట్టుబాటు అయ్యేలాగున యీ పట్టీనాఖలా ప్రకారం నిర్ణయం చేలినది. గాన, క్రిందపట్టి దాఖలా ప్రకారం య 1కి రు 475/-లు మక్తాకాక ఖర్చులగును. తద్వారా ఫలితము యీ సంవత్సర వాతావరణ పరిస్థితివల్ల సగటు య 1 కి పొ 500 నులు మాత్రమే సరుకు దిగుబడి అగును. గనక అన్ని నెంబరులు కలసి సగటున పౌ 1 కి గు 1-3-0 లు తక్కువను రైతుకు యిచ్చినయడల భూస్వామికి భూమికి మక్తాక్రింద రు. 25-0-0 లు మాత్రమే మిగులును. గనుక నెంబరువారి కనీస రేట్లు యీ దిగువ వ్రాసిన ప్రకారము అయినను పుడవలయునని కోరుచున్నారు.

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| యెరువు ఖరీదు | రు. 50 | 0 | 0 | | కంపెనీకి తోలిన బాడుగ | 7 | 0 | 0 |
| తోలకం బాడుగ | 10 | 0 | 0 | | పందిరి ఖర్చులు | 15 | 0 | 0 |
| వ్యవసాయం | 52 | 0 | 0 | | బొగ్గుగాని కట్టెలుగాని | 50 | 0 | 0 |
| ఎరువు చల్లకం | 3 | 0 | 0 | | టోకర్లు | 12 | 0 | 0 |
| నారు ఖరీదు | 60 | 0 | 0 | | బలుపులు కిరసనాయిలు | 8 | 0 | 0 |
| మొక్కనాటు కూలి | 20 | 0 | 0 | | పురి | 4 | 0 | 0 |
| కలుపు పాలింపుమల్లె | 30 | 0 | 0 | | బ్యారన్ పెట్టుబడిగాని లేక అద్దె | 35 | 0 | 0 |
| ఆకు వల్లకూలి | 50 | 0 | 0 | | పెట్టుబడికిగాను వడ్డీ | 3 | 0 | 0 |
| ఆకు తోలకం | 10 | 0 | 0 | | శిస్తు | 5 | 0 | 0 |
| గ్రేడు ఖర్చు | 16 | 0 | 0 | | సాదరు | 10 | 0 | 0 |
| పట్టలు, పురి | 5 | 0 | 0 | | మేనేజిమెంటు | 25 | 0 | 0 |
| | | | | | అయిన ఖర్చులు వెరశి రు. | 475 | 0 | 0 |

దిగుబడి సరుకు నెంబరువారిగా

| గ్రేడు. | పౌనులు. | | రేట్లు. | | | | ఖరీదు. | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 నెంబరు | 125 | రు. | 750 | 0 | 0 | రు. | 187 | 8 | 0 |
| 3 నెంబరు | 125 | | 650 | 0 | 0 | | 162 | 8 | 0 |
| 4 లైటుగ్రీను | 75 | | 500 | 0 | 0 | | 75 | 0 | 0 |
| 6 నెంబరు | 75 | | 350 | 0 | 0 | | 52 | 8 | 0 |
| మొద్దుపచ్చ | 50 | | 250 | 0 | 0 | | 25 | 0 | 0 |
| గుల్ల | 35 | | 150 | 0 | 0 | | 10 | 0 | 0 |
| నూరార | 15 | | 30 | 0 | 0 | | 1 | 0 | 0 |
| | 500 | | | | | రు. | 513 | 8 | 0 |

నాటుఆకు యు 1 కి కనీసం ముక్తాగాక రు 320-0-0 లు ఖర్చు అగుచున్నది. రాబడి సరుకు పౌ 700 లో 800 పౌనులో వచ్చును. నాటు పుగాకు కనీసము పుట్టి 1 కి రు 275-0-0 లు వేస్తేనేకాని రైతుపెట్టిన ఖర్చులురావు. యీ అభిప్రాయమును మా కమిటీచే ఏకగ్రీవముగా ఆమోదించడమైనది.

శ్రీ బి. వీరభద్రరావుగారు,

ఆహార కమిటీ అధ్యక్షులు, ఉప్పుటూరు.

పొగాకు కనీసధరల సందర్భములో మీరు ప్రకటించిన కరపత్రము, తీర్మానము చూచినాను. కనీసధరల నిర్ణయ సిద్ధాంతముతో నేను ఏకీభవిస్తున్నాను. రాబోయే ఆర్థిక మాంద్యందృష్ట్యా కనీసధరలు అమలుపరచటం ఎంతైన అవసరం.

మీ 274 తీర్మానంలో సూచించిన ధరలు పై గ్రేడ్ల విషయంలో సక్రమంగానే ఉన్నవి. కాని తక్కువ గ్రేడ్ల విషయంలో (డి. జి., నెం. 5, 6 ర్లు) ఇంకా యెక్కువగా ఉండాలని నా అభిప్రాయం.

శ్రీ చెరువు బాపనయ్యగారు,
పరుచూరు.

1947 సం॥ నకు అయిన, కాభోవు పుగాకు తోటల ఖర్చులు.

| | | | |
|---|---|---|---|
| మక్తాలు య 1 కి | రు. 250 0 0 | పురి | 5 0 0 |
| నారు | 80 0 0 | పికింగు | 30 0 0 |
| వేతకూలి | 15 0 0 | గ్రేడింగు | 20 0 0 |
| నారుకు వెళ్ళినసాదరు బాడుగలు | | ఆకుబాడుగలు | 10 0 0 |
| ఛార్జీలు వగైరా ఎ 1 కి | 10 0 0 | కిరసనాయిలు | 10 0 0 |
| బొగ్గు, కాల్పుకు | 60 0 0 | బ్యారను అద్దె | 50 0 0 |
| పందిళ్ళు, మల్లె, కలుపు తీసిన కూలీలకు అన్నీకలసి | | | 10 0 0 |
| | | య 1 కి మొత్తం రు. | 550 0 0 |

శ్రీ లింగమల్లు బ్రహ్మయ్యగారు,
ఈపూటూరు.

1946–47 సం॥పు పుగాకురయితుల సగటు (ఎ 1 కి) వ్యవసాయ ఖర్చులు.

| | | | |
|---|---|---|---|
| కవులు య 1 కి | 200 0 0 | పొయ్యివద్ద కూలీ | 20 0 0 |
| దున్నకం | 25 0 0 | గ్రేడింగు | 20 0 0 |
| మరామత్తులు, ఎఱువులు | 30 0 0 | పురి | 5 0 0 |
| నారు | 75 0 0 | పచ్చిఆకు తోలకం | 12 0 0 |
| కూలి | 15 0 0 | కంపెనీకితోలకం | 3 0 0 |
| పాలింపు కలుపుమల్లె | 11 0 0 | పట్టెలు | 5 0 0 |
| పచ్చిఆకు కలుపు | 30 0 0 | సాదరు | 10 0 0 |
| బొగ్గు | 35 0 0 | అద్దె | 30 0 0 |
| | | పందిళ్ళు | 4 0 0 |
| | | య 1 కి ఖర్చు మొత్తం రు. | 530 0 0 |

## శ్రీ టి. వెంకటేశ్వర్లుగారు,

### 1947 సంవత్సరపు ఉత్పత్తి ఖర్చులు

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ఎకరం కౌలు | రు. 225 | 0 | 0 | బొగ్గు | 40 | 0 | 0 |
| దున్నడు ఖర్చులు | 40 | 0 | 0 | పాకలు, పందిళ్ళు | 5 | 0 | 0 |
| ఎరువు | 50 | 0 | 0 | అద్దె | 40 | 0 | 0 |
| నారు ఖరీదు | 90 | 0 | 0 | గ్రేడింగు, క్యూరింగు ఖర్చులు | 35 | 0 | 0 |
| నాటుకూలి | 10 | 0 | 0 | సాదరు ఖర్చులు | 15 | 0 | 0 |
| కలుపుతీత, మల్లె | 10 | 0 | 0 | మామూళ్ళు | 10 | 0 | 0 |
| ఆకువిరుపు బ్యారన్ తోలకం అల్లకం | 40 | 0 | 0 | | | | |
| | | | | మొత్తం రు. | 610 | 0 | 0 |

సగటున రు 550-0-0 లు వుంటాయి. ఎకరానికి సగటున ఈ సంవత్సరం పుట్టికంటె ఎక్కువ తేలదు.

## శ్రీ జంగా వెంకటప్పరెడ్డిగారు,

లాం.

నా అభిప్రాయములో పొగాకునకు సక్రమ ధరల విషయములో మీరు పంపించియుండిన పుస్తకములోని, పట్టిక 1 లోని ధరలు యుండిన చాలాబాగుండునని విన్నవించుకొనుచున్నాను.

## శ్రీ కుక్కపల్లి వెంకయ్యగారు,

సబ్ కమిటి ప్రెసిడెంటు, వేలూరు.

వేలూరు గ్రామ పొగాకు వుత్పత్తిదారులు యీ క్రిందివారిని సబ్ కమిటీగ యేర్పరచి వారిద్వారా సేకరించిన వుత్పత్తిఖర్చులు యీ క్రింది వుదహరించుచున్నాము.

## సబ్ కమిటీ సభ్యులు

(1) షేక్ ఖాసింసాహెబు
(2) కుక్కపల్లి వెంకయ్య
(3) పావులూరి రాఘవులు
(4) పముడి మస్తాన్
(5) కరణం రంగారావు

ఈ సం॥రం ఎ 1 కి పొగాకు తోటకు ఖర్చులు :—

**హ్యారన్ వర్జీనియా**

యకరం 1 కి సాలుకు (47 సంవత్సరం)

| | |
|---|---|
| కౌలు | రు. 280 0 0 |
| వ్యవసాయం | 30 0 0 |
| ఎరువు | 50 0 0 |
| నారు | 70 0 0 |
| వేతకూలి | 10 0 0 |
| పడినారు | 12 0 0 |
| వేతకూలి | 5 0 0 |
| మలె పీకుడు | 5 0 0 |
| తోట పాలించినందుకు | 3 0 0 |
| పండాకు తీసినందుకు | 2 0 0 |
| కొమ్మ గిల్లినందుకు | 2 0 0 |
| ఆకునల్వా, అల్లకం | 40 0 0 |
| పురి | 15 0 0 |
| బొగ్గు | 40 0 0 |
| డ్రైవరు శాగుగ | 40 0 0 |
| కిరసనాయిల్ | 2 0 0 |
| పచ్చిఆకు తోలకం | 10 0 0 |
| కట్టలు (మండె) | 3 0 0 |
| గ్రేడింగు | 20 0 0 |
| బేళ్ళకట్టుబడి (పట్టలు)తోలకం | 4 8 0 |
| బొంగులు, తాటియాకు / బ్యాటరీసాదర్లు | 5 0 0 |
| | 648 8 0 |

**నాటు**

ఎ 1 కి సాలుకు (47)

| | |
|---|---|
| కౌలు | రు. 175 0 0 |
| వ్యవసాయం | 30 0 0 |
| ఎరువు | 45 0 0 |
| నారు | 20 0 0 |
| వేతకూలి | 10 0 0 |
| పశీమొక్కలవేత | 10 0 0 |
| మలె పీకుడు | 5 0 0 |
| కొమ్మకొట్టినందుకు | 1 0 0 |
| పిలకడబాలవోగా (3 సార్లు) | 9 0 0 |
| పురి | 10 0 0 |
| కోత కూర్చినందుకు | 10 0 0 |
| బొంగులు, కొస పందిరి / బాతుడు, తాడు వగైరా | 12 0 0 |
| ఎండిన తరువాత / పందిరి కోత మండె | 6 0 0 |
| మండెలు వేతకూలి నాల్గు / సార్లుకు | 2 0 0 |
| పెండెలు కట్టుబడి నులక | 4 0 0 |
| కంపెనీకి తోలకం | 3 0 0 |
| | 352 0 0 |

## శ్రీ గొల్లపూడి గంగయ్యగారు,

వైస్ ప్రెసిడెంటు, ఫుడ్ కమిటీ, నాగులుప్పలపాడు.

యీ నెల తే 22—12—1946 న సాధారణ సమావేశము జరిపి పొగాకు వుత్పత్తిలో అనగా వర్జీనియా పొగాకు వేయుటలో అయిన ఖర్చులున్నూ, రాబడియున్నూ, మరియు నాటుపొగాకు ఖర్చులున్నూ, రాబడియున్నూ, మీరు ప్రకటించిన ప్రచురణ నెం 8 రు పుస్తకము దాకలా ప్రకారము రైతు అభివృద్ధికి మిక్కిలి నిరోధకముకలిగించును. గాన, యీదిగువ మేము, య 1 కి పెట్టుబడి ఖర్చులు రుజువుచేయుచూ, న్యాయముగా, రైతుకు వుండవలసిన కనీస రేట్లు నాటుపొగాకులోను, వర్జీనియాలోను నిర్ణయించుకొని సదరు కమిటీచే యేకగ్రీవముగా ఆమోదింపబడిన, విషయములను తెలియపరచుకొనుచున్నాము.

1946 సం॥ వర్జీనియా : య 1 కి సగటున రైతు పెట్టిన ఖర్చులు.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| యెరువు | 55 | 0 | 0 | పందిరి వేయడమునకు | 15 | 0 | 0 |
| వ్యవసాయము, యెరువు చల్లకము | 55 | 0 | 0 | బొగ్గు, కట్టె | 50 | 0 | 0 |
| | | | | టోకర్సు | 12 | 0 | 0 |
| నారు ఖరీదు | 60 | 0 | 0 | బలుపులు | 8 | 0 | 0 |
| నాటు వేయడము | 20 | 0 | 0 | పురి | 4 | 0 | 0 |
| కలుపు పాలించడము మల్లెతీత | 30 | 0 | 0 | బ్యారక్ పెట్టుబడిగాని అద్దెగాని | 35 | 0 | 0 |
| ఆకునలత | 50 | 0 | 0 | వడ్డీ | 3 | 0 | 0 |
| ఆకుతోలకము బాడుగ | 10 | 0 | 0 | శిస్తు | 5 | 0 | 0 |
| గ్రేడుకూలి | 16 | 0 | 0 | మేనేజిమెంటు | 25 | 0 | 0 |
| పట్టలు, నులక | 5 | 0 | 0 | సాదరు | 10 | 0 | 0 |
| కంపెనీకితోలకము బాడుగ | 7 | 0 | 0 | వెరశి ఖర్చు | రు. 475 | 0 | 0 |

య 1 కి రైతుకు రాబడి సరుకు సగటున వౌ॥ 400 నులు మాత్రమే. అందులో నెంబరువారి సరుకు వివరము—

| గ్రేడు | దిగుబడి య 1కి | రేటు | ఖరీదు | | |
|---|---|---|---|---|---|
| న 1 | పౌ॥ 125 | 750/- | 187 | 8 | 0 |
| న 3 | 125 | 650/- | 162 | 0 | 0 |
| లైటుగ్రీను | 75 | 500/- | 75 | 0 | 0 |
| 6 నెంబరు | 75 | 350/- | 52 | 8 | 0 |
| మొద్దుపచ్చ | 50 | 250/- | 25 | 0 | 0 |
| గుల్ల | 35 | 150/- | 10 | 0 | 0 |
| చూర | 15 | 30/- | 1 | 8 | 0 |
| | పౌనులు 500 | వెరశి ఖరీదు | 513 | 8 | 0 |

పై రేట్ల ప్రకారము యిచ్చినను రాబడి రూ. 513 8 0 లో
అయిన ఖర్చులు మక్తాకాక రూ. 475 0 0 పోను
నిల్వ 38 8 0

యీ రు 38-8-0 మాత్రమే రయితుకుగాని భూస్వామి మక్తాకుగాని నిల్వ యుండును. కాన గమనించి రయితుకు శ్రమశక్తికి తగిన ఫలితము యిప్పించ గలందులకు కోరుచున్నాము.

నాటుపొగాకు : య 1 కి రయితు పెట్టు ఖర్చులు —

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| యెరువు | 80 | 0 | 0 | పందిరిదగ్గరనుంచి యెండు ఆకు తోలకము | 1 | 0 | 0 |
| యెరువు తోలకము | 15 | 0 | 0 | | | | |
| యెరువు చల్లకము | 2 | 0 | 0 | మండెలు తిరుగవేయుట | 10 | 0 | 0 |
| నారు ఖరీదు | 30 | 0 | 0 | పట్టలు, పురి | 4 | 0 | 0 |
| వేతకూలి | 20 | 0 | 0 | చెక్కులుకట్టుకూలి | 2 | 0 | 0 |
| వ్యవసాయఖర్చు | 40 | 0 | 0 | మార్కెటుకు తోలకము | 7 | 0 | 0 |
| కలుపుమల్లెకు | 15 | 0 | 0 | శిస్తు | 5 | 0 | 0 |
| కొమ్మకొట్టుట పిలకతీయుట | 12 | 0 | 0 | వడ్డి | 2 | 0 | 0 |
| కోతకూర్పు | 16 | 0 | 0 | మేనేజిమెంటు | 20 | 0 | 0 |
| పురి, పందిరి, బొంగులు | 17 | 0 | 0 | ట్రావెలింగు | 5 | 0 | 0 |
| పందిరిదగ్గరకు తోలకము | 3 | 0 | 0 | | | | |
| పందిరికోత మండెవేయుట | 3 | 0 | 0 | | 309 | 0 | 0 |

రాబడి పౌ॥ 750—850 లు దిగుబడి అవునుగాన కనీస రేటు పు 1 కి రు 300/- లు వుంటేనేకాని రయితు కోలుకొనడు. గాన పైన వ్రాయబడిన విషయమును సమగ్రముగా గ్రహించి ప్రజాప్రతినిధులైన మీరు యీ కనీస రేట్లను 1947 సం॥ రం॥ సీజనుకు అమలు పర్చవలెనని మేము విన్నవించుకొనడమైనది.

(శ్రీ) ముప్పాళ్ల వీరయ్యగారు,

పొగాకు మార్కెటు కమిటీ మాజీవైస్ చైర్మెన్, పొన్నెకల్లు.

ఈ సంవత్సరము రైతులు పొగతోటలకు నారు వగయిరాలకు ఖర్చులు చాలా ఎక్కువగా పెట్టినారు. బ్యారను వర్జీనియా పొగాకు కచ్చాగ్రేడు పుట్టి 1కి రు. 450 లున్నా, నాటు పుట్టి 1 కి రు. 200 లున్నా, ఎండువర్జీనియా పుట్టి 1 కి రు. 225 లున్నా కనీసధరలు నిర్ణయించిన ఎడల రయితులు పెట్టిన ఖర్చులు మాత్రము వచ్చుటకు వీలున్నది. అదియున్నా గాక గవర్నమెంటు కంపల్సరీ మార్కెటు ఏర్పాటుచేసి ఏగ్మార్కుగ్రేడులను రయితులచే చేయించి మార్కెటు యార్డులలో అమ్మునటుల మార్కెటు కమిటీవారు కృషిచేయవలసి యున్నది. స్థానిక గ్రేడుల కనీసధరలు యీ క్రింద నుదహరించినరీతిగా అమలునందు ఉంచుట ఉచితమని నాఅభిప్రాయము.

| స్థానిక గ్రేడు. | పుట్టి 1కి | స్థానిక గ్రేడు | పుట్టి 1 కి |
|---|---|---|---|
| నెం 1 రు | రు. 650 | డార్కుగ్రీను | రు. 200 |
| నెం 2 రు | 550 | నెం 6 రు | 100 |
| నెం 3 రు | 400 | ఎండువర్జీనియా | 225 |
| లైటుగ్రీను | 400 | నాటు | 200 |
| నెం 5 రు | 300 | | |

ఈ పై నుదహరించిన లోకల్ గ్రేడుల కనీసధరలు నిర్ణయించి పొగాకు రయితుల సహకారసంఘములను రిజిష్టరుచేసి రిడ్రైయింగు ప్లాంటును సహకార సంఘమునకు సప్లయిచేసి సహకారసంఘముల ద్వారా రయితులు పొగాకు అమ్ముకొనుటకు గవర్నమెంటు తోడుపడుట రయితులకు చాలా శ్రేయోదాయకమని నాతలంపు.

## శ్రీ దేవరపల్లి వీరారెడ్డిగారు,

ప్రెసిడెంటు, గ్రామపంచాయతీబోర్డు, ఇనమనమెళ్ళూరు.

ఈ సంవత్సరము (1946–47) కు నీటిబాధలవల్లను, ప్రపంచ ఆర్థికపరిస్థితి వల్లను కలిగిన మార్పులకుగాను గతసంవత్సరములతోపాటు వర్జీనియాపుగాకు యొక్క ధరలు నిలచియుండిన రయితులు ఎక్కువ నష్టపడుదురనిన్ని, ఈక్రింద కనుబరచిన కనీసధరలు వుండిననే రయితుకు క్షేమము గలుగుననిన్ని ఈక్రింది ఆదాయ వ్యయములను కనీసరేట్లతో చూపడమైనది.

కనీసం య 1 కి ఖర్చు

| | | |
|---|---|---|
| 1. | ఎరువు | రు 60 |
| 2. | వ్యవసాయము | 60 |
| 3. | నారు | 70 |
| 4. | నాటు | 20 |
| 5. | కలుపు | 30 |
| 6. | ఆకువలత, తోలకము | 75 |
| 7. | గ్రేడుకూలి | 20 |
| 8. | పట్టలు, నులక, పురి | 12 |
| 9. | బొగ్గు, కట్టె | 50 |
| 10. | స్టోకరు | 10 |
| 11. | బ్యారనుపెట్టుబడి (అద్దె) | 35 |
| 12. | శిస్తు | 6 |
| 13. | మేనేజిమెంటు | 20 |
| 14. | కర్రలు, పందిళ్ళు వగైరా | 60 |
| | మొత్తం రు. | 528 |

య 1 కి రైతుకు రాబడి

500 పౌనులకున్నూ ఈ క్రింది కనీస ధరల ప్రకారం వచ్చు ఆదాయము.

| గ్రేడు నెం. | పౌన్లు | రేటు | మొత్తం |
|---|---|---|---|
| 1, 2 | 100 | రు 900 | రు 180 |
| 3 | 100 | 700 | 140 |
| 4 | 75 | 500 | 75 |
| 6 | 100 | 400 | 80 |
| మొద్దుపచ్చ | 50 | 250 | 25 |
| గుల్ల | 75 | 200 | 30 |
| య 1 కి రాబడి మొత్తం | | | 530 |
| య 1 కి ఖర్చు మొత్తం | | | 528 |
| నిల్వ | | | రు 2 |

రయితు చెల్లించుచున్న మక్తాలు ఇందు చేర్చలేదు.

శ్రీ సూర్యదేవర రాఘవయ్యగారు,

పొగాకు మార్కెట్ కమిటీ మాజీసభ్యులు, నరుకుళ్ళపాడు.

ఈ సంవత్సరము రయితులు పొగతోటలకు, నారు వర్జైరాలకు ఖర్చులు చాలా యెక్కువగా పెట్టినారు. బ్యారనుక్యూరియో పొగాకు కచ్చాగ్రేడు పుట్టి 1 కి రు 525 లున్నూ, ఎండు వర్జీనియా పు 1 కి రు 250 లున్నూ కనీసధరలు నిర్ణయించగా వలయునని కోరుచున్నాను. ఈ సంవత్సరము యకరము 1 కి పుట్టి సరకుకంటె యెక్కువ తేలదు. కాన, ఈదిగువ నుదహరించిన కనీసధరలు నిర్ణయించ వలయునని కోరుచున్నాను.

| గ్రేడు నెం. | ధర | గ్రేడు | ధర |
|---|---|---|---|
| 1 | రు 675 0 0 | డార్కు గ్రీను నెం. 6 | 200 0 0 |
| 2 | 575 0 0 | ఎండువర్జీనియా | 250 0 0 |
| 3 | 425 0 0 | బేరను కచ్చాగ్రేడు | 525 0 0 |
| 4 | 425 0 0 | | |
| 5 | 300 0 0 | | |

ఈపైనుదహరించిన (లోకల్ గ్రేడులకు) కనీసధరలు నిర్ణయించి, పొగాకు రయితుల సహకారసంఘములు రిజిష్టరుచేయించి, రిడ్రైయింగుప్లాంటును సహకార సంఘములకు సప్లయిచేయించి, సహకారసంఘములద్వారా రయితులు పొగాకు అమ్ముకొనునట్లున్నూ, మార్కెటును కంపల్సరిచేయించుటకున్నూ, గవర్నమెంటు సహాయపడుదురని ఆశించుచున్నాను.

శ్రీ కొల్లా నారయ్యగారు, శ్రీ కె. వి. సుబ్బారావుగారు,

అ న ం త వ ర ం.

"పొగాకు స్క్రమ కనీసధరలు" అనే కరపత్రమును చూచినాము. తమరు, తమకమిటీవారు పొగాకుకు కనీసధరల నిర్ణయంకొరకుచేయు ప్రయత్నము చాలా ముదావహము. బాపట్లతాలూకా గ్రామములకు, నర్సరావుపేటతాలూకా గ్రామములకు పొగాకు ఉత్పత్తిలో చాలా తేడాలు ఉంటవి. ఏమంటే తూర్పుగ్రామాలలో

ఘ్యారనుపొగాకు నెం. 1 జాస్తిగా తేలును. కాని పడమర గ్రామాలలో నెం. 1 చాలాతక్కువ. 3, 4, 5 నెంబర్లు జాస్తిగాఅగును. కనుక మీరుయిచ్చిన ధరల మీద 2, 3 నెంబర్లకు పుట్టికి రు 75/- లు చొ॥ నున్నూ, లైట్‌గ్రీను, నెం. 5 లకు పుట్టి 1 కి రు 90/- లు చొ॥ నున్నూ ఎక్కువచేయుట ఈగ్రామ పరిస్థితినిబట్టి అవుసరమని మనవిచేయుచున్నాము. య 1 కి అన్నిఖర్చులు కౌవులుతోకలసి దాదాపు రు 600/- లు అగును. య 1కి అన్ని నెంబర్లుకలసి 500 పౌనులకంటె తేలదు. కనుక పైనచెప్పిన ప్రకారం ధరలు పెంచుట అవుసరము. నాటుపుగాకు విషయములో కనీసపుధర రు 180/- లు వుండుట అవుసరము.

శ్రీ ఘంటా గోపాలకృష్ణయ్యగారు,
పర్చూరు.

పుగాకు కనీస ధరలవిషయంలో మీరు వ్రాసిన విషయాలు చదివియున్నాను. సక్రమముగానేయున్నవి. ప్రస్తుత పరిస్థితులనుబట్టి రయితు పుగాకు పండించుటలో యెక్కువ వ్యయప్రయాసలు పడుచున్నాడు. కాని పుగాకుకు కనీసధరల రక్షణలేని కారణంచేత రయితు పుగాకు పండించటములో యెక్కువ నష్టపడుచున్నాడు. కాబట్టి రయితుకు సక్రమమైన ధర రావలెనంటే గవర్నమెంటువారు పుగాకుకు సక్రమ కనీస ధరలు నిర్ణయించడం అత్యవసరమనియూ, రైతాంగమునకు యెక్కువ మేలుచేసినవారగుదురనియు నా నమ్మకం. పుగాకు సక్రమ కనీస ధరల నిర్ణయం విషయములో పుగాకు మార్కెట్ కమిటీవారు చేయు కృషికి నేను అభినందించుతూ శ్రీ గవర్నమెంటువారివలన సదరు రేట్లకు ఆమోదముకు సత్వరముగాపొంద ప్రార్థించుతూయున్నాను.

శ్రీ వి. కోటిరెడ్డిగారు,
అంకిరెడ్డిపాలెం.

పొగాకులోకంలో పొగాకురయితు దుస్థితి విచారింపదగినదే. కమిటీ అడ్వైజరైన శ్రీ సి. వి. సర్వయ్యశ్రేష్ఠిగారు సక్రమ కనీసధరలు మొదలుగాగల విషయములన్నియూ స్పష్టముగాను, సక్రమముగాను తెలిపియున్నారు. పొగాకుకు కనీసధరలు నిర్ణయించువిషయమై మార్కెటింగు అడ్వైజరుగారు చెప్పినట్లుగా మనమనేక విధముల నాలోచింపవలయును.

మనదేశంలో రయితు పొగాకుమీద లాభంపొందాలంటే, పొగాకుపంట విస్తీర్ణము తగ్గించుట, సక్రమధరలుండుట, వ్యాపారమునందలి రహస్యములు తెలుసుకొనుట, రైతుల, వ్యాపారుల సహకారం మొదలుగాగల కారణములు.

ప్రస్తుత పరిస్థితిలో రయితుకుపండే పొగాకుపంటమీద అమ్మకము, రయితు పండించే పుగాకుపంటకయ్యే యావత్తుఖర్చులకు చాలదు. కాని పొగాకుపంటమీద రయితుకు చాలాప్రాంతాలలో నష్టము వచ్చుచున్నప్పటికి వేరుశనగ, మిర్చి, ధనియాలు మొదలగు యితరవ్యాపార పంటలమీదవచ్చు ఆదాయముచేత పొగాకు మీదవచ్చు నష్టమును పూడ్చుకొనుచున్నారు.

వినియోగదారుడుయిచ్చు వెలలో అధికభాగము రయితుకువచ్చునటుల చేయుటఅవసరము. కాన విదేశీయ ఫ్యాక్టరీలలోగాని, దేశీయ ఫ్యాక్టరీలలోగాని యింకా తదితర కంపెనీలలోగాని తయారుచేయబడుచున్న చుట్ట, బీడి, సిగరెట్లకును, దమ్ముచేసి అమ్మునట్టి పొగాకునకును సక్రమ కనీసధరలు నిర్ణయించి కంట్రోలుచేయుట ముఖ్యఅవసరము.

ఉదాహరణ : ఫ్యాక్టరీదార్లు, ఇతర కంపెనీదార్లు వారివారి కొనుగోలు, అందుమీద అయ్యే యావత్తుఖర్చులు, వారినుండి యితరవ్యాపారస్థులకు, ఆవ్యాపారస్థులనుండి వినియోగదారులకు యిచ్చువెలతో సరిపోల్చినయెడల యెంతయో తేడా కనుపట్టగలదు. అనగా ఫ్యాక్టరీదార్లకు, కంపెనీదార్లకు యెక్కువ లాభము రయితుకు, వినియోగదారులకు యెక్కువ నష్టము కలుగుట యున్నా సంభవించుచున్నది. దమ్ముచేసి డ్యూటీచెల్లించి అమ్మకొను లైసెన్సుదారు పుట్టి 1 కి రు 130/- లు చొ॥ కొనుగోలు చేసినాడనుకొందము. దానికి పుట్టి 1కి రు 93/- లు చిల్లరడ్యూటీక్రింద చెల్లించవలెను. ఇతరఖర్చులు తరుగులతోసహా షుమారు ఒక 50 రూపాయలు అనుకొందము. వడ్డీ, లాభము క్రింద పుట్టి 1కి ఒక 50 రూపాయలు అనుకొందము. అప్పుడు వానికి మొత్తము మీద పుట్టి 1కి షుమారు రూ. 325/- లు గిట్టుచున్నది. తాను చిల్లరగా అమ్ము నపుడు పౌను 1కి రూ. 2-9-0 లకు పైగాను, సవాశేరు 1కి రూ. 2/- లకు పైగాను అమ్ముచున్నాడు. అనగా అపుడు పుట్టి 1కి షుమారు రూ. 1280/- లు గిట్టుచున్నది. ఈ పై తేడాఅంతయూ వ్యాపారస్థునికి లాభముక్రింద మిగులుచున్నది.

శ్రీ సి. వి. సర్వయ్య శ్రేష్టిగారు వేరుశనగ పైరు సందర్భమున రయితునకు ఒకయకరము వేరుశనగపైరు ఖర్చుల జాబితాలు, యకరమునకు వేరుశనగ విత్తనముల కిమ్మతు రూ. 5/- అని తెలిపినారు. కాని అది పొరబాటు అని నా భావము. వేరుశనగ విత్తనములు ఒకయకరమునకు షుమారు రూ. 15/- లు అగును. అటులనే పొగనారుధరల విషయములోగూడా వారుచూపిన పట్టీలో తేడాయున్నది.

శ్రీ సి. వి. సర్వయ్య శ్రేష్టిగారు నివేదించిన ప్రకారము నాటుపొగాకు గ్రేడులనుబట్టి పుట్టి 1కి రూ. 200/- లు మొదలు రూ. 250/- ల వరకున్నూ బేరన్ వర్జీనియా, యెండు వర్జీనియాలకుగూడ ధరలుపెంచుట అవుసరమని నా భావము.

శ్రీ వుడుముల వెంకటసుబ్బారెడ్డిగారు,
కొత్తరెడ్డిపాలెం.

గుంటూరు పుగాకు మార్కెటు సబ్ కమిటీ సభ్యులు నిర్ణయించి నటువంటి పుగాకు కనీసధరలు కొంతవరకు రయితునకు గిట్టుబాటుగా వున్నవి. కాని యిది అమలు పరచినప్పుడు రయితునకు చాలా యిబ్బందులు కూడా వున్నవి. యీ యిబ్బందులు నివారించుటకు గుంటూరు పొగాకు మార్కెటింగు కమిటీ తప్ప వేరేగత్యంతరము లేదు.

దీనిని అమలుపరచుటవలన వచ్చేనష్టాలు: రయితు పుగాకును గ్రేడు చేసుకొని కంపెనీ ఆవరణములోనికి తీసుకవెళ్ళినప్పుడు కొనుగోలుదారుడు రయితు తెచ్చిన గ్రేడు సరియైనదికాదని పేచీపెట్టవచ్చును. అప్పుడు దానికి గాను మీారు గ్రేడు నిర్నయించుటకు ఒక యిన్స్పెక్టరును కంపెనీకి ఒకరిని వుంచవచ్చును. అట్లు ఒకగ్రేడు నిర్నయ యిన్స్పెక్టరును ఉంచినప్పుడు కొనుగోలుదారు ఇన్స్పెక్టరు ఒకటయి రయితును మోసముచేసి పెద్దగ్రేడును చిన్నగ్రేడుగా తీసుకొనవచ్చును. ఎందుకనగా కొనుగోలుదారువద్ద నుండి యీ ఇన్స్పెక్టరు లంచము తినవచ్చును. కొనుగోలుదారు యివ్వనూ వచ్చును. కాబట్టి అటువంటప్పుడు రయితు బాగా

దెబ్బతినగలడు. కాబట్టి పై విషయములను గుంటూరు పుగాకు మార్కెటు కమిటీ వారు బాగా విచారించి పై గ్రేడ్ల విషయములో రైతుకు కొనుగోలు దారుకు వచ్చే తగాదాలకు ఒక సబ్ కమిటీ వుంటే మంచిదని నావుద్దేశము. అదియెట్లనగా

1) మార్కెటింగు కమిటీవారు ఒకరు
2) పుగాకు పంట పండించు రైతు ఒకరు
3) వ్యాపారస్తులలో ఒకరు
4) సరుకు అమ్మె రైతు ఒకరు
5) సరుకు కొనువారు ఒకరు

మొత్తం యీ అయిదుగురి సమక్షములో గ్రేడు నిర్ణయించే పద్ధతిమీద జరిగితే రైతు నష్టపడడు. లేని యెడల రైతు చాలా నష్టపడగలడు. కాబట్టి గుంటూరు మార్కెటింగు కమిటీవారు బాగుగా దీనిని విచారించి ఒకసబ్ కమిటీని వేయించవలెనని నా వుద్దేశ్యము.

మార్కెటింగు సబ్ కమిటీవారు నిర్ణయించిన కనీసధరలను వ్యాపారస్తులు ఒప్పుకోక పోవచ్చును. అటువంటప్పుడు రైతు మార్కెటు యార్డులోకి పుగాకును తీసికొనివచ్చి అమ్మవలెను. లేక బేళ్ళుకట్టి ఇతర దేశములకు పంపి మార్కెటు కమిటీద్వారా అమ్మించుకొనవలెను. ఇప్పుడు గుంటూరు మార్కెటింగు కమిటీ వారికి రీడ్రయింగు మిషనయినా లేదు. కాగా రైతుకు తన పొగాకును ఇతర దేశములలో అమ్మిపెట్టుటకు దాదాపు ఒక సంవత్సరం పట్టును. అంతవరకు రైతు పండించిన పంట మార్కెటుకుపంపి ఊరుకొన్న రైతు ఖర్చులు తట్టుకొనుట చాల కష్టము. కాబట్టి రయితు తన పొగాకును మార్కెటులోనికి తీసికొని వచ్చినప్పుడు రయితుకు కొంత అడ్వాన్సు యివ్వవలెను. యిప్పుడు మార్కెటు కమిటీవారి వద్ద యీ అడ్వాన్సులు ఇచ్చుటకు చాలినంత డబ్బులేదు. కాబట్టి గవర్నమెంటువారి వద్దనుండి కొంతతీసుకొనుట. తరువాత బ్యాంకులలో సరుకు భీమాచేసి తీసికొనుటో లేక రయితులకు కూడా బ్యారన్లకు ఒక బ్యారనుకు ఇంతని పన్ను విధించుటో లేక కోఆపరేటివు సొసయిటీలు పెట్టి కొంతఫండు వసూలుచేసి దానితోగాని యేవిధంగా నయినను రైతు మార్కెటులోకి తెచ్చిన పొగాకు అమ్మి

నంతవరకు కొంత అడ్వాన్సు ఇవ్వవలెను. లేని యెడల సబ్ కమిటీవారు నిర్ణయించిన పై కనీసధరలకు రైతులు బాగా నష్టపడగలరు. కాబట్టి పై విషయములన్నియు విచారించగోరెదను.

శ్రీ కె. రామకృష్ణమూర్తిగారు, బి.కాం. (ఆనర్సు),
పొగాకు మార్కెట్ కమిటీ మాజీసభ్యుడు, గుంటూరు.

అపరాలు, మిర్చి, ధనియాలు, వేరుశనగ మాదిరిగాక పొగాకు, అందులో ముఖ్యముగా బేరన్ క్యూరుచేసిన వర్జీనియా ఒక విచిత్రమైన పంట. ఇందు అనేక సమస్య లుత్పన్నమగును. అందుచే త్వరపడక, జాగరూకతతోను, ఓపికతోను పర్యాలోచించవలసియున్నది.

బేరన్ పొగాకు రోజులు జరిగినకొలది రంగుమారుటయున్నది. సక్రమముగ ఆకుదలలేని పొగాకునందును, రిడ్రయిగాని పొగాకునందును రకము తగ్గుదలకు ఎక్కువ అవకాశమున్నది కనుక పొగాకుచెక్కుల విషయమున ధర కొనుగోలుచేయు రోజున రంగునుబట్టి యుండునుకాని పూర్వము హెచ్చుగ్రేడుగనున్నను, జాగ్రత్తగ చూచికొనవలసియున్నది. ఆకుదలచేసిగాని, రిడ్రయిచేసిగాని కట్టి సర్టిఫై చేసిన బేళ్ళకు కొనుగోలులో ఎక్కువ జాగరూకత పరిశీలన అవసరము లేదు. గ్రేడులు హెచ్చినకొలది పొగాకు ఒకేరంగులో నుండుటకు ఎక్కువ అవకాశముండును. ఎగ్మార్కు గ్రేడుల విషయములోనె ఒక వర్తకుని గ్రేడ్సుకు, ఇంకొక వర్తకునిగ్రేడ్సుకు వ్యత్యాస ముండుచున్నది. కొలదిగ్రేడులగు స్థానిక గ్రేడ్సులో ఎక్కువ వ్యత్యాసముండుటకు అవకాశమున్నది. ఒక స్థానికగ్రేడు కొన్ని ఎగ్మార్కు గ్రేడుల సంకరముగాబట్టి ఆ ఎగ్మార్కు గ్రేడుల ఆకుపరిమితులనుబట్టి స్థానికగ్రేడ్సులో ఒకేగ్రేడులో హెచ్చువ్యత్యాసముండుటకు వీలున్నది. ఈపరిస్థితులలో ప్రతిసారి రయితుకు వర్తకునకి అభిప్రాయభేదము వచ్చుటకు, మార్కెటుకమిటీ ఉద్యోగిసలహాను పాటించకుండా బేరమువదులుటకు ఎక్కువ అవకాశమున్నది. ప్రస్తుతము ఎగ్మార్కుగ్రేడ్సు వర్తకులకు ప్రమాణము లైసెవిధాన మార్కెటుకమిటీకూడ వాటినే పాటించుటయు, రయితులచే ఆవిధముగ గ్రేడుచేయించుటయు, ఎగ్మార్కుడిపార్టుమెంటువారి సాయముతో రయితు

అమ్మదలచిన ఒకవారముముందు సర్టిఫై చేయించుకొనుటయు, సర్టిఫైయైన ఒక నెలరోజులలోపు అమ్ముకొనుటయు జరుగవలెను. నెలరోజులలో అమ్ముకొనకున్న మరల సర్టిఫై చేయించవలెను. గ్రేడుసువిషయములో ఎగ్మార్కు డిపార్టుమెంటు వారి నిర్ణయములేనిది ఇతరుల నిర్ణయమునకు వర్తకులంత ప్రాధాన్యమివ్వరు.

కనీసధరలను నిర్ణయించుటలో సక్రమధరలకు కనీసపుధరల కుండవలసిన వ్యత్యాసమును, ఉత్పత్తిఖర్చులను గమనించుట మంచిదియె. కాని సక్రమధరల విషయములో నాలుగైదు వత్సరముల, వర్తకుల మార్కెటుధరల సగటు తీసికొనవలెనేకాని ఏదోయొక కాటకపు వత్సరధరల తీసికొనగూడదు. అట్లుతీసుకొనుట బ్లాకుమార్కెటులోని ధరనుబట్టి నిర్ణయించుటవంటిది. శాంతికాలములో పెక్కుదేశములు పొగాకు ఉత్పత్తికి, వాణిజ్యమునకు పోటీచేయును. హిందూదేశము ఇట్టి పోటీలో నెగ్గవలసియున్నది. కనుక కనీసపు ధరలు మనదేశములో ఎక్కువగ నుంచినంతమాత్రమున రయితుకు ప్రయోజనముండదు. ఆధరలకు విదేశవ్యాపారము జరుగుచుండిననె ఎక్కువ ప్రయోజనము.

ఈపుస్తకములో తెలుపబడిన ధరలు 1946 వ సంవత్సరములోనివి. ఇవి యుద్ధకారణమువలన ఏర్పడిన ధరలనియు, ఇంతటిధరలు యింతకు పూర్వము లేవనియు, మూడునాలుగు వత్సరముల ధరల సగటును తీసికొనుట యుత్తమమని గ్రహింపవలెను. ఇట్టి సక్రమధరలకు, కనీసధరలకు తగు వ్యత్యాసముండవలెను. పోత్రములోని నిర్ణయ మేమాత్రమును సమంజసమైనది కాదు.

ఉత్పత్తివిషయములో రైతులందరు కవులుభూములలో పండించుచున్నట్లుగ తెలుపబడియున్నది. భూమికి హెచ్చుప్రాధాన్యమిచ్చి కవులు పెంచబడినది. ఇతర పంటల విషయములోను ఇంతకవులులేదు. సగటు కవుళ్ళు ఇంతలేవనికూడ సాక్ష్యముతో ఋజువుచేయగలను.

పొగాకువిషయములో కవుళ్ళు పొలమునుదున్ని బాగుచేసి నాటుటకు వీలుగ చేసియిచ్చెదరు. ఉత్పత్తిఖర్చులు వేయుటలో కవుళ్ళను హెచ్చుగ వేయటమేకాక అనవసరముగ దున్నటం, గొర్రుతోలటం, ఎరువులు మొదలగు ఖర్చులు

చేర్చబడినవి. ఇవన్నియు ఉత్పత్తిఖర్చులు హెచ్చుచేసి చూపెట్టుటకు తయారు చేసినట్లు కన్పడుచున్నదేగాని మామూలుగఅగు ఖర్చులుకావు.

పొగాకు గ్రేడుచేయుటలోవచ్చు శాతములు ఏఆధారముపై తీసికొనబడినవో తెలియదు. ఇవికొంత తప్పుగనున్నవి.

ఇంకను అనేకవిధముల పొత్తములోని విషయములు దోషభూయిష్టములుగ నున్నవి. పొగాకుధరలలో ప్రతిగ్రేడుకు వ్యత్యాసగ్రేడ్లనుబట్టి కొంత రేంజియుండుట పరిపాటిగనున్నది. ప్రస్తుత విదేశవ్యాపారములో ఇదిచక్కగ చూడనగును. రయితువద్దనుండి కొనుటకు నిర్ణయింపవలసిన కనీసధరలు, ప్రతిగ్రేడుధర వ్యత్యాసములకు కొంతదూరమున యుండవలెను.

పొత్తములో సూచింపబడిన విధానము, కమిటీవారి స్థానికగ్రేడ్లనుబట్టి జరుపుట ఆచరణీయము కాదనియు, అది రయితుకు, విదేశ వాణిజ్యమునకు ఏమాత్రపు మేలుకూడ చేయకపోగా అపకారము చేయవచ్చుననియు మనవి చేయుచున్నాను.

శ్రీ పెద్ది చిన్న జానకిరామయ్యగారు,

పాలపర్రు.

మీరు కనీసధలపై ప్రకటించిన కరపత్రము, పుస్తకము చూచినాను. కనీస ధరలు నిర్ణయించడం చాలా అవుసరం. అయితే కనీసధరలు యీక్రింది విధముగా పెంచమని నాసూచన.

| స్థానిక గ్రేడ్లు. | రేట్లు | స్థానికగ్రేడ్లు. | రేట్లు |
|---|---|---|---|
| 1 వ నెం. | రూ. 600 | డి. జి. | రు. 150 |
| 2 వ నెం. | 500 | 6 వ నెం. | 50 |
| 3 వ నెం. | 450 | ఎండు వర్జీనియా | 170 |
| 4 వ నెం. | 350 | నాటు | 170 |
| 5 వ నెం. | 225 | | |

## శ్రీ గట్టుపల్లి ఆంజనేయులుగారు,

### గుంటూరు.

ఉత్పత్తిదారుడు పెట్టిన ప్రతిఖర్చునూ, చేసిన శ్రమనూ దృష్టిలో ఉంచుకొని చేసిన యెడల ధరల నిర్ణయం యేవస్తువుకైనా రయితుల రక్షణ విషయంలో మంచిదే. గరిష్ఠధరల నిర్ణయం వినియోగదారునకు ఉపయోగపడినట్లుగానే కనీసధరల నిర్ణయం ఉత్పత్తిదారునకు ఉపయోగపడుతుంది.

పొగాకుకు కనీసధరలు నిర్ణయించే విషయంలో గుంటూరు టుబాకో మార్కెటు కమిటీవారు తలపెట్టిన కార్యక్రమం అభినందనీయమైనది. సమీప భవిష్యత్తులో తప్పనిసరిగా దేశ ఆర్థిక జీవనాన్ని తలక్రిందులుచేసే ఆర్థిక సంక్షోభ దశలో రయితులు బలికాకుండా ఉండాలంటే యీకృషిని ప్రభుత్వం ఆమోదించి అమలు జరుపవలసిన అవసరం ఉందని భావిస్తున్నాను.

ఈ సందర్భంలో కమిటీవారు ప్రచురించిన పుస్తకంలో, కావలసిన విషయాలన్నీ విశదీకరింపబడినవి. వర్తకుల పరిస్థితులు కూడా చక్కగా ఆలోచించబడి, వారి న్యాయమైన లాభము కూడా చూపించబడినది. ఈపుస్తకంలో చూపబడిన ధరల నిర్ణయ విధానాన్ని న్యాయబుద్ధిగల ప్రతివర్తకూడూ ఆమోదిస్తాడు.

పొగాకులో అనేకగ్రేడ్లు ఉన్నవనీ, గ్రేడ్ల స్థిర నిర్ణయం జరుగనిదే ధరల నిర్ణయం జరుగరాదనీ వర్తకులు యీవిషయంలో వ్యతిరేక వాదనచేయవచ్చు. పొగాకు వర్తకుడుగా నాఅభిప్రాయంలో ఈ వాదన అర్థంలేనిది.

ప్రస్తుతం పొగాకుకు గ్రేడ్లు లేకుండానే ఉభయులకూ యిష్టమైన ధరలతో కొనుగోలు, అమ్మకం జరుగుతున్నది.

ఇకముందు ధరలలో యిష్టమనేది ఉండదు. ఉభయుల యిష్టం గ్రేడు విషయంలోనే.

ఇంతకుముందు రయితు, వర్తకుడూ ధరను నిర్ణయించుకున్నట్లుగా ఇకముందు గ్రేడు విషయం నిర్ణయించుకుంటారు.

ఇంతకుముందు ధర యిష్టంలేక పోయింది. యికముందు గ్రేడు యిష్టంలేక పోతుంది.

మెస్సర్స్ చింతక్రింది కనకయ్య అండ్ కంపెనీ,

మంగళగిరి.

పొగాకుకు కనీస ధరల నిర్ణయం సందర్భంలో, అలాంటిచర్యకు యీ క్రింది కారణాలవల్ల మేము యెంతమాత్రము ఆమోదింపజాలము.

1. యితరవస్తువుల విషంలోలాగా పొగాకుకు మార్కెట్ పరిస్థితులు స్థిమితపడలేదు. అందువల్ల పొగాకుయొక్క ధరలను యెంతమాత్రము ఊహించటానికి వీలులేదు.

2. మన మార్కెట్ పూర్తిగా యెగుమతి మార్కెట్ కావటంవల్ల ధరలు విదేశ మార్కెట్ ధరలమీద ఆధారపడి ఉంటవి. యితరదేశ మార్కెట్లలో మనకంటె మంచి పొగాకు సప్లైచేసే అవకాశాలు, పోటీదార్లు ఉండటంవల్ల మాకు ఉన్న అనుభవాన్నిబట్టి మనమార్కెటు యితరమార్కెట్లను యేమాత్రంమార్చలేదు.

3. ఏరకమైన ధరలునిర్ణయించి, అమలుపరచవలెనన్నా, ముందుగా గ్రేడ్లు నిర్ణయింపబడాలి. ప్రస్తుతం అమలులోవున్న ఆగ్‌మార్కు సర్టిఫికేట్లను విదేశ దిగుమతిదార్లు అంతగా ఆదరించటంలేదు. దిగుమతిదార్లు సరుకుచూచుకొని ధరను నిర్ణయం చేస్తారు. అందుకని ప్రస్తుతంవున్న గ్రేడ్లలో ధరలు నిర్ణయించటం సాధ్యంకాదు.

4. ఇప్పుడు పొగాకుకు వస్తున్నధరలు యుద్ధకాలపు అధిక ధరలు కాబట్టి కనీసధరలను నిర్ణయించటానికి యిది సరియైన సమయముకాదు. ఇప్పటి పరిస్థితి గడిచిపోయినతర్వాతనే అలాంటిచర్యను గురించి ఆలోచించటానికి వీలుకలుగుతుంది.

మెస్సర్స్. టి. వెంకటక్రిష్ణయ్య అండ్ కో.,

పొగాకు వ్యాపారులు, మంగళగిరి.

మీ పుగాకు కనీసధరల నిర్ణయపు వ్యాపారస్థుల ప్రశ్నావళికి నా సమాధానము :

9 వ ప్రశ్న:— ఇది చాల క్లిష్టమైన సమస్య. 3, 4 సంవత్సరములనుండి నిల్వవున్న బ్యారను పుగాకును మెస్సర్స్ సాలమన్ బ్రదర్సు, రష్యన్ కొనుగోలు దార్లకు ఏ కొద్దిమంది వ్యాపారస్తులో అమ్మి మంచి లాభములు గణించినందువల్ల

నున్నా, ఈ సంవత్సరము రాబోయే పుగాకుకుగాను రైతులు అర్థములేకుండ ఎక్కువ కొలుకు భూమిని తీసుకొని వర్షములవల్ల రెండుమూడు పర్యాయములు నాటు వేయవలసి వచ్చినందున ఎక్కువ గిట్టింపు అవుతుంది అనే తాత్పర్యముతో పుట్టి 1కి రు 100/-, రు 150/-లు ఒక్కసారిగా పెంచడమనేది అంతభావ్యముగాలేదు. ఎందువల్లననగా ఈరోజున మాకు పైనుంచివచ్చిన రిపోర్టులవల్ల అమెరికాలోపండిన పంట యుద్ధము ఆగిపోయినందువల్ల ధారాళముగా దొరుకుననియు దీనికితోడు నాణ్యములోగూడ, మనదేశముకంటె రొడీసియా, నియాసాలాండ్ ప్రాంతములలో పండే పుగాకు ఎక్కువ అన్నియు తెలియజేసినారు. ధరలు ఒకేసారి పెంచినందువల్ల ఎగుమతిదార్లకు గిట్టుబాటు కానియెడల, కొందరు నష్టపడుటకంటె కొనుట మానివేయవలసివచ్చే పరిస్థితికూడ సంభవించవచ్చు. గనుక అన్నిగ్రేడులకు పుట్టి 1 కి ఈ సంవత్సరము రు 50/-ల వరకు పెంచితే బహుకాలమునుంచి ఇతరదేశములతో జరుగుచున్న వ్యాపారం చెడిపోకుండ జరుపుటకు అవకాశం వుంటుంది.

## ఎట్లు ఆచరణలో పెట్టవలసినది.

ధరలు ఎక్కువ రాబట్టవలెనని రైతుకు వుద్దేశము ఉన్నయడల, అతను ఈదిగువ చెప్పినట్లు చేసినయడల, తప్పక ఎక్కువడబ్బు రావచ్చును.

1, పాకానికివచ్చిన ఆకుమాత్రము విరుచుట

2. ఒకరోజు నిల్వయుంచకుండ, విరిచి తెచ్చిన ఆకును బాగుగ గ్రేడుచేసి, బ్యారనుకు ఎక్కించుట.

3. బ్యారను దిగిన పిమ్మటనే కొంచెము శ్రద్ధగా మొద్దుపచ్చ, గుల్ల తీసివేయుట. (ఇట్టి గ్రేడింగువల్ల పుట్టి 1 కి ½ మణుగు లోపుగానే తగుగువుంటుంది. ఈ కచ్చా వుండుటవల్ల పుట్టి 1 కి రు 20/-, 25/- లు తక్కువ అమ్మవలసి వచ్చుచున్నది.

4. పుగాకు పెండెలు వేయునప్పుడు స్ప్రే చేయకుండాను, బాగా ఎండ ఎక్కిన తరువాత అనగా పగలు షుమారు గ 10-11 లకు పెండె కట్టుట.

8 వ ప్రశ్న – అగ్మార్కు శాతము. బ్యారన్ వర్జీనియా :

9 వ ప్రశ్నమాదిరి ఇదికూడ కఠినమైన ప్రశ్న. ఉభయ గోదావరిజిల్లాల సరుకు క్రిష్ణా గుంటూరుకంటె శ్రేష్ఠమైనది. నిజాంరాష్ట్రములో ఉత్పత్తి అయ్యే పుగాకు చాల శ్రేష్టమైనది. మేము సాధారణముగ నెం 1–నుండి 4 గ్రేడులవరకు కొన్న సరుకులలో మంచిపెండెలుగా చూచి పనిచేయుట వాడుకలో యున్నది. విశేషముగ మేము ఒక బ్యారనులో 7, 8 క్యూరింగులలో వచ్చిన పుగాకు మాత్రమే ఖరీదు చేయుదుము. అందులో అగ్మార్కు శాతములు నెం. 1/– 8% నెం. 2–15% నెం. 3–25% నెం. 4–40% మిగతా 12% తతిమ్మా తక్కువ గ్రేడులో కలసివుండును. పై ఆకు క్యూరింగ్‌లో వచ్చేది అంతా ఈ తక్కువగ్రేడు సరుకు. ఇది ఎంతవచ్చేది మేము పరీక్షగా చూడలేదు.

ఎండు వర్జీనియా: అగ్మార్కు నెం. 2–30% నెం. 3–50% యితరములు 20%.

నాటుపుగాకు: అగ్మార్కు నెం 2–15% నెం. 3–75% యితరములు 10% నాటుపుగాకు అగ్మార్కు గ్రేడు 5 అనేది చాలా నలుపు. దీనిశాతము 95% యితరములు 50%.

శ్రీ పి. అంకమ్మ గారు,

మెస్సర్సు ఎ. ప్రత్తిపాటి అండ్ కో.,

కమిటీచేసిన తీర్మానము, (పొగాకు కనీసధరల విషయమై) అందుకు సంబంధించిన పుస్తకాన్ని చదివాను. వ్యాపార సక్రమలాభాన్ని వదలి రయితుకి గిట్టుబాటయ్యే కనీసధరలను నిర్ణయించడం చాలా సబబైన విషయము. కమిటీ ప్రకటించిన ధరలు మదింపు నాఅనుభవములో సక్రమముగానే తోస్తూవున్నవి. కాబట్టి వ్యాపారులంతా ఏకమై గుత్తవ్యాపారమునుండి రక్షణపొందుతూ విదేశ ఎగుమతులలో కేంద్రప్రభుత్వం సాయపడునట్లు చేసుకొనవలసియుంటుంది. ఇందుకు కమిటీకూడా పూర్తిగా సహకారము యివ్వాలి. యీకృషి జయప్రదమగునని ఆశించుతూ యున్నాను.

## శ్రీ గాదె వెంకటసుబ్బారావుగారు,

పొగాకు ఉత్పత్తిదారు అండ్ వ్యాపారి, పరుచూరు.

ది. 27-11-46 న మార్కెటు కమిటీ నిర్ణయించిన గ్రేడువారి రేట్లు సక్రమమైనవిగా, లెక్కప్రకారము, అనుభవపూర్వకముగాకూడ నమ్ముచున్నాను. ప్రస్తుత ఆర్థిక దుస్థితి రోజులలో పొగాకు రైతుకు న్యాయము కలుగవలెనన్న, లేక పొగాకురైతు ఆర్థికముగా నష్టపడకుండా చేయుటకు, పై కనీస ధరలు నిర్ణయించబడి అమలులోనికి వచ్చునట్లు చేయవలయును.

అట్లు రేట్లు నిర్ణయించునప్పుడు ముఖ్యముగా ప్లాటుఫారం కొనుగోలు దార్లకు, పండించిన రైతులకు గ్రేడువిషయములో అభిప్రాయభేదములు కలిగి, కొనుగోలుదార్లు మార్కెటును మందపరచుటకు ప్రయత్నించిన యెడల సొసైటీల ద్వారా రైతులకు కొలదిపాటి ధనసహాయముచేసి రైతు పండించు యావత్తు సరకుపై సొసైటీలే అమ్మటకు యత్నముచేయవలయును. సొసైటీలకు ప్రెస్సింగు మిషను, రిడ్రయింగుమిషను సప్లయిచేయవలయును. ప్రొవిన్షియల్, సెంట్రల్ గవర్నమెంటు డిపార్టుమెంటులు, కొత్తమార్కెట్లను, ఉన్నమార్కెట్లను, సొసైటీలకు వినియోగించుటకు అవకాశము కలుగు జేయవలయును. మార్కెటింగు యార్డులలో యింకను గోడవునులను అధికము చేయవలయును.

## మెస్సర్సు. టి. శ్రీరాములు, యస్. పకీరయ్య అండ్ కంపెనీ,

మంగళగిరి.

పొగాకుకు సక్రమ ధరలను నిర్ణయించే సందర్భంలో, గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీవారి సదుద్దేశాలను యీ కంపెనీవారు అభినందిస్తున్నారు. కాని పొగాకును సరిగా రైతులు గ్రేడుచేయలేని ప్రస్తుత పరిస్థితులలో, రైతుల పొగాకుకు కనీసధరలు నిర్ణయించటం సాధ్యంకాదని మా అభిప్రాయము. యింతకంటే, కమిటీవారు విదేశమార్కెట్లతో నిరంతర సంబధం పెట్టుకొని, ఆయా చోట్ల వివిధగ్రేడ్లకుగల ధరలు మొ॥ విశేషాలను రైతులకూ వర్తకులకూ అందించి

తోడ్పడగలిగితే చాలా మంచిది. అలాచేసినట్లయితే రైతులు వీలైనంత యెక్కువ ధరలనే కోరటానికీ, వర్తకులు తమలో తమకున్న పోటీవల్ల గరిష్ఠ ధరలను యివ్వటానికీ అవకాశం కలుగుతుంది.

పొగాకు ఉత్పత్తిదార్లకు, తమకు అనుకూలమైన ధరలు వచ్చేవరకు సరుకు నిల్వచేసుకునేందుకు శక్తిని కలిగించటానికై ప్రభుత్వంవారు అప్పుసౌకర్యాలు కలిగించాలనీ, పొగాకు ఉత్పత్తిదార్ల సహకారసంఘాలను రిజిష్టరు చేయాలనీ కోరుతూ కమిటీచేసిన తీర్మానాన్ని మేము బలపరుస్తున్నాము.

ఈ పుస్తకంలోని విషయములు అందరికీ, ముఖ్యంగా మనదేశపొగాకుకు కేంద్రమైన గుంటూరు ప్రాంతంలోని వారందరిదృష్టికీ తీసుకురాబడుతుందనీ, యీ విషయంలో తగిన చర్యలు తీసుకోబడాలనీ వాంఛిస్తున్నాము.

శ్రీ డి. రామారావు గారు,

సెక్రటరీ, ఇండియన్ టుబాకో యెసోసియేషన్, గుంటూరు.

ధరలు ఆసాంతానికి విదేశమార్కెట్లమీద ఆధారపడటమనే ప్రధానకారణముచేత ఈ అసోసియేషన్ పొగాకుకు కనీసధరల నిర్ణయం యేమాత్రం ఆచరణయోగ్యంకాదని భావిస్తున్నది. పొగాకు ఉత్పత్తిదార్లు, యెగుమతి వ్యాపారులు ఇతరదేశాలతో పోటీచేసేస్థితిలో ఉంటేనే తప్పలేకపోతే ఆయా మార్కెట్లను పోగొట్టుకుంటారు. మాకు ఇంతవరకు వచ్చిన అనేక రిపోర్టులను బట్టి ఇంగ్లండు మనదేశ పొగాకుకు పోయిన సంవత్సరం ఇచ్చిన ధరలకంటె యెక్కువయిచ్చే అవకాశాలులేవని తెలుస్తున్నది. అందువల్ల దిగుమతిచేసుకునే యితరదేశాలలోని మార్కెటు పరిస్థితులను ఆలోచించకుండా ఇక్కడి పొగాకుకు కనీసధరలను నిర్ణయించడంలో యేమాత్రం అర్థం ఉన్నట్లు మాకుకనిపించడంలేదు.

# స్థానిక సంస్థల తీర్మానాలు

## గ్రామ ఆహార కమిటి, జొన్నలగడ్డ.

అధ్యక్షుడు:: ఆళ్ల పానకాలు రెడ్డిగారు.

తీర్మానము : "ఈ సంవత్సరము పొగాకు పైరువేయుట మొదలగు ఖర్చులు ఆసామికి ఒక యకరమునకు సగటున రు 512-8-0 చొప్పున అగును. పంట యీ సంవత్సరము ఒక యకరమునకు ఒక పుట్టికన్నా ఎక్కువ అగు సూచన కన్పించుటలేదు. కాన బారను వర్జీనియా కచ్చా గ్రేడు పుట్టి 1 కి రు 500/- యున్నా నాటు పొగాకు పుట్టి 1 కి రు 250/- లున్నా, ఎండు వర్జీనియా పుట్టి 1 కి 250/- లున్నా కనీస ధరలు ఉండునట్లుగా గవర్నమెంటు నిర్ణయించవలయును".

## గ్రామ పంచాయితీ బోర్డు, నరుకుళ్ళపాడు.

అధ్యక్షుడు:- శ్రీ కొత్త వెంకటసుబ్బయ్యగారు.

తీర్మానము:- ఈ సం॥ వర్జీనియా పొగాకు తోటలు అతివృష్టివల్ల నశించిపోగా రెండవసారి వేసినందువలననూ, కూలి మజూరీ రేట్లు ఎక్కువగా నుండుటచేతను య 1 కి రు 150-0-0 ఖర్చులు అయినవి. అయినప్పటికీ దైవికమువల్లను తెవులు వల్లను, తోటలు బాహాటముగా లేనందువల్లను సరుకు దిగుబడి ఎక్కువ అయ్యే టట్లు కనిపించటంలేదు. ఈ నష్టములన్నిటిని పూడ్చుటకు ధరలు యీ క్రిందివిధముగా నిర్ణయించవలసినదిగా శ్రీ గవర్నమెంటువారిని కోరుచున్నాము.

| గ్రేడు నం. | ధర |
|---|---|
| 1 | రు 600/- |
| 2 | రు 500/- |
| ఎండు వర్జీనియా | రు 300/- |
| నాటుపొగాకు | రు 250/- |

### గ్రామ ఆహార కమిటీ, బొడ్డువానిపాలెం.

అధ్యక్షుడు :- శ్రీ గండవరపు సుబ్బారావుగారు.

తీర్మానము :- "రైతులు వుత్పత్తిచేసే పొగాకుకు కనీసపురేట్లు నిర్ణయించి ప్రభుత్వము త్వరలో అమలుపరచినట్లైతే రైతు తన శ్రమశక్తికి రావలసిన విలువ పొందగలడు. కనీసపురేటు నాటుపొగాకుకు పుట్టి 1కి రు 200—0—0 లకు తక్కువ లేకుండా వుండవలయునని కోరడమైనది".

### పొగాకు వుత్పత్తిదారుల సంఘం, మేదరమెట్ల.

తీర్మానము :- "రైతుయొక్క వుత్పత్తి ఖర్చులు నానురాను ఎక్కువఅగుటవల్లను, భూమి విలువలు యః 1కి రు 800 లు మొదలు రు 3000 లు వరకు, నాలుగురెట్లు హెచ్చుఅయినందువల్లను, పశువుల రేట్లు పెరిగినందునల్లను, పాలిగాండ్ల వేతనములు హెచ్చు అగుటవల్లను, రైతు ఆర్థికదుస్థితి క్రమేపి జారిపోవుచున్నాడు. కాన రయితుయొక్క శ్రమవిలువను తెలుసుకొని పుట్టి 1కి రు 225—0—0 లకు తక్కువలేకుండా వుండవలయునని తీర్మానించటమైనది".

### పొగాకు తూకపు కమిటి, పమిడిపాడు.

అధ్యక్షుడు:- శ్రీ పిన్నక అంకమ్మగారు.

తీర్మానము :- "పొగాకు పండించే రైతులకు సరియైనటువంటి ధరలు సగటున వర్జీనియా పుట్టి 1 కి రు 600-0-0 లున్నూ, నాటుపొగాకు ధర పుట్టి 1 కి కనీసము రు 200-0-0 లున్నూ నిర్ణయించ వలయును. ఎక్సైజు చట్టాన్ని రద్దుచేయించవలెను. యీ సంవత్సరం వర్షములు ఎక్కువగా కురిసినందునల్ల పైరులు నష్టమైనవి గాన పై ధరలు నిర్ణయించవలెను".

## ఆహార కమిటి, మల్కాపురం.

అధ్యక్షుడు :- శ్రీ గద్దె వెంకటేశ్వరరావుగారు.

తీర్మానము :- "ఉత్పత్తి ఖర్చులు యకరం 1కి సగటున :-

| | |
|---|---|
| కవులు | రు 250 |
| సాగుకూలి | ,, 50 |
| నాటు | ,, 100 |
| పేత, రైలు ఖర్చులు, బాడుగ, నారుపీకుడు కూలి, సాదరు | ,, 25 |
| కలుపుతీత, మట్లె, గుంటలువగైరా | ,, 15 |
| ఆకువిరుపు, బ్యారనుకు తోలకం | ,, 42 |
| బొగ్గు, కఱ్ఱ | ,, 45 |
| పాకలు, పందిళ్లు | ,, 5 |
| బ్యారను అద్దె | ,, 30 |
| గ్రేడింగు | ,, 15 |
| క్యూరింగు ఖర్చు | ,, 35 |
| పురికొస | ,, 10 |
| పట్టలు, తీగె, యితరఖర్చులు, బాటరీలు | ,, 15 |
| మామూళ్లు, సాదరు మొత్తం | ,, 15 |
| మొత్తం | రు 652 |

పొగాకు మార్కెటు సబ్ కమిటీవారు నిర్ణయించిన స్థానిక గ్రేడ్ల సక్రమ కనీస ధరలు, వుత్పత్తి ఖర్చులకుగూడ సరిసమానము కాదు. గనుక, సబ్ కమిటీవారు నిర్ణయించిన ఏగ్‌మార్కు గ్రేడ్ల కనీస ధరలను, స్థానిక గ్రేడ్ల సక్రమ కనీస ధరలుగా నిర్ణయించవలసినదిగా ప్రభుత్వమువారిని కోరుచున్నాము. పొగాకు రయితులు ఆర్థికబాధలకుగురియై రాబోవు ఆర్థికమాంద్యాన్ని తట్టుకోలేని స్థితిలో,

నున్నారు. కాబట్టి మనపొగాకునకువచ్చే ధరలో వ్యాపారికి సక్రమలాభాన్ని వదలి రైతులకు గిట్టుబాటయ్యే పద్ధతిని అనగా ఏగ్‌మార్కు గ్రేడ్ల కనీసధరలను స్థానిక గ్రేడ్ల సక్రమ కనీస ధరలుగా నిర్ణయించవలసినదిగా కోరుచున్నాము".

ఆ హా ర క మి టి, మం ద డ ం.

అధ్యక్షుడు:- శ్రీ యర్రమనేని కృష్ణయ్యగారు.

తీర్మానము:- "పొగాకు మార్కెటు సబ్‌కమిటీవారు నిర్ణయించిన స్థానిక గ్రేడ్ల సక్రమ కనీస ధరలు, యీ సంవత్సరం, కౌలురేటు జాస్తిగనుక, నాగు విపరీతమైన ధరలకు కొనుటవల్ల, అధికవర్షములవల్ల పొగతోటలు నష్టపడిపోవుటచే, రెండుసార్లు వేతలు వేయుటవల్ల ఉత్పత్తి ఖర్చులు అధికమగుటవల్ల, సబ్ కమిటీ వారు నిర్ణయించిన ఏగ్‌మార్కు గ్రేడ్ల సక్రమ కనీస ధరలను స్థానికగ్రేడ్ల సక్రమ కనీసధరలుగా నిర్ణయించవలెనని మదరాసు ప్రభుత్వమువారిని కోరుచున్నాము".



# బహిరంగ సభలు

## యండ్రాయి.

అధ్యక్షుడు:- శ్రీ బలభద్రపాత్రుని ముకుందరావుగారు.

హాజరు అయినవారిలో ముఖ్యులు:-

1. దేవభక్తుని కోటయ్యగారు
2. నండూరు ఆంజనేయరాజుగారు
3. వల్లూరు పరంధామయ్యగారు
4. నండూరు రామచంద్రరాజుగారు
5. జమ్ముల నరసింహయ్యగారు

తీర్మానము:- "మా గ్రామంలో పొగాకు వుత్పత్తి ఎ 1 కి సరాసరి ఒకపుట్టి అగుచున్నది. కనీసధర రూ 600-0-0 వరకు వస్తేనేగాని మా రైతులకు గిట్టదు. మార్కెటు సిస్టముపెట్టి, వేలముపద్ధతిగా అమ్మకము జరుగవలెను. లైసెన్సు పొందినవారే తూకముదార్లై యుండవలెను. శాస్త్రీయమైన యెరువులు, బ్యారన్లకు సామానులు గ్రామకమిటీలద్వారా సప్లయి చేయించ కోరుచున్నాము."

## కర్లపూడి.

అధ్యక్షుడు :- శ్రీ కంతేటి పున్నయ్యగారు.

హాజరైనవారిలో ముఖ్యులు :- శ్రీ బలుకూరి సీతారామయ్యగారు
శ్రీ మంచికలపూడి శేషయ్యగారు
శ్రీ వట్టికూటి పున్నయ్యగారు

తీర్మానము :- "మా గ్రామములో య 1కి సరాసరి పుట్టి వుత్పత్తి అగుచున్నది. ఖర్చు రూ. 600/- లు అగుచున్నది. కనీస ధర పు 1కి రూ. 500/- ల వరకు వుండవలెను. మార్కెటు సిస్టము, వేలముపద్ధతి వుండవలెను. లైసెన్సు తూకపు

దారులు, బ్యారన్లకు కావలసిన సామాగ్రిని కమిటీద్వారా సప్లయిచేయించవలెను. ఆసామికి మనవర్తికి సరిపోవు పుగాకునకు ఎక్సైజు డ్యూటి తక్షణమే తీసివేయ వలెను. క్రమేణ ఎక్సైజు పద్ధతినే తీసివేయవలెను."

## మందువవారిపాలెం.

అధ్యక్షుడు :- శ్రీ మందువ వెంకటసుబ్బయ్యగారు.

తీర్మానముక్రింద సంతకములు చేసినవారి సంఖ్య : 12

తీర్మానము :- "గుంటూరు పుగాకు మార్కెటు కమిటీవారు చేయుచున్న కృషిని, సక్రమమైన కనీస ధరలను నిర్ణయించుటకు చేయుచున్న కృషిని మేమందరము ఏకగ్రీవముగా ఆమోదించి దానిని బలపరచుచు, త్వరలో దానిని అమలుపరుచు నట్లు గవర్నమెంటువారిని వొత్తిడిచేయగలందులకు కమిటీ వారిని కోరడమైనది."

## గంగవరము.

అధ్యక్షుడు:- శ్రీ కరి వెంకటసుబ్బారావుగారు.

తీర్మానముపై సంతకములు చేసినవారి సంఖ్య : 31

"ప్రస్తుతము పుగాకు వుత్పత్తిదారులకు తమసరకునకు యిచ్చుచున్న ధర గిట్టుబాటుగ లేదు.

"పుగాకుధరలు వ్యాపారస్థులచేతియందు వుండుటవలన రైతులకురావలసిన ధర రావడములేదు. కాబట్టి పుగాకునకు కనీసపు ధర నియమించుట అవసరము. అదియుగాక ఈ వత్సరము నారు ఖరీదు మిక్కిలిగా పెరిగియున్నది. యిప్పుడు గుంటూరు పొగాకు మార్కెటుకమిటీ నిర్ణయించిన ధరలప్రకారము ప్రభుత్వము ఆమోదించి వెంటనే అమలు జరుపవలయును".

## అమ్మనబ్రోలు.

అధ్యక్షుడు :- శ్రీ సూ. నరసింహంగారు.

తీర్మానముక్రింద సంతకములుచేసినవారి సంఖ్య : 10

తీర్మానము :- "పుగాకునకు వచ్చు ధర, పెట్టిన ఖర్చులో సగముకూడా తేలనం దున యిప్పుడు యీ సభవారు గుంటూరు పొగాకు మార్కెట్ కమిటీవారుచేయు

కృషిని బలపరచుచు, పుగాకునకు కనీస ధరల నిర్ణయము చేయించవలయునని గవర్నమెంటువారిని వత్తిడిచేసి అమలుజరిపించగలందులకై కమిటీవారిని యేకగ్రీవముగా కోరడమైనది."

## నిడమలూరు.

అధ్యక్షుడు :- శ్రీ కాకుమాని రత్తయ్యగారు.

తీర్మానము క్రింద సంతకములుచేసినవారి సంఖ్య : 18

తీర్మానము :- "గుంటూరు పొగాకు మార్కెట్ కమిటీవారి పొగాకు సక్రమ కనీస ధరల నిర్ణయమునకు మేమందరము ఆమోదించి దానిని త్వరలో అమలులోకి తేవలయునని గవర్నమెంటువారిని వత్తిడిచేసి అమలుపరుచునట్లు కమిటీవారు చేయవలయును."

## కరవాడి.

అధ్యక్షుడు : శ్రీ చుండూరి సుబ్బయ్యగారు.

తీర్మానముక్రింద సంతకములుచేసినవారి సంఖ్య : 17

తీర్మానము :- "పొగాకు కనీస ధరల విషయమై గుంటూరు పొగాకు మార్కెట్ కమిటీవారుచేయు కృషిని మేము అందరము ఏకగ్రీవముగా ఆమోదించి దీనివిషయమై గవర్నమెంటువారిని వత్తిడిచేసి పొగాకునకు కనీస ధరల నిర్ణయించి త్వరలో అమలుపర్చునట్లు కమిటివారిని ప్రార్థించడమైనది."

## ఉప్పుగుండూరు.

తీర్మానముక్రింద సంతకములుచేసినవారి సంఖ్య : 13

తీర్మానము :- "ప్రస్తుతము పొగాకు ఉత్పత్తిదారులకు తమ సరుకునకు వచ్చుచున్న ధర గిట్టుబాటుగలేదు. పొగాకు ధరలు వ్యాపారస్థుల చేతియందు వుండుట వలన రైతునకు రావలసిన ధరలు వచ్చుటలేదు. తదితర పైరులు అనగా ధనియములు మొదలగు పైరులవలన వచ్చుఆదాయముతో పోల్చిచూసిన, పొగాకునకు

వచ్చు ఆదాయము ఖర్చులుపోను మిగులునది శూన్యము. కనీసపు ధర నిర్ణయించుట అత్యవసరము. ఇప్పుడు గుంటూరు మార్కెటు కమిటీ నిర్ణయించిన ధరలను ప్రభుత్వము ఆమోదించి వెంటనే అమలు జరుపవలెను."

చింతగుంపల.

తీర్మానము క్రింద సంతకములుచేసినవారి సంఖ్య : 7.

"ప్రస్తుతము పుగాకు వుత్పత్తిదారులకు తమ సరకునకు వచ్చుచున్న ధర గిట్టుబాటుగలేదు. పుగాకు ధరలు వ్యాపారస్తుని చేతియందు వుండుటవలన రైతుకు రావలసిన ధర రావడములేదు. కాబట్టి పుగాకునకు కనీసపుధరలను నియమించుట అవసరము. యిప్పుడు గుంటూరు పొగాకుమార్కెటు కమిటీ నిర్ణయించిన ధరలు నాటుపొగాకుకు నష్టముగా నున్నవి. కాన కనీసపుధర రు 180-0-0 లు అగునట్లు చేసి, ప్రభుత్వము ఆమోదించి వెంటనే అమలు జరుపవలెను."

నేలూరు.

తీర్మానము క్రింద సంతకములు చేసినవారి సంఖ్య : 30.

"మొత్తము యకరము 1 కి ఖర్చులు రు 703-1-0 అగును. సగటు యకరము 1 కి ఎండుపొగాకు (అన్నిరకములు కలసి) ఒకపుట్టిచొప్పున వచ్చును. కనుక బేరనులో దిగిన పొగాకును (తాడుతో) కనీసము పుట్టి 1 కి రు 720-0-0 యిస్తే రయితులకు లాభములేకుండ సరిపోగలదు. అందువలన రైతు దెబ్బ తినకుండా నిలబడగలడు. కనుక సదరు ఖర్చుచూచి దానికి సరిపోను ఖరీదునిర్ణయించునట్లు చేయ ప్రార్థించుచున్నాము."

నిడమలూరు.

తీర్మానముక్రింద సంతకముచేసినవారి సంఖ్య : 19

తీర్మానము :- "ఈ సంవత్సరము నాచు, కూలి, మక్తా వగైరా వుత్పత్తి ఖర్చులు ఎక్కువైనందువల్ల, ధాన్యము, పశువులమేత గిరాకి అయినందువల్ల పొగాకు ధరలు పెంచకపోయినచో రయితుల వ్యవసాయమునకు నష్టము కలుగుతుందని

మా విజ్ఞప్తిని ప్రభుత్వమునకు తెలియపరచ వలసినదిగా కోరుచున్నాము. గత సంవత్సరముకన్నా పొగాకు వుత్పత్తి ఖర్చుల ధరలు రెట్టింపైనవి. ధరలు కూడా దామాషాను గత సంవత్సరముకన్నా రెట్టింపు చేయవలసినదిగా కోరుచున్నాము."

## టంగుటూరు.

తీర్మానముక్రింద సంతకములు చేసినవారి సంఖ్య : 14.

తీర్మానము :- "పొగాకు వేయడమునకు, (బ్యారను ఖర్చులతోసహా) అయ్యేడబ్బు అమ్మినపుడు వచ్చుదానికంటే రెండంతలుగా వున్నందువలన గుంటూరు పుగాకు మార్కెటు కమిటీవారు యిప్పుడు కనీసపు ధరలకైచేయు కృషిని మేము బలపరుచుచు దానిని తొందరగా అమలులోనికి తేవలయునని గవర్నమెంటువారిని వత్తిడిచేయవలసినదిగా కోరుచున్నాము."

## కొనికి.

తీర్మానము క్రింద సంతకములు చేసినవారి సంఖ్య : 13.

"ప్రస్తుతము పుగాకు వుత్పత్తి దారులకు తమ సరకునకు వచ్చుచున్న ధర గిట్టుబాటుగ లేదు. పుగాకు ధరలు వ్యాపారస్తుల చేతియందు వుండుటవల్ల రయితులకు రావలసిన ధర రావడములేదు. కాబట్టి పుగాకుకు కనీసపుధరల నియమించుట అత్యవసరము. అదియుగాక యీ సంవత్సరము అతివృష్టి వలన తోటలు రెండుసార్లు పోయినవి. నారు దొరకక యకరమునకు నారు రూ. 100 వరకు కొని వేసినారు. కాబట్టి గుంటూరు మార్కెట్ కమిటీ నిర్ణయించిన రేట్లు రయితులకు మేలుకూర్చును. ఆ ప్రకారము ప్రభుత్వము ఆమోదించి వెంటనే అమలు జరుపవలయును."

## త్రోవగుంట.

తీర్మానము క్రింద సంతకములుచేసినవారి సంఖ్య : 21.

"పుగాకుకు కనీసపు ధరలను నిర్ణయించుటకు గుంటూరు పుగాకుమార్కెటు కమిటీవారు చేయు కృషిని మేమందరమూ బలపరుచుచూ త్వరలో అమలుపరుచు

టకు గవర్నమెంటువారిని కోరడమైనది. యీ కనీసపు ధరలు నిర్ణయించక పోవుటవలన రైతునకు వచ్చేడబ్బు పెట్టినఖర్చుకు అనేకరెట్లు తక్కువగుచున్నది. అందువలన యీ కమిటీవారిని, గవర్నమెంటువారిని త్వరగా అమలుపరచుటకు కోరడమైనది.”

ఏడుగుండ్లపాడు.

తీర్మానముక్రింద సంతకములుచేసినవారి సంఖ్య : 14.

తీర్మానము :–“పొగాకు కనీసపు ధరలను నిర్ణయించుటకు గుంటూరు మార్కెటు కమిటీవారుచేయు కృషిని మేమందరము బలపరచుచూ త్వరలో అమలుపరచుటకు గవర్నమెంటువారిని కోరడమైనది. ఈ కనీసపు ధరలు నిర్ణయించకపోవుట వలన రయితునకు వచ్చేడబ్బు పెట్టిన ఖర్చుకన్న అనేకరెట్లు తక్కువ అగుచున్నది. అందువలన యీ కమిటీవారిని గవర్నమెంటువారిని త్వరగా అమలుపరచుటకు కోరడమైనది.”

చమళ్లమూడి.

తీర్మానముక్రింద సంతకములుచేసినవారి సంఖ్య : 50.

తీర్మానము :– “యకరం 1కి ఖర్చులు రు 758/– లు అయినవి. అందుకుగాను య 1కి తయారు అయిన సరుకు పౌ. 650 తేలును. పుట్టి 1కి రు 583–5–4 లు ధర వున్నయెడల రయితులు పెట్టిన ఖర్చులకు సరిపోవును. కాబట్టి గుంటూరు పొగాకు మార్కెటు కమిటీవారు కనీసం యీ ధరకు తగ్గకుండా ప్రభుత్వమువారిని ధరలు నిర్ధారణ చేయించుటకుగాను శిఫార్సు చేయగలందులకు ప్రార్థించుచున్నాము.”

పోతవరము.

తీర్మానము క్రింద సంతకములుచేసినవారి సంఖ్య : 5.

“ఈ సంవత్సరము పొగనారు, ఎరువులు మొదలైనవాటికి ఎక్కువఖర్చు అయినది. వర్షాధిక్యతవల్ల పొగతోటలు దెబ్బతిని రైతులు ఎక్కువ ఖర్చులకు

లో నైరి. అందువల్ల యీ సంవత్సరము ధరలు అధికముగా వేయకున్న రైతు ఆర్థికముగా చిక్కుపడును. సాధారణ పరిస్థితులలోగూడా కూలీలు వగైరాలకు ఎక్కువ ఖర్చులగును. గానయిదివరకు పొగాకుకు నిర్ధారణ చేసినరేట్లు సరిపోవు.

"వర్జీనియా పొగాకుకు నారు, కూలి, ఎరువులు, మొదలైన యావత్తు ఖర్చులకు (మక్తాగాక) యకరము ఒకటికి రు 475/- లు అగుచున్నవి. కాన ఈ క్రింద నమోదుచేసిన రేట్లు లేకున్న రైతులు నష్టపడుదురు.

| | | |
|---|---|---|
| వర్జీనియా | నెం 1 రు | రూ. 750/- |
| | నెం 2 | |
| | నెం 3 | రు. 650/- |
| లైట్ గ్రీన్ | నెం 4 | రు. 500/- |
| | నెం 5 | రు. 300/- |
| మొద్దుపచ్చ | | రు. 250/- |
| | నెం 6 | రు. 100/- |
| చూర | | రు. 35/- |

నాటుపొగాకుకు ఎకరము 1 కి అన్నిఖర్చులు (మక్తాగాక) రు 320/- లు అగుచున్నది. షుమారు య 1 కి 750/- పౌ అగును. కాన పుట్టి 1 కి రు 250/- లకు తక్కువలేకుండా యుండవలెను."

## ది 2-1-47 నాటి "ప్రజాశక్తి" సంపాదకీయం నుండి

ఈ నాటి వ్యాపారంలోని మూడు ముఖ్యాంశాలేమిటంటే. ఉత్పత్తి దారునికి తగిన ప్రతిఫలం లేక పోవడం, వినియోగదారుడు విపరీతమైన ధరలు యివ్వవలసివచ్చుట, మధ్య దళారీలు ఎక్కువ లాభాల్ని గడించడం. ఉత్పత్తిదారునికి తగిన ప్రతిఫలాన్ని కలుగజేసి, మధ్య మనుష్యులయొక్క విపరీతలాభాల్ని అరికట్టడానికి యిప్పటివరకు ఏవిధమైన చర్యలు తీసుకోబడలేదు.

గుంటూరు, కృష్ణా, గోదావరి జిల్లాలలోని పొగాకు రయితులు దురదృష్టవశాత్తు యీ స్థితికి లోను గావలసివచ్చింది.

రైతుల్నిటువంటి కష్టపరిస్థితులనుండి గట్టెక్కించాలంటే గుంటూరు పొగాకు మార్కెటు కమిటీవారిచే సిఫారసు చేయబడిన, పొగాకు కనీసధరలను కాంగ్రెస్ మంత్రివర్గం ముందుకొచ్చి, ఆచరణలో పెట్టాలి.

కనీసధరల ప్రణాళికను అమలులోపెట్టడమే కాకుండా, గవర్నమెంటు, పొగాకు రయితు తన వ్యవసాయ ఖర్చులను భరించ గలిగేటందుకు, అతని సరుకు మీద అప్పులిచ్చేపద్ధతి ఏర్పాటుచేయాలి. ఇంకా, గ్రేడింగు, రిడ్రైయింగు మొదలైన విషయాల్లో రయితులకు కావలసిన సౌకర్యాలు చేసేటందుకై పొగాకు ఉత్పత్తిదార్ల సహాకార సంఘాల్ని ఏర్పాటుచేయడం ముఖ్యావసరం. రయితులకు సక్రమ ధరలు వచ్చేటట్లు చేసేటందుకై పై సౌకర్యాలను కలిగించటం కాంగ్రెస్ గవర్నమెంటుయొక్క కర్తవ్యము.

---

# పొగాకు కనీసధరల
# సబ్ కమిటీ రిపోర్టు



# మొదటి భాగము.

## ఉపోద్ఘాతము.

గుంటూరుజిల్లాలో వర్జీనియా పొగాకు ప్రారంభమైననాటినుండీ, ఏటేటా పొగాకుపండించే విస్తీర్ణం క్రమక్రమంగా అభివృద్ధిపొందుతూ వచ్చింది. కృష్ణా, నెల్లూరులాంటి మన సమీపజిల్లాలకుకూడా యీపంట వ్యాపించటమే కాకుండా, 1937 సంవత్సరమునుండి తూర్పు, పశ్చిమగోదావరి జల్లాలలోకూడా ప్రముఖస్థానం ఆక్రమించింది. ఈ పొగాకుపంటకు తగినభూమి, అనుకూలమైన వాతావరణము, అధికశ్రమచేసే రైతులుకూడా లభించారు. జిల్లారయితాంగానికి మిర్చి, ప్రత్తి, వేరుశనగ మొదలైన వ్యాపారపంటలలాగా, పొగాకుకూడా యింకొక ఆదాయ మార్గాన్ని చూపించగలిగింది. ప్రథమంలో పొగాకును ప్రవేశపెట్టి, తగిన ప్రచారంచేసి, సరుకును ప్రతియేడూ కొనుగోలుచేస్తూ ఇండియన్ లీఫ్ టుబాకో డెవలెప్మెంట్ కంపెనీవారు పొగాకును అభివృద్ధిచేశారు. దేశంలోని సిగరెట్ ఫ్యాక్టరీల నుండీ, ఇంగ్లండులాంటి విదేశాల సిగరెట్ ఫ్యాక్టరీలనుండి యెల్లప్పుడు వస్తున్న డిమాండువల్ల రయితులకు యితర వ్యాపారపంటలమీదకంటే పొగాకుమీద వ్యామోహం యెక్కువైంది. ఇటీవల ఆహారపంటలనుగూడా వదలి దీనినే పండించటం వరకుకూడా వచ్చింది. గోదావరిజిల్లాలో పొగాకుపంట విస్తీర్ణం త్వరగా పెరగటానికిగాని, ప్రాసెసింగ్ యంత్రాలు స్థాపింపబడి, పరిశ్రమ అభివృద్ధిపొందటానికిగాని మార్కెటులో యెప్పటికప్పుడు కొనటానికి సిద్ధంగావున్న వర్తకులు, దేశీయవిదేశీయ డిమాండు, యివే ప్రధానకారణాలు. యితర పంటలద్వారా తగినఆదాయం రానటువంటి బాడవభూములలోకూడా పెరిగేస్వభావ కలిగి వుండటంవల్ల ఋతువుల ఒడుదుడుకులు ధరల వ్యత్యాసాలు మొదలైన కష్టాలను సైతం అధిగమించి, పొగాకు మన ప్రాంతాల వ్యవసాయంలో ఒకనిర్దిష్టమైన ప్రముఖస్థానాన్ని ఆక్రమించుకోగలిగింది.

ఇటీవల ఒక్క గుంటూరుజిల్లాలోనే వర్జీనియా పొగాకు విస్తీర్ణం షుమారు 80000 యకరాల వరకు, నాటుపొగాకు విస్తీర్ణం షుమారు 70000 యకరాల వరకు వుంది. వర్జీనియా పొగాకువిషయంలో పూర్వపుధరల్లోనే షుమారు 60 నుండి

75 లక్షలరూపాయలవరకు విలువగలిగిన దాదాపు 5000 బారన్లు కట్టబడినవి. యీ రకంపొగాకుకు అవసరమైన క్యూరింగుకుగాను సంవత్సరానికి కావలసిన బొగ్గు, కర్ర మొదలైనవాటికి షుమారు 30 నుండి 36 లక్షల రూపాయలవరకు ఖర్చు అవుతుంది. క్యూరింగుకూ, చెక్కలుకట్టటం వగైరా యితరపనులకు సంవత్సరానికి షుమారు 4 లక్షల రూపాయలు ఖర్చులుకాక వర్జీనియా పొగాకుకు షుమారు 80 లక్షల రూపాయలు, నాటుపొగాకుకు షుమారు 45 లక్షల రూపాయలు, వ్యవసాయంలో రైతు ఉపయోగించుకొనే కూలీలు మొదలైన యితరుల శ్రమక్రింద ఖర్చుపెట్టవలసి ఉంటుంది. గత పదిసంవత్సరాల్లో అమలులోకి వచ్చిన కృత్రిమ యెరువుల క్రింద రైతులు షుమారు 10 నుండి 15 లక్షల రూపాయలవరకు ఖర్చుపెడుతున్నారు. ఇవికాక ఉపయోగించే పశువుల యెరువులు మొదలైన సొంతయెరువులకు లెక్కలేదు.

ఆయా స్థానిక పరిస్థితులనుబట్టి, వాతావరణ కారణాలనుబట్టి, పొగనారుకుగాను షుమారు 25 లక్షల రూపాయలు రైతులకు ఖర్చు అవుతున్నది. నారు ఖరీదు యీ సీజనులో (1946-47) మరీ విపరీతంగా యిదివరకు యెన్నడూ లేనంతగా పెరిగి షుమారు 80 నుండి 90 లక్షల రూపాయలవరకు ఖర్చు అయింది. కాలమానం బాగుండి, ధరలు అనుకూలంగా ఉంటే, యీనాటి పరిస్థితులనుబట్టి 420 నుండి 460 లక్షల విలువగల పొగాకుకోసం, కోతకు రాకపూర్వమే రైతులు సంవత్సరానికి షుమారు 210 లక్షల కంటే అధికంగానే ఖర్చుపెట్టవలసి వస్తున్నదన్నమాట. ఒక మోస్తరు ధర వేసుకున్నప్పటికీ యకరం 1 కి రు 150 లు చొ॥ 225 లక్షల రూపాయలు కవులుక్రింద ఖర్చు అవుతుంది. ఈరకంగా చూస్తే రైతులయొక్క పశువులుచేసే శ్రమ, దొడ్లలో తయారుచేసుకున్న యెరువులు లెక్కకట్టకుండా వదలి వేసినప్పటికీ, పొగాకు రైతులకు మిగులుతున్న లాభం యేమీ లేదని స్పష్టంగా కనపడుతున్నది.

మామూలుగా వ్యావసాయిక పరిభాషలో కవులు అనేది ఊహామాత్రమైనదేననే అభిప్రాయం ఉన్నప్పటికీ, పొగాకు వ్యవసాయంలోమాత్రం కవులు ఆచరణలో కనిపిస్తున్నది. బారను అద్దెల విషయంకూడా యింతే. అధిక లాభాల కోసం తాపత్రయపడే కొందరు మధ్యతరగతి రైతుల పోటీ విషయం అలా

ఉంచితే, కవుళ్ళు, అద్దెలు యింత అధికం కావటానికి ముఖ్యమైన కారణం రైతు దినదినాభి వృద్ధిచెందుతున్న తన జీవిత ఖర్చులను గిట్టుబాటుకాని తన కొలది భూముల ద్వారానే సంపాదించుకోవాలనే అభిలాషయే.

పైన పేర్కొన్న విషయాలు కాక, నారు వేసిన నాటినుంచీ, క్యూరింగు పూర్తి అయిందాకా పొగాకుపంట అనేక కష్టాలతో కూడుకొని ఉంది. రైతు తన కుటుంబానికి అవసరమయ్యే ఆహార పదార్థాలు, పశువులమేత మొదలైనవాటిని బయటనుంచి కొనుక్కోవలసిన అవసరాన్నికూడా పొగాకు కలిగిస్తున్నది. కాలం గడచిన కొద్దీ రైతులుకూడా జొన్నలు మొదలైన ధాన్యాదులు మాని బియ్యానికి అలవాటుపడి గ్రామస్థుల ఆహారంలోకూడా నాగరికమైన మార్పులు వస్తున్నవి. దీనితో జిల్లాలోని వ్యవసాయ కార్యక్రమంలోనే మార్పులు సంభవిస్తున్నవి. బార్నులో కాల్చే సమయంలో ఉండే కష్టనష్టాలు, నాటుపొగాకును ఎండవేసే టప్పుడు ఒక చిన్నవాన జల్లుకురిసే పొగాకు గుణంలోనూ, రకంలోనూ, వచ్చే విపరీతమైన మార్పులు – యివన్నీ సంపూర్ణంగా తెలిసిన వాడెవ్వడూ పొగాకు వ్యవసాయం చెయ్యటానికి యేమాత్రం సాహసించలేడని చెప్పవచ్చు. కాని, యిన్ని సాధకబాధకాలు ఉన్నప్పటికీ, రైతు నిరుత్సాహపడక వ్యవసాయం సాగిస్తూ, తన ఋణభారం తీరటానికి, తన కుటుంబఖర్చులు పూడ్చుకోటానికి అవకాశం కలిగే మంచిరోజులు వస్తున్నవనే నమ్మకంతో తనపనిని యథావిధిగా చేస్తున్నాడు.

వ్యాపారపంటల క్రయవిక్రయములకుగాను మార్కెట్ యార్డులను నిర్మించి, వ్యాపారపరిస్థితులను క్రమపరచటంద్వారా, యిలాంటి పొగాకు మొ॥ పంటలవల్ల వచ్చే ఆదాయాన్ని రైతుకు నమ్మకంగా అందజేయవలెననే ఆశయం మద్రాసు వ్యాపారపంటల చట్టంలో ఉద్దేశింపబడింది. సరియైన కాటాలద్వారా తూకాలను క్రమపరచటం, తూకపురాళ్ళలో మోసాలు లేకుండా చెయ్యటం, తారం మోసాలను నిర్మూలించటం, యితర తీసివేతలను అరికట్టడం, కాంట్రాక్టు ఫారాలను అమలు పరచటం, గ్రేడ్లవిషయంలో తగాదాలను తీర్చటం మొదలైన పనులు చేయటానికి మాత్రమే వ్యాపారపంటల చట్టం అవకాశం కలుగజేసింది. ఈ అవకాశాలు రైతుకు బహుకొద్ది రక్షణనుమాత్రమే యివ్వగలవు. అతని శ్రమ అంతా వృథాగానే పోతున్నది. చివరకు కనీసధరల గ్యారంటీకూడా లేదు.

ఆర్థిక వ్యవస్థలో ధరల ప్రాముఖ్యతను గురించి వివరిస్తూ డాక్టర్ క్లార్క్ యిలా అన్నారు. "ధరలన్నీ కలిసి ఒక సమూహంగా - ఒక కష్టసాధ్యమైన సమూహంగా ఏర్పడుతై. ఇందులోని వివిధభాగాలు అనేకరకాల పరస్పర సంబంధాన్ని కలిగి ఉండి, ఒక నిర్ణీతస్థితి యేర్పడుతుంది. అప్పుడప్పుడువచ్చే అనారోగ్యాలనుండి బైటపడగలిగిన ప్రాణులదేహస్థితివంటిది యీధరల సమూహం. ఈ వివిధధరల మధ్యన ఉండే వ్యత్యాసమే మన వ్యాపార ప్రపంచాన్ని నడిపిస్తున్న ఒక విచిత్రమైన మూలశక్తి." (1)

గత యుద్ధానంతరం ఆర్థికమాంద్యంనుండి దేశాన్ని రక్షించటానికై అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో తీసుకోబడిన చర్యలలో ధరలు ప్రధాన పాత్రను నిర్వహించినవి. - 1933 వ సంవత్సరపు వ్యవసాయ సమన్వయ చట్టంయొక్క ప్రధానాశయం "ఒక నిర్ణీతకాలంలో, వ్యవసాయపంటల ధరల కొనుగోలు శక్తికీ, రైతులు కొనుక్కునే యితర జీవితావసరవస్తువుల ధరల కొనుగోలుశక్తికీ, ఒక సమన్వయం యేర్పడే విధంగా, ధరలను పునర్నిర్మించడమే." (2) ఆర్థికంగా క్షీణించిపోయిన ఉత్పత్తిదార్లకు తగిన రక్షణ కల్పించే ఆశయంతోనే అదే సంవత్సరంలో చట్టరూపంలోకి వచ్చిన మద్రాసు వ్యాపార పంటలచట్టం, వ్యవసాయవస్తువులకు కొనుగోలు శక్తిని కల్పించి రైతులకు రక్షణయిచ్చే ప్రధాన సమస్యను పరిష్కరించలేకపోయింది. యునైటెడ్ స్టేట్సు వ్యవసాయ సమన్వయ చట్టంలాగా మద్రాసు వ్యాపార పంటలచట్టం రైతు రక్షణకు సంబంధించిన ధరల సమస్యను పరిష్కరించలేక పోయినందువల్ల అసలు ప్రధాన సమస్యనే విస్మరించిందని చెప్పవచ్చు. అయినప్పటికీ మద్రాసు వ్యాపార పంటల చట్టంలోని ఒకమంచి విషయం యేమిటంటే, ఆయాసందర్భాలలో అవసరమైనటువంటి ఇతర నియమాలనుచేసే అధికారాన్ని ప్రభుత్వం తనయందే ఉంచుకొన్నది.

---

(1) క్లార్క్, ఎఫ్. ఇ. (1931) రీడింగ్స్ యిన్ మార్కెటింగ్, ది మాక్మిలన్ కంపెనీ, న్యూయార్క్ (పేజి 581)

(2) చౌధరి ముఖ్తార్ సింగ్ (మాజీ యం. యల్. ఎ., సెంట్రల్ బ్యాంకింగ్ ఎంక్వైర్ కమిటీ సభ్యులు) 'విదేశాల్లో వ్యావసాయిక రక్షణలు' (Agrarian Reliefs in Foreign Countries) (పేజి 130)

రాయల్ కమిషన్ రోజులనుండి, నేటివరకూ, దాదాపు యీ యిరవై సంవత్సరాలకుపైగా, ఇండియాలో గ్రామజీవన సౌభాగ్యం నిర్మించుకునేందుకు ధరలు - ముఖ్యంగా కనీసధరల ప్రాముఖ్యతనుగురించి యుగపురుషుడు మహాత్మా గాంధీ స్పష్టంగా వివరిస్తూనే వచ్చాడు. "వినిమయదారుడు యిచ్చేవెలలో చాలా కొద్దిభాగం మాత్రమే ఉత్పత్తిదారునకు చెందుతున్నదనే విషయంనాకు రూఢిగా తెలుసు. వినిమయ దారుడుయిచ్చే ధరలో ప్రతిభాగమూ రైతుకు చేరేటట్లు చూడడమూ, కష్టించి పండించే రైతుకు పంటయొక్క పూర్తి ఖరీదు చేరేటట్లు చేయుటమూ, నేటి తాత్కాలిక ప్రభుత్వంయొక్క బాధ్యత అయి ఉన్నది. వ్యవసాయదారుడికి వచ్చిన యిబ్బంది తక్కువ ధరలవల్ల కాదు; మధ్యదళారీలే దీనికి కారణం. ఈమధ్య దళారీలే వ్యవసాయదారులమీదపడి జలగల్లాగా పీక్కుతింటూ, న్యాయంగా అతనికి చెందవలసినదాన్ని గుంజుకుంటున్నారు. లేనిచో నిజంగా పండించిన రైతు పస్తులుండవలసిన అవసరంలేదు"

ఇండియా ప్రభుత్వం నియమించిన కృష్ణమాచారి ధరల సబ కమిటీవారు కూడా రయితుకు మార్కెట్ స్థితిగతులను అనుకూలంచేసి, లాభదాయకమైన కనీస ధరల నిర్ణయం ఉండాలని సూచించారు. "ప్రకృతితో వ్యవసాయదారుడు ఆద్యంతాలులేని ఒక జూదం—జాతీయ జీవన సౌభాగ్యాలకు అత్యావసరమైన జూదం—ఆడుతున్నాడనీ, భూమిని కష్టించి సేద్యంచేసి పండించిన రయితుకు తగిన ప్రతిఫలం లేకుండా ఉండాలనటం అర్థంలేని విషయము" అనే విషయాలను దృష్టిలో ఉంచుకొనే వారు పై సిఫార్సును చేశారు.

వ్యవసాయ ధరలను కట్టుబాటులో ఉంచే విధానాలను గురించి చర్చిస్తూ కనీస ధరల నిర్ణయం అత్యంత ప్రధానమైనదనీ, ఉత్పత్తి ఖర్చులలో విపరీతమైన పెరుగుదల వచ్చిన సందర్భాలలో ప్రభుత్వంవారు సబ్సిడీలు యివ్వవలసి ఉంటుందనీ మిశ్రా (3)గారు హెచ్చరించారు.

---

(3) మిశ్రా. వి. డి. (1947) వ్యవసాయధరల కట్టుబాటు—ప్రధాన సమస్యల పరిశీలన. [Stabilisation of agricultural Prices-Main problems outlined] కామర్స్ 11-1-1947 పే. 62.

ప్రత్తి, చెరుకు, జనుము, మొదలైన పంటల విషయంలో కనీస ధరలు అమల్లో ఉన్నవి. ధరల విపరీత పెరుగుదలను అరికట్టేందుకై యుద్ధకాలంలో వ్యవసాయ వస్తువులకు ధరల కంట్రోలువిధానం అమలు జరుపబడింది. ధరలలో సమన్వయం యేర్పరచుటయే కంట్రోలు విధానపు ముఖ్య ఆశయం. గరిష్ఠ ధరలు యెంతఅవసరమో, కనీస ధరలుకూడా అంతే అవసరము. యుద్ధానంతర ఆర్థిక పునర్నిర్మాణ కార్యక్రమంలో వ్యవసాయదారుడికి రక్షణ కలిగించాలంటె కనీస ధరలు అత్యావసరము. "కనీస ధరల సిద్ధాంత ప్రాముఖ్యతను మనం యీ క్షణం నుంచే గుర్తించవలసిన అవసరంవుంది. యుద్ధానంతర కాలంలో వ్యవసాయదారులకు యీ రక్షణ తప్పనిసరిగా ఉండి తీరాలి. అంటే ధరల కంట్రోలు విధానం యుద్ధావసర కార్యాల్లో ఒకటిగా మాత్రమే ప్రభుత్వం భావించకూడదు. శాంతి కాలంలో పునర్నిర్మాణ కార్యాలలో కంట్రోలు విధానం ఆచరణలోపెట్టి నిర్మాణాన్ని బలిష్టంచేసుకొని సక్రమ ధరల సాధనకోసం ఉపయోగించుకోవాలి." (4)

కాబట్టి, వ్యవసాయ పరిశ్రమకు, లాభదాయకమైన సక్రమ కనీస ధరల నిర్ణయం, వెన్నెముక వంటిది. దీనిని కాదనటం, వ్యవసాయదారుని ప్రధాన సమస్యనే త్రోసిరాజనటం. ఎక్కువగా యెగుమతులకు అవకాశాలున్న పొగాకుపంట విషయంలో యీ సమస్య యింకా యెక్కువ ప్రధానమౌతుంది. కనీస ధరల నిర్ణయంలేనిదే క్రమక్రమంగా రైతాంగం పతనమైపోయి సమన్వయంలేని వ్యవసాయంలో, అధిక ఋణభారాల్లో దుస్థితిలోమునిగి క్షీణించిపోతుంది.

---

(4) బలజిత్ సింగ్ (1945) (వ్యవసాయార్థిక శాస్త్ర అధ్యాపకులు - ఆగ్రా) యస్. ఆర్. అగర్వాల్ అండ్ కంపెనీ వారిచే ప్రకటింపబడిన Whither Agriculture in India అనే గ్రంథంలో పేజి 216.

# రెండవ భాగము.

## గుంటూరు టుబాకో మార్కెట్ కమిటి పూర్వప్రయత్నాలు.

పొగాకుకు కనీసధరలను నిర్ణయించి అమలుజరపటంలోని అత్యవసరాన్ని గురించి గుంటూరు టుబాకోమార్కెట్‌కమిటీ యింతకుముందే 1940 సంవత్సర ప్రాంతంలోనే యీసమస్యను రాష్ట్రప్రభుత్వదృష్టికి తెచ్చింది. ఉత్పత్తిఖర్చులు, యకరానికి సగటుపంట, వివిధగ్రేడ్ల సగటుశాతములు, కనీసధరలు, యివన్నీ వ్యవసాయశాఖా డైరెక్టరుగారిద్వారా ప్రభుత్వానికి నివేదించబడినవి. అప్పటి విచారణలోనూ, లెక్కల సేకరణలోనూ, జిల్లావ్యవసాయ శాఖాధికారికూడా తోడ్పడి పనిచేశారు. వ్యవసాయశాఖా డైరెక్టరుగారు ప్రభుత్వానికి యీ విషయమై చేసిన సిఫార్సులో యిలాఅన్నారు. "ఉత్పత్తిదారునికి సక్రమ కనీసధర లభించేందుకు అవసరమైన చర్యలు తీసికొనవలసిఉంది. చెరుకుధరకూ, తయారైన పంచదారధరకూఉన్న, సంబంధం తెలిసినట్లుగా, క్యూర్‌చేసిన ముడిపొగాకు ధరకూ, తయారైన సిగరెట్లధరకూవున్న సరియైన సంబంధం ఖచ్చితంగా తెలియనందువల్ల, కనీసధరలు నిర్ణయించటం ఉత్పత్తిఖర్చుల (గ్రేడింగు, యీనెదీయటం మొ॥ ఖర్చులు సహా) ఆధారంతోనే జరుగవలసివుంటుంది. యిందులోనూ, ఏప్రాంతానికి ఆప్రాంతం విడివిడిగా ఉత్పత్తిఖర్చులు సేకరించి, వాటిఆధారంతో ఉత్పత్తిదారుడుపెట్టిన పెట్టుబడికీ, చేసినశ్రమకూ న్యాయమైన ప్రతిఫలం వచ్చేలాగున కనీసధరలు నిర్ణయించాలి". (5) ఆనాడు ప్రభుత్వం యుద్ధకృషిలో నిమగ్నమై వుండంచేత యేనిర్ణయాన్ని స్పష్టంగా చేసియుండలేదు.

---

(5) మద్రాసు డెవలప్‌మెంట్ కార్యదర్శికి, వ్యవసాయశాఖా డైరెక్టర్ వ్రాసిన నెం. సి. 2-573/40 - ది 19-8-1941 - లేఖవల్ల తెలిసిన సంగతులు. [పూర్తిలేఖ అనుబంధములో యివ్వబడింది.]

# మూడవ భాగము.
# కనీసధరల నిర్ణయ సందర్భంలో చర్చించవలసిన ముఖ్యవిషయాలు.

మన దేశంలాంటి వ్యావసాయిక దేశాల అభివృద్ధి ముఖ్యంగా రెండు విషయాల — ఒకటి ఉత్పత్తి, రెండు వ్యవసాయ ధరలు—మీద ఆధారపడి ఉంటుంది. పండించేభూమి, శీతోష్ణ స్థితిగతులు, సేద్యము, పంటయొక్క పెరుగుదల, మొదలైన అనేకవిషయాలమీద ఉత్పత్తి ఆధారపడి ఉంటుంది. ధరలు కొంతవరకు ఉత్పత్తిమీదా, యెక్కువ భాగం డిమాండు, దిగుమతులు, సుంకాలు, పన్నులు, వ్యాపార ఆర్థిక సౌకర్యాలు (Preferences) మొదలగు వాటిమీదా ఆధారపడి ఉంటవి. వ్యవసాయ వస్తువుల ధరలు దేశావసరాలుపోను మిగిలినపంటమీద చాలావరకు ఆధారపడి ఉంటవి. ఉత్పత్తిదారులే తమ అవసరాలకు ఉపయోగించుకునే ఆహారధాన్యాలు, పప్పుధాన్యాలు మొదలగువాటి విషయంలో యీసూత్రం చాలావరకు వర్తిస్తుంది. కాని యెక్కువగా యెగుమతి కాబడే పొగాకు లాంటి వ్యాపారపంటల ధరలు మాత్రం ముఖ్యంగా దేశీయ విదేశీయ మార్కెట్టు పరిస్థితులమీద ఆధారపడి ఉంటవి.

<u>విదేశ మార్కెట్టు</u> :— హిందూదేశములోని వర్జీనియా, నాటు పొగాకుకు ముఖ్యమైన మార్కెట్టు కేంద్రం యింగ్లండు. యిటీవల యితర యూరప్ దేశాలకూ, రష్యా, యీజిప్టు, చైనా, ఆస్ట్రేలియా మొదలగు దేశాలకు కూడా మన పొగాకు వ్యాపించింది. ప్రపంచంలోని దేశాలన్నిటిలోనూ యెక్కువగా పొగాకును దిగుమతి చేసుకునేది యింగ్లండు. యింగ్లండులో 1945 సం॥రంలో పొగాకు దిగుమతులు, యుద్ధానికి పూర్వం ఉండేసగటు దిగుమతుల కంటే నూటికి 50 పాళ్లు యెక్కువైనవి.

| అమెరికా సంయుక్త రాష్ట్రాలనుండి ఇంగ్లండుకు పొగాకు దిగుమతులు. | 1935-39 సం॥ సగటు దిగుమతి | 1945 సం॥ సగటు దిగుమతులు |
|---|---|---|
| | 193 మిలియన్ల పౌన్లు | 289 మిలియన్ల పౌన్లు |

(టుబాకో - ఇంగ్లండు - ఆగస్టు 1946 - 73 పేజీ నుండి)

ఇంగ్లండు దిగుమతుల్లో ఫ్లూక్యూర్డు వర్జీనియా పొగాకు యెక్కువ. ఇంగ్లండు ముఖ్యముగా అమెరికా, కెనడా రొడీషియా, యిండియాలనుండి పొగాకు దిగుమతి చేసుకుంటుంది. యింకా యితర సామ్రాజ్య దేశాలనుండీ, యితర దేశాలనుండీ కూడా కొద్ది కొద్ది దిగుమతులు ఉంటవి.

అమెరికా :- 1945 స॥ రం కంటే 1946 సం॥ లో ఫ్లూక్యూర్డు వర్జీనియా పొగాకు ధరలు నూటికి 20 నుండి 25 పాళ్ళ వరకు పెరిగినవి. యెగుమతులు యెక్కువగా జరిగే తూర్పు, మధ్య ప్రాంతాల్లో వర్జీనియా పొగాకుకు కొన్ని సగటు ధరలు యీక్రింద చూపబడినవి.

| | 1946 (సెంట్లలో) (పౌ1కి) | 1945 (సెంట్లలో) (పౌ1కి) | ఇప్పటి పెరుగుదల |
|---|---|---|---|
| తూర్పు ప్రాంతం (6) | 54.65 | 43.14 | 26.6 |
| మధ్య ప్రాంతం (7) | 49.20 | 41.34 | 19.0 |

ఫెడరల్ ప్రభుత్వం వివిధ గ్రేడ్లకు ధరలను నిర్ణయించింది. ప్రభుత్వ యాజమాన్యంక్రింద నడుస్తున్న బ్యారన్ వర్జీనియా ధరలనిర్ణయ సహకారసంస్థ (ఫ్లూక్యూర్డ్ టుబాకో కో-ఆపరేటివ్ స్టెబిలైజేషన్ కార్పొరేషన్) అనే సంస్థ మార్కెట్టులో ప్రవేశించడంద్వారా వివిధరకాల గ్రేడ్లకు నిర్ణీతమైన ధరలకంటే

(6) యునైటెడ్ స్టేట్స్‌లో ప్రకటింపబడే ఒక వ్యాపార వారపత్రిక, 'టుబాకో' - 17-10-46 నుండి (పేజీ 8.)

(7) ,, ,, ,, ,, 10-10-46.. (పే. జి. 9.)

ధరలు తగ్గిపోకుండా చూడగలుగుతుంది. ఈ విధానం క్రింద సేకరించిన పొగాకు వివిధ రకాలుగా వర్ణించటానికి వీలులేనట్లుగా ఉంటుంది.(8) అంటే పొగాకు లోని మేలు రకాలు, సామాన్యరకాలుకూడా నిర్ణీత ధరలకు ఎక్కువ కాకపోయినా కనీసం ఆధరలకైనా అమ్ముడు పోతున్నవన్నమాట. తూర్పు, మధ్య ప్రాంతాల్లో సగటుధర 51.93 సెంట్లు. అంటే పౌ 1కి రూ. 1-11-9 లు గాని, 500 పౌనుల పుట్టికి రూ. 867 లు కాని అవుతుంది. (అనుబంధం 2 చూడుడు.)

కెనడా :- ఎల్లప్పుడూ పండే 109 మిలియన్ల పౌన్ల వర్జీనియా పొగాకు పంట అంచనాతో ఒంటారియో ఫ్లూక్యూర్డు టుబాకో మార్కెటింగ్ అసోసియేషన్ వారి బోర్డు ఆఫ్ డైరక్టర్సుయొక్క మార్కెటు అప్రైజల్ కమిటీవారు కనీససగటుధర 35.33 సెంట్లుగా 1946 సం॥ పు ఫ్లూక్యూర్డు పొగాకుకు నిర్ణయించారు.(9) 1946 సం॥ పు పంటకు విపరీతమైన మంచు దెబ్బతగిలి నప్పటికీ, యీ నిర్ణయించినధర 1945 ధర కంటే నూటికి 6.2 పాళ్ళు యెక్కువగానే ఉంది. గ్రేడ్ వారిగా కనీసధరలు 3వ అనుబంధంలో యివ్వబడినవి. 35.33 సెంట్లు అంటే పౌ1కి రు. 1-2-10 లు లేక పుట్టికి రు. 588 లు అవుతుంది.

రొడీసియా :- దక్షిణ రొడీసియాలో పొగాకు చాలా తక్కువరంగు కలదైనప్పటికీ, 1945 లో ధరలకంటే 2 నుండి 4 రెట్ల వరకు ముఖ్యంగా తక్కువ గ్రేడ్లకు ధరలు చాలా యెక్కువగా ఉన్నవి. మొదట్లో అంచనా వేసుకున్న 50 నుండి 60 మిలియన్లకు బదులు పంట 42 మిలియన్ల పౌనులు మాత్రమే వచ్చింది. అననుకూల వాతావరణ పరిస్థితులవల్ల ఉత్తర రొడీసియాలోపండిన పొగాకు రంగు, జిగి, ఆకారంలో చాలా తక్కువ రకంగా తయారైంది. అయినప్పటికీ మామూలు రకాలను మినహాయిస్తే, పొగాకుధరలు దక్షిణ రొడీసియాలో కంటే అధికంగానే ఉన్నవి.(10)

---

(8) యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా లోని టుబాకో గ్రేడింగ్ కార్పొరేషన్ వారి నెల సరి మార్కెట్ రిపోర్టు (సెప్టెంబరు 46) నుండి.

(9) యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికాలోని వ్యాపార వారపత్రిక 'టుబాకో' (31-10-46) నుండి (పేజి 105)

(10) " " " " (17-10-46) నుండి (పేజి17.)

రోడీసియన్ అసోసియేషన్ పొగాకు ప్రవీణుని అభిప్రాయం ప్రకారం, యితర ముఖ్య అవసర వస్తువుల ధరలు పడిపోయేటంతవరకూ పొగాకు ధరలు కూడా పడిపోవు. ఇంకా యెక్కువ అద్యోసూచనలుకూడా కనబడుతున్నవి. పొగాకు అవసరమైన అనేక దేశాలలో యీనాడు పొగాకు ఒక లాభకరమైన పంటగా, యితరపంటలతో పోటీ చేస్తున్నది. ధరలు పడిపోవటమంటే వెంటనే పొగాకు ఉత్పత్తిదార్లు యింకో లాభకరమైన పంటవైపు తమ దృష్టిని కేంద్రీకరిస్తారు. అంతటితో మళ్ళీ ప్రపంచంలో పొగాకు మొత్తంలో తరుగు యేర్పడుతుంది.(11) 1946 సంవత్సరపు ఫ్లూక్యూర్డు పొగాకుకు సగటుధర పౌ1కి 32.35 పెన్నీలు, అంటే పౌ1కి రు. 1-11-0 లు లేక పుట్టి1కి రూ. 843 లు అవుతుంది. ఫైరుక్యూర్డు పొగాకుకు ధర పౌ1కి 16.95 పెన్నీలు, అంటే పౌ1కి రు. 0-14-1½ లు లేక పుట్టి 1కి రు. 441 లు అవుతుంది.(12)

న్యాసాలాండ్ పంటకూడా రోడీసియాపంట లాంటిదే. న్యాసాలాండులో ధరలు చాలా యెక్కువగాఉన్నవి. అంచనా వేసుకున్నంతపంట రానందువల్ల సీజను చివరకాలంలో ధరలు యింకా యెక్కువగా పెరిగిపోయినవి. యెగుమతులు చేయబడే ఫ్లూక్యూర్డు పొగాకు సగటు ధర పౌ1కి 23.78 పెన్నీలవరకు పోయింది. అంటే పౌ1కి రు. 1-4-0 లు లేక పుట్టి1కి రు. 625 లు అవుతుంది.(13)

దీని అంతటివలనా తేలేదేమిటంటే ముఖ్యమైన సప్లై కేంద్రాలలో పొగాకు ధర 1945 సంవత్సరపు ధరల కంటే 1946 సంవత్సరములో నూటికి 20 నుండి 25 పాళ్ళువరకు యెక్కువగా అమ్మకం జరుగుతున్నదన్నమాట.

ఇంగ్లండులో మార్కెట్ పరిస్థితులు:- యుద్ధకాలంలో అమెరికాదేశంనుంచి యింగ్లాండులోకి దిగుమతి అయిన సరుకంతా బోర్డు ఆఫ్ ట్రేడ్ వారుకొని ఫ్యాక్టరీ యజమానులకు, వారు యుద్ధానికి పూర్వం ఉపయోగించే మొత్తం పొగాకులో ఒక నిర్ణీతభాగం యేర్పాటుచేసి పంచబడింది. 1946 సం॥ లో యజమానులు

(11) ఇంగ్లండులో ప్రకటింపబడే వ్యాపార మాసపత్రిక (Monthly Trade journal) అక్టోబరు 1946 నుండి (పేజి 101.)

(12) "టుబాకో" (ఇంగ్లండు) డిసెంబరు 46 నుండి (పేజి 62)

(13) ,, ,, సెప్టెంబరు 46 నుండి (పేజి 103)

యెవరిమట్టుకువారే కొనుక్కున్నారు. ప్రతి యజమానికి దేశీయ ఉపయోగార్థం 1945 లో కొన్నదానికంటె నూటికి 5 పాళ్ళు అదనంగా, అంటే యుద్ధానికి పూర్వం దానికంటే నూటికి 20 పాళ్లు అదనంగా కొనటానికి అనుమతి యివ్వబడింది. పైగా ప్రతి యజమానికీ, నిల్వజేసుకునేందుకు యుద్ధానికి పూర్వం కొన్న దానిలో నూటికి 30 పాళ్ళు కొని నిల్వజేసుకోటానికి అనుమతి యిచ్చారు. 1946 సం॥ రం వరకు ఫ్యాక్టరీ యజమానులు కొద్ది నిల్వలతోనే కాలంగడుపుతూ వచ్చారు. యుద్ధానంతరం నిల్వచేసుకోటానికి వాళ్ళకు మొదటి అవకాశం యిప్పుడేవచ్చింది.

ఇది కాక యింకా యజమానులు తయారైన సిగరెట్ల యెగుమతుల కోసం యుద్ధానికి పూర్వం ఉపయోగించినంత మొత్తం పొగాకు ఉపయోగించుకోవచ్చు, అంటే 1945 సం॥రం లో కంటే 100 కి 50 పాళ్ళు యెక్కువ. కాని 1945 సం॥రం లో యన్. ఎ. ఎ. యఫ్. ఐ కోసం, ప్రత్యేక రకములకోసం యిచ్చిన దానిలో నూటికి 50 పాళ్లు తగ్గించినందువల్ల కొంత తగ్గింది.(14) అయినప్పటికి మొత్తం మీద చూస్తే గత సంవత్సరాలకంటె నూటికి 35 పాళ్ళవరకు యెక్కువ డిమాండు ఇంగ్లండులో కలగవచ్చునని ఊహించటానికి వీలున్నది.

అమెరికా సంయుక్త రాష్ట్రాలనుండి పొగాకు కొనుగోలు మొత్తాలు, పొగాకుకొనుగోలుకు ప్రత్యేకించబడిన డాలర్ల మొత్తముమీద ఆధారపడి ఉంటుంది. కాని అలా ప్రత్యేకించబడిన డాలర్ల మొత్తం తగ్గించబడుతున్నందు వలన అమెరికానుండి పొగాకు కొనుగోలు కూడా తక్కువ కావచ్చునని తెలియుచున్నది.(15) అందువల్ల ఇంగ్లండు, సామ్రాజ్య దేశాలనుండి, స్టర్లింగు బ్లాకుల నుండి పొగాకు యెక్కువగా కొనేందుకు అవకాశాలు కన్పిస్తున్నవి. ఈ సందర్భములో ఇంగ్లాండులో సామ్రాజ్య దేశాలనుండి కొనే పొగాకు విషయంలో సామ్రాజ్య ప్రాముఖ్యత (యింపీరియల్ ప్రిఫరెన్సు) తీసివేసే అవకాశాలను గురించి కూడా యిక్కడ చర్చించవలసిన అవసరం ఉంది. అనేక అంతర్జాతీయ

---

(14) "టుబాకో" (ఇంగ్లండు) సెప్టెంబరు 46 నుండి (పేజి 37)

(15) ,, (యునైటెడ్ స్టేట్సు ఆఫ్ అమెరికా) 3-10-46 (పేజి 17.)

ఆర్థిక సిద్ధాంతాల మీద యీ సమస్య ఆధారపడి ఉన్నప్పటికీ, ఇంగ్లండు అంత సులభంగా, యింపీరియల్ ప్రిఫరెన్సును తీసివేసే అవకాశాలు లేనట్లే కనిపిస్తున్నది. ఇంగ్లండుకు ముడిపదార్థాలు సప్లయిచేసే యితరదేశాలతో ముఖ్యంగా అమెరికాతో బేరాలుచేసే టందుకు యీ ప్రిఫరెన్సు యింగ్లండుకు ఒక ఆయుధంగా ఉపయోగపడుతున్నది. మన సోదర అధినివేశ రాజ్యమైన కెనడాలోని పరిస్థితులనుబట్టి చూస్తే, 1940 లో యింపీరియల్ ప్రిఫరెన్సును తీసివేసే సూచనలు యేమాత్రము కన్పించడంలేదు.

<u>ఐరోపా మార్కెట్టు</u>:- యుద్ధ భీభత్సానికి గురియైన యూరపు రాజ్యాలు జీవితావసర వస్తువుల విషయంలోను, పొగాకు విషయంలోనుకూడా అనేక అవస్థలు పడుతున్నవి. సిగరెట్లుకూ, చుట్ట త్రాగటానికికూడా రేషనింగు ఉత్తర్వులు పరచవలసివచ్చేటంతగా ఆ దేశాలు దెబ్బతిన్నవి. కావలసినంత సరుకు సప్లయి లేనందున బ్లాక్ మార్కెట్టు అభివృద్ధి పొంది దానితోపాటు, దొంగతనాలు మొదలైన దుష్ప్రవర్తనలుకూడా అల్లుకుపోయినవి. పొగాకుకు డిమాండు మాత్రం విపరీతంగా పెరిగి పోయింది. కాని కొనుగోలు శక్తి తగ్గిపోయి, కరెన్సీ వ్యవహారాలు గందరగోళంగా ఉన్నవి. కాని పొగాకుయొక్క అత్యావశ్యకత ధరలను హెచ్చు స్థాయిలోనే ఉంచగలుగుతున్నది.

<u>చైనా మార్కెట్టు</u>:-యుద్ధానికిపూర్వం చైనా, జపానులు యిండియానుండి ప్రతి సం॥ రం 4 నుండి 6 మిలియన్ల పౌనులపొగాకును దిగుమతి చేసుకుంటుండేవి. యుద్ధకాలంలో వాటి దిగుమతులు 10 మిలియన్ల పౌనులవరకు పెరిగిపోయినవి. యిటీవలనే మనదేశమునుండి చైనాకువెళ్ళిన వర్తకరాయబార నాయకుడు కె. కె. చెట్టూరుగారి రిపోర్టుప్రకారం మనదేశంనుండి 7నుండి 10 మిలియన్ల పౌనుల వరకు దిగుమతులకు అవకాశం ఉందని తెలుస్తున్నది. యిదివరలో చైనాకు మన దేశమునుండి జరిగిన యెగుమతుల్లో ముఖ్యంగా తక్కువ గ్రేడ్లు అయినప్పటికీ, సిగరెట్ పొగాకు పంపబడుతుండేది. ఈ యెగుమతులకు సహాయభూతంగా

ఉండేందుకూ, మారకంలో కలిగే యిబ్బందులను సర్దుకోటానికీ, రాయబార వర్గం రెండు దేశాల బ్యాంకుల్లోను ప్రత్యేకంగా ఖాతాలు పెట్టించే యేర్పాట్లు చేసింది.(16)

మనదేశ మార్కెట్టు:- యుద్ధం ప్రారంభమైన నాటినుండీ మన దేశంలో ఆయేటికాయేడు దేశీయ ఉపయోగంకోసం, సిగిరెట్ పొగాకుకు డిమాండు క్రమక్రమంగా పెరిగిపోయింది. పైగా మధ్యప్రాచ్య, దూరప్రాచ్య యుద్ధరంగాలకు సిగరెట్లు, యితర తయారైన వస్తువులు సప్లయి చేయవలసిన అవసరం రావటంతో, యీ డిమాండు ఇంకా అభివృద్ధి పొందడానికి అవకాశం యేర్పడింది. యుద్ధానికి పూర్వంకంటె అధికంగా యితర దేశాలకు యెగుమతులు వృద్ధిచేసుకోటం ద్వారా యీ అవకాశం చక్కగా వినియోగించుకోబడింది. అమెరికానుండి యుద్ధానికి పూర్వం 4.9 మిలియన్ల పౌనుల పొగాకు దిగుమతులు మాత్రమే జరుగుతుంటే, 1945 లో యిండియాలోకి 16 మిలియన్ల పౌనుల అమెరికా పొగాకు దిగుమతి కావటానికి ప్రధాన కారణం యిదే.(17) కొనుగోలు శక్తి యెక్కువగాయున్న కొన్నివర్గాలనుండి మంచిరకం పొగాకుకుడిమాండు హెచ్చటంవల్ల 1945 సం॥ రం లో కంటేకూడా 1946 లో యెక్కువ అవటానికి అవకాశాలు ఉన్నవి.(18)

దేశానికి నష్టదాయకంగా అధికమవుతున్న దిగుమతులు భారత ప్రభుత్వ దృష్టికి వచ్చాయి. దీనినిగుర్తించిన యిండియన్ సెంట్రల్ టుబాకో కమిటీ కూడా 1946లో అమెరికానుంచి పొగాకు దిగుమతులను శాసనపూర్వకంగా అరికట్టవలసిందని భారత ప్రభుత్వానికి సూచించింది. యిండియన్ సెంట్రల్ టుబాకోకమిటీ నియమించిన టుబాకో యుటిలైజేషన్ అఫీసరు తయారుచేసిన రిపోర్టులో, బ్రిటీష్ ఫ్యాక్టరీ యజమానుల దృష్టిలో అమెరికా పొగాకుకు మన దేశపొగాకుకూ గుణాలలో యేమాత్రం భేదంలేదనీ, విదేశ పొగాకుకంటే దేశీయమైన వర్జీనియా

(16) 'ది యీస్టర్న్ ఎకానమిస్టు' (ప్రత్యేక సంచిక) 3-1-47 నుండి (పేజి 39.)

(17) 'టుబాకో' (ఇంగ్లాండు) ఆగస్టు 46 సంచిక నుండి (పేజి 73.)

(18) „ „ అక్టోబరు 46 సంచికనుండి (పేజి 99.)

పొగాకునే ఉపయోగించుదామనే వాంఛ దేశంలో యెక్కువగా ఉందనీ తెలిపిన మీదటనే యిండియన్ సెంట్రల్ టుబాకో కమిటీ ప్రభుత్వానికి పై సిఫారసు చేసింది. దిగుమతులను అరికట్టడం, యుద్ధానంతరం సిగరెట్ అలవాటు యెక్కువ కావటం, యుద్ధంవల్ల చౌకడబ్బు యెక్కువరావటం యుద్ధం నుంచి తిరిగివచ్చిన వాళ్ళ సంఖ్య దేశంలో పెరిగిపోవడం వీటన్నిటి మూలంగా సిగరెటు పొగాకుకు డిమాండు యెక్కువ అవుతుందనటం నిర్వివాదాంశము. ఇంగ్లండులో పారిశ్రామిక చిక్కులు అధిక పారిశ్రామిక ఖర్చులమూలకంగా ప్రాచ్యదేశాలకు సప్లయిచేయటానికి ఇండియాలోనే ఫ్యాక్టరీలలో తయారైన వస్తువులను అధికంచేసే అవకాశాలుకూడా యీ డిమాండును మరింత అభివృద్ధిచేయగలవు.

ఇటీవలనే రష్యానుంచీ యితర యూరపు దేశాలనుంచీ వచ్చిన డిమాండు మూలకంగా మన దేశపు యెగుమతిదార్ల నిల్వలన్నీ చాలాభాగం అయిపోయినై. దేశీయ ఉపయోగానికై 1947 సీజనులో సిగరెట్ల పొగాకుకు డిమాండు అధికమయ్యే అవకాశాలు చాలా వున్నవి. దేశీయ ఉపయోగానికైన పొగాకు యొక్క డిమాండునూ, ధరలనూ కూడా ఆగ్మార్కు ప్రేడ్లు అమలులోకి వచ్చి క్రమబద్ధంచేసినై.

వ్యవసాయపరిస్థితులు:- యుద్ధకాలంలో అధికధరలు వచ్చినప్పటికీ తగినన్ని యెరువులు, వ్యవసాయపనిముట్లు, ట్రాక్టర్లకు యినపసామానులు (పొగాకు రయితుల విషయంలో) క్యూరింగుకు బొగ్గు, మొదలైన పరికరాల సప్లయి సరిగా లేనందువల్ల, యుద్ధంలోకి, యుద్ధకాలపరిశ్రమల్లోకి మనుష్యులు యెక్కువగాపోయి, కూలీలు తక్కువైన కారణంగా, కూలీ పెరిగినందువల్ల, యుద్ధావసరాలు యెక్కువై జీవితావసరవస్తువులు క్రమంగా దొరకనందువల్ల, బలహీనమైన కంట్రోలుమూలకంగా వస్తువులన్నీ బ్లాక్ మార్కెట్టులోకిపోయి చివరకు తిండీ, గుడ్డ, కూడా దొరకనిపరిస్థితులు ఏర్పడినందువల్ల, యిలాంటి అనేక కారణాలవల్ల యుద్ధకాలంలో అధికధరలు వచ్చినప్పటికీ వ్యవసాయదారుడు క్రమంగా క్షీణించి, యుద్ధకాలంలో వ్యవసాయం చాలాభాగం కుంటుపడిందని చెప్పవచ్చు. క్షణక్షణం పెరిగిపోతున్న జీవిత, కుటుంబఖర్చులను రాబట్టుకోవాలనే తహ తహతో, తనకున్న ఆ చేరెడుభూమిలోనే, తనకు లభించిన ఆ కొద్ది సౌకర్యాలతోనే, యెక్కువ

సంపాదించాలనే ఆదుర్దాలో, అక్షరజ్ఞానమైనాలేని మన వ్యవసాయదారుడు, ఆహార పదార్థాలకొరతను కూడా లెక్కించక, క్రమక్రమంగా వ్యాపారపంటల వైపుకే యెక్కువగా మొగ్గుతున్నాడు. వర్జీనియా పొగాకు ప్రత్యేకతనుబట్టి ఒక బ్యారక్‌కు 10 నుండి 20 యకరాలభూమివరకు కావాలి. సామాన్య రైతుకు ఉండేభూమికంటే యెక్కువే అన్నమాట. పైగా వర్జీనియా పొగాకులో పచ్చిఆకు పండించే రయితుకూ, క్యూరింగుచేసి తయారుచేసే రయితుకు ఆదాయంలో తేడా ఉంటుందని అనుకోటం జరుగుతున్నది. యిన్ని రకాల కారణాలవల్ల భూమికవుళ్ళు విపరీతంగా పెరిగిపోవటం తటస్థించింది. పైగా యుద్ధకాలంలో అధికంగా వచ్చిన చౌక డబ్బు, పల్లెలలోనూ పట్టణాలలోనూ మధ్యతరగతి ప్రజలు కష్టించి పొగాకు పండించే రయితులో బ్యారక్ అద్దెలలోనూ భూమికవుళ్ళలోనూ పోటీచేయడం ప్రారంభించారు. యిసుక నేలపైన తీరప్రాంతాలలోసైతం వేసిననారు బ్రతుకుతుందో బ్రతుకదో చెప్పడానికి వీలులేనంత అపనమ్మకంగా ఉన్నందువల్ల నారుధర విపరీతంగా పెరిగిపోవటం, రైతుల ఋణభారం హెచ్చటం మొదలైన యిబ్బందులు కలుగుతున్నవి, నారు విషయంలో యీసీజనులో (1947) యిదేవిధంగా జరిగింది. యిలాంటి పరిస్థితులవల్ల ఉత్పత్తిఖర్చులు పెరిగినవి. పైనవివరించిన యిబ్బందుల వల్ల యకరం 1 కి సగటుపంట తగ్గిపోయింది. 1942 సంవత్సరంనుండి యీనాటి వరకుఉన్న గడ్డుపరిస్థితుల మూలకంగానూ (ముఖ్యంగా పొగాకుపంటవిషయంలో) పొగాకుకు మహమ్మారివంటి మల్లె విపరీతంగా వ్యాపించటంవల్లనూ పంట చాలా వరకు క్షీణించిపోయింది. పంట యీరకంగా తగ్గిపోవటం, ఉత్పత్తిఖర్చులు రెట్టుకురెట్లు పెరగటం, ధరలు నిలకడగా వుంటవనే నమ్మకం లేకపోవటం, ఇవన్నీ కూడా కనీసధరల నిర్ణయ ఆవశ్యకతను వేనోళ్ళ చాటుతున్నవి. పైగా జాతీయ అంతర్జాతీయ మార్కెట్లకు మనసరుకుపోయే అధికఅవకాశాలు కనీసధరలకు అనుకూలిస్తున్నవి. మార్కెటు అవకాశాలు ఉన్నందువల్ల కనీసధరలు వ్యాపారులకు సైతం యేమాత్రం వ్యతిరేకఫలితాలను చేకూర్చవు.

—:o:—

# నాల్గవ భాగము.

## గుంటూరు జిల్లాలో వివిధప్రాంతాలలో వివిధరకాల పొగాకు ఉత్పత్తి ఖర్చులు, పంట వివరాలు.

గుంటూరుజిల్లాలోని వివిధ తాలూకాల్లో పొగాకు పంట విస్తీర్ణాన్నిగురించి ఈనాటి ఖచ్చితమైన లెక్కలు లేకపోయినప్పటికీ, 1941-42 లో పొగాకు సాగు అయిన విస్తీర్ణం, యీ క్రింద కనుపరచిన పట్టి కనుబట్టి, పొగాకు యెంత ప్రజామోదకరంగా వివిధ తాలూకాల్లో వ్యాపించిందో తెలుసుకోవచ్చును.

| తాలూకా | యకరాలలో విస్తీర్ణము | | |
|---|---|---|---|
| | వర్జీనియా. | నాటు. | మొత్తం. |
| గుంటూరు | 34, 376 | 14,701 | 49,077 |
| బాపట్ల | 27,483 | 14,436 | 41,919 |
| ఒంగోలు | 15, 445 | 11,262 | 26,707 |
| నరసరావుపేట | 5,470 | 15,785 | 21,255 |
| సత్తెనపల్లి | 3,131 | 8,860 | 11,991 |
| తెనాలి | 1,174 | 330 | 1,504 |
| పల్నాడు | 4 | 1,140 | 1,144 |
| వినుకొండ | 66 | 876 | 942 |
| రేపల్లె | ... | 473 | 473 |
| మొత్తం | 87,149 | 67,863 | 1,55,012 |

వివిధ తాలూకాలలో ప్రత్యేక గుణాలను బట్టియేర్పడిన వివిధమండలాలు పేజి (123) లో చూపబడినవి.

రెండు ముఖ్యమైన మండలాలకు ఉత్పత్తి ఖర్చులలో యీక్రింది విధంగా వ్యత్యాసం ఉంటుంది :

| తాలూకా | మెట్టభూమి | బాడవ |
|---|---|---|
| గుంటూరు. | రు. 507 | రు. 564 |
| బాపట్ల. | 436 | 552 |
| ఒంగోలు. | 461 (మందవుభూములు) | 483 (దక్షిణప్రాంతం, తేలిక భూముల సగటు) |
| నరసరావుపేట. | 537 | |
| రేపల్లె. | | 469 |
| సగటు | 485 | 517 |

యీ 1 కి సగటు పంట. గ్రేడ్ శాతములు, వివిధ గ్రేడ్లలో దిగే పొగాకు విలువ మొ॥నవి యీ దిగువ చూపబడినవి.

## ఫ్లూక్యూర్డు వర్జీనియా స్థానిక గ్రేడులు.

| వివరములు | 1 | 2 | 3 | 5 | యల్.జి. | డి.జి. | పి.యల్. | బిట్సు. | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| మొట్టభూమి శాతములు | 8.5 | 17.5 | 25.5 | 18 | 12.5 | 10 | 6 | 2 | 100 |
| ఎ1కి స॥ పంట 675 పౌను॥లో | 57.4 | 118.1 | 172.1 | 121.5 | 84.4 | 67.5 | 40.5 | 13.5 | 675 |
| | రు | రు | రు | రు | రు | రు | రు | | |
| పౌ1కి | 0-14-3 | 0-8-3 | 0-7-9 | 0-3-2 | 0-8-8 | 0-2-4 | 0-3-0 | 0-1-4 | |
| పౌ॥ విలువ | 51-3-3 | 60-13-6 | 83-5-0 | 24-0-9 | 45-12-3 | 9-13-6 | 7-9-6 | 1-2-0 | 283-11-9 |

ఉత్పత్తిదారుకు య 1 కి డొల్లింపున సగటు అమ్మకం రు 337- 8-0

డొల్లింపుఅమ్మకానికి గ్రేడుచేసిన అమ్మకానికి భేదం రు 53-12-0

| వివరములు | 1 | 2 | 3 | 5 | యల్.జి. | డి.జి. | పి.యల్. | బిట్సు. | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ఖాడవ శాతం | 20 | 24 | 25 | 6 | 10 | 8 | 5 | 2 | |
| ఎ1కి స॥ పంట650 పౌ॥లో | 130 | 156 | 152.5 | 39 | 65 | 52 | 32.5 | 13 | |
| పౌ॥1కిరు | 0-14-3 | 0-8-3 | 0-7-9 | 0-8-2 | 0-8-3 | 0-2-4 | 0-3-0 | 0-1-4 | |
| పౌ॥ విలువ | 115.12.6 | 80-7-0 | 78-11-6 | 35-3-3 | 7-9-0 | 6-1-6 | 1-1-3 | | 332-8-6 |

ఉత్పత్తిదారునకు య1కి డొల్లింపున సగటు అమ్మకం రు. 425-0-0

డొల్లింపు అమ్మకానికి గ్రేడు చేసిన అమ్మకానికి భేదం 92-0-0

దీనినిబట్టి చూస్తే వర్జీనియా పొగాకు రైతు యు1కి యీ క్రింది విధంగా నష్టపడుతున్నాడనేది తెలుస్తుంది.

| వివరాలు | మెట్టభూమి | బాడవ |
|---|---|---|
| యు1కి ఉత్పత్తి ఖర్చులు. | రు. 485 | రు. 514 |
| గ్రేడ్లనుబట్టి పొగాకు విలువ | 284 | 332 |
| డొల్లింపున యు1కి సగటు అమ్మకం | 337 | 425 |
| గ్రేడ్ చేసి అమ్మినపుడు వచ్చేనష్టం (ఉత్పత్తి ఖర్చుల్లో అమ్మకం తీసివేస్తే) | 201 | 182 |
| గ్రేడ్ చేయకుండా అమ్మినపుడు వచ్చేనష్టం | 148 | 89 |

మెట్ట ప్రదేశాలలో ఎకరానికి పండే సగటు పంటను గురించి ఆలోచించేటప్పుడు, ఒక్క పసుమర్రు గ్రామం లెక్కలు మాత్రమే తీసుకోనలేదు. గోరంట్లవారిపాలెం మీటింగుకు వచ్చిన ఉత్పత్తిదారులు, ఆ ప్రాంతంలో ఎకరానికి 650 పౌనుల ఫ్లూక్యూర్డు వర్జీనియా పండుతుందని చెప్పారు. ఈ పై లెక్కలు, గుంటూరు, బాపట్ల, ఒంగోలు మూడుతాలూకాల్లో ఎకరానికి సగటుపంట(680పౌ),యీరెంటిని విచారించి, మెట్టపొలాలలో ఎకరానికి సగటున 675 పౌనులుగా లెక్క కట్టబడినది.

బాడవ భూములు (Submergeable) ఎకరపు సగటు పంటను నిర్ణయించే సందర్భంలో రేపల్లె తాలూకాలోని లంకభూముల్లోవలె ఎకరానికి 500 పౌనులు లెక్కలు సవరించవలసివస్తుందని-అనుకున్నంతకంటె కొంచెంతక్కువ పండటంవల్ల-కనిపిస్తున్నది. కనుక గుంటూరు, బాపట్ల, ఒంగోలు తాలూకాలలోని బాడవ భూములకు సగటున ఎకరానికి 675 పౌనుల బదులు 650 పౌనులుగా నిర్ణయించబడినది.

విచారణ సందర్భంలో కొంతమంది ఉత్పత్తిదారులు, పొగాకును గ్రేడ్ చేయడంవల్లను, మొత్తంగా అమ్మినప్పుడువచ్చే ఆదాయాలలోని భేదానికి యీ క్రింది కారణాలు వెలిబుచ్చారు.

1. పురిబరువు
2. చెమ్మ తగ్గిపోవడం
3. కొంతమంది ఎగుమతిదారులు చిన్నవ్యాపారికి ధరమీదరావలసిన

వడ్డీనికూడా అసలుధరకుకలిపి ధర కట్టడంచేత

4. ప్లాట్‌ఫారంమీద కొనే పెద్దవ్యాపారసంస్థలు (Firms) ఉత్పత్తిదారుని కంటె చిన్నవ్యాపారికి ఎక్కువధరలు ఇచ్చే అలవాటుండడంచేత చిన్న వ్యాపారి ఎక్కువ ధరలుపొందడంవల్ల అతడు గ్రేడ్ చేసినదానికంటె తీసుకొనేదానికి ఎక్కువ ధరలు యిచ్చేస్థితిలో వున్నాడు.

5. గ్రేడ్ చేయకుండా అమ్మేవారు ధరలు కొంచం ఎక్కువ పలికేవరకు కొన్ని రోజులు ఎక్కువగా పొగాకును దాచిపెడతారు.

ఈ పరిస్థితులలో గ్రేడ్ చెయ్యాలనే ఉత్సాహం ఉత్పత్తిదార్లలో రానురాను తగ్గిపోతున్నది.

<u>నాటుపొగాకు</u> : వివిధ మండలాల్లో పండే నాటుపొగాకు వివిధగుణాలు గలదై అనేకరకాలుగా వాడుకోటానికి పనికివస్తుంది. ఉదా: నములుట, చుట్టలు, పైపులు, సిగరెట్లు మొ. ఆయా మండలాల పొగాకు ఏయే వాడుకకు ఉపయోగపడుతుందో—ఉదా: సత్తెనపల్లి పొగాకు చుట్టలకు, యింకొల్లు పొగాకు నమలుటకు, బాపట్ల ఉత్తర ప్రాంతం పొగాకు పైపులకు, సిగరెట్లకూ, ప్రత్తిపాడు, గొట్టిపాడు పొగాకు నమలుటకూ, చుట్టలకూ—యీ ప్రక్క పేజీలో చూపబడింది.

| తాలూకా | నాటుపొగాకు మండలము | ముఖ్యమార్కెట్లు |
|---|---|---|
| గుంటూరు | వాయవ్య ప్రాంతం - రావెల, విశదల, పేరేచర్ల, నైరృతి ప్రాంతం - ప్రత్తిపాడు, గొట్టిపాడు | బరంపురం, కావలి, విజయనగరం, సామర్లకోట. |
| బాపట్ల | ఉత్తరప్రాంతం — తుర్లపాడు, వరగాని, (పైపు–సిగరెట్ పొగాకు); దక్షిణ ప్రాంతం - ఇంకొల్లు. | దేశీయవిదేశీయ మార్కెట్లు; పన్రూటి, తిండివనం, మద్రాసు. |
| ఒంగోలు | తూర్పుప్రాంతం—తిమ్మసముద్రం, ఉప్పుగుండూరు మొ॥ | కావలి, కందుకూరు, పర్లపల్లి |
| | పశ్చిమప్రాంతం. | స్థానికంగా వాడుకకు. |
| నర్సరావుపేట | చిలకలూరిపేట ఉత్తరప్రాంతం-కావూరు, లింగంగుంట; చిలకలూరిపేట దక్షిణప్రాంతం-రాజుపాలెం, పూనూరు మొ॥ | గిద్దలూరు, కంభం, మార్కాపురం, కనిగిరి, కావలి, గుంటూరు జిల్లా. |
| సత్తెనపల్లి | ఉత్తరప్రాంతం- దక్షిణప్రాంతం-మేడికొండూరు. | సామర్లకోట, కావలి మధుర, చిదంబరం, నాపడా. |
| తెనాలి | పాటిపొగాకుప్రాంతం — చేబ్రోలు. | గుంటూరుజిల్లా. |
| పల్నాడు | సామాన్యరకం. | స్థానికంగా వాకడుకు |
| వినుకొండ | ,, | ,, |
| రేపల్లె | లంకప్రాంతం, పసర్లంక, పెదలంక. | మధుర, మాయవరం తిరుచునాపల్లి, బారువ |

వాడుకనుబట్టి ఎండగట్టిన పొగాకును మండెమీదనే రైతు నీళ్లుచల్లి పదునుచేస్తాడు. యిది చుట్టలు, నమిలే పొగాకుకు వర్తిస్తుంది. స్థానిక వర్తకులు దీన్ని తిరిగిపదును చేస్తారు. య 1కి ఉత్పత్తి ఖర్చులు, పంట, అమ్మకం మొదలైనవి యీ క్రింద యీయబడినవి.

## నాటుపోగాకు : ఉత్పత్తి ఖర్చులు : పంట

| | గుంటూరు తాలూకా | | బాపట్ల తాలూకా | ఒంగోలు తాలూకా | | నర్సరావుపేట తాలూకా | | సత్తెనపల్లి తాలూకా | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | వాయవ్య ప్రాంతం | నైరుతి ప్రాంతం | దక్షిణ ప్రాంతం | పశ్చిమ ప్రాంతం | తూర్పు ప్రాంతం | చిలకలూరిపేట ఉత్తర ప్రాంతం | చిలకలూరిపేట దక్షిణ ప్రాంతం | ఉత్తర ప్రాంతం | దక్షిణ ప్రాంతం | సగటు |
| | రు | రు | రు | రు | రు | రు | రు | రు | రు | రు |
| 1. కవులు | 130 | 120 | 125 | 30 | 150 | 60 | 200 | 50 | 80 | 105 |
| 2. దున్నటం కూలి | 50 | 25 | 35 | 36 | 55 | 23 | 50 | 40 | 40 | 39 |
| 3. యెరువు | 30 | 65 | 110 | 84 | 85 | 67 | 112 | 60 | 100 | 80 |
| 4. నారు | 20 | 15 | 20 | 15 | 20 | 5 | 20 | 20 | 25 | 18 |
| 5. నాటు | 9 | 6 | 10 | 11 | 15 | 6 | 13 | 12 | 10 | 10 |
| 6. కలుపుమల్లె | 17 | 8 | 20 | 20 | 15 | 5 | 25 | 10 | 15 | 15 |
| 7. కొమ్మకొట్టటం | 7 | 8 | 8 | 8 | 12 | 5 | 14 | 10 | 10 | 9 |
| 8. కోతగుచ్చటం | 8 | 8 | 12 | 10 | 16 | 14 | 20 | 12 | 15 | 13 |
| 9. పురికొన | 3 | 4 | 5 | 5 | 5 | 3 | 8 | 6 | 5 | 5 |
| 10. పాకలు, పందిళ్లు | 12 | 10 | 5 | 6 | 17 | 5 | 18 | 13 | 10 | 11 |
| 11. మండెవేయుటం | 8 | 7 | 6 | 4 | 13 | 6 | 6 | 8 | 5 | 7 |
| 12. చెక్కులుకట్టటం | 5 | 5 | 4 | 4 | 4 | 4 | 8 | 5 | 4 | 5 |
| 13. సాదరుఖర్చులు | 16 | 20 | 35 | 22 | 15 | 12 | 15 | 15 | 20 | 19 |
| మొత్తం | 315 | 301 | 395 | 255 | 432 | 215 | 509 | 261 | 339 | 336 |
| య 1 కి సగటు | | | | | | | | | | |
| పంట పౌ॥ | 760 | 750 | 875 | 729 | 750 | 800 | 1000 | 750 | 750 | 796 |
| య 1కి ఆదాయం రు | 175 | 145 | 194 | 160 | 180 | 176 | 270 | 170 | 180 | 183 |
| య 1 కి నష్టం రు | 140 | 156 | 201 | 95 | 252 | 39 | 239 | 91 | 159 | |

పైనవివరించిన సంఖ్యలు యీ క్రింది విషయాలను ఋజువుచేస్తున్నవి :

| | |
|---|---|
| యకరం 1 కి సగటు ఉత్పత్తి ఖర్చులు | రు 336 |
| యకరం 1 కి సగటుపంట (పౌనుల్లో) | 796 |
| యకరం 1 కి సగటున మొత్తం అమ్మకం | రు 183 |
| యకరం 1 కి సగటునష్టం | రు 153 |

## 1946–47 పొగాకుపంట

యీసంవత్సరం పంట, యిటీవలి అధికవర్షాల వాతావరణంవల్ల చాలా దెబ్బతిన్నది. రెండుసార్లు, మూడుసార్లు నాటువేయవలసివచ్చి, అందువలన నారు వెల యింతకుముందెన్నడూ లేనంతగా విపరీతంగా పెరిగి షుమారు 6000 మొక్కల వెల రు 150 లు నుండి రు 200 ల వరకు (వర్జీనియా) కూడా పోయింది.

చాలా రోజుల క్రిందటి నారు అవటం మూలంగానూ, నారు వేసేటప్పుడు నేల అదనులో లేనందువల్లనూ, యితర ప్రతికూల పరిస్థితులవల్లనూ, నారు సరిగా మళ్ళలో అభివృద్ధిచెందని కారణంచేతనూ, అనేకప్రాంతాల్లో పొగ మొక్కలు సరిగా పెరగలేదు. ముఖ్యంగా ఒంగోలు తాలూకాలో యిలా జరిగింది. పైగా ఆకులను తినే పురుగు మూలకంగా, పంట యింకా తగ్గిపోవచ్చునని అంచనా వేయబడుతున్నది. ఉత్పత్తి ఖర్చులలో కలిగిన పెరుగుదల, అంచనా వేయబడిన తక్కువపంట, వివరాలు యీ క్రింద యివ్వబడినవి.

| | ఫ్లూక్యూర్డ్ వర్జీనియా పొగాకు. | నాటు పొగాకు. |
|---|---|---|
| యకరం1కి సగటు ఉత్పత్తి ఖర్చులు | రు. 499 | రు. 336 |
| భూమి కవులులో పెరుగుదల | 25 | 20 |
| దున్నకం ,, | 10 | 15 |
| నారు ,, | 75 | 10 |
| నాటు ,, | 10 | 5 |
| కోస ,, | 6 | 3 |
| బొగ్గు ఖరీదు, కూలి (మొత్తంమీద) | 15 | 11 |
| 1946-47 పంటకు యం1కి మొత్తం ఉత్పత్తి ఖర్చులు | రు. 640 | రు. 400 |
| అంచనా వేయబడిన పంట (ఎ1కి పౌనులలో) | 450 పౌ. | 550 పౌ. |
| పుట్టి 1కి అంచనా వేయబడిన ఉత్పత్తి ఖర్చులు (మామూలు రకం) | రు. 711 | రు. 363 |

ఈ సందర్భములో ఒక విషయం చెప్పాలి. ఉపసంఘం వెళ్ళిన ప్రదేశాల్లో చాలాచోట్ల రైతులు, సెంట్రల్ ఎక్సైజ్ (పొగాకు) యాక్టువల్ల అయ్యే ఖర్చులు కూడా, పొగాకు పండించే ప్రతి ఎకరానికయ్యే ఖర్చులను నిర్ణయించేటప్పుడు ఆలోచించాలని చెప్పారు. కనుక ఈ ఉపసంఘం ఈ విషయాన్ని గురించి, గవర్నమెంటుచే నియమించబడిన ఒక ప్రత్యేక ఉపసంఘం విచారించాలని అభిప్రాయపడుతున్నది.

# ఐదవ భాగము.

## మార్కెట్ అభివృద్ధి సూచనలు.

వినిమయదారుడికి తయారైన వస్తువులు ప్రత్యక్షంగా అందించేది వర్తకుడు కాబట్టి, కనీసధరలను నిర్ణయించే సందర్భములో, ఆ వ్యవసాయపంట యెంతవరకు అమ్ముడుపోతుంది అనే విషయం ప్రధానంగా ఆలోచించవలసి వుంటుంది. జీవితావసర వస్తువుల విషయంలోనూ, ప్రత్యేకంగా బాగాపండే యితరవస్తువుల విషయంలోనూ, పంటకు అమ్ముడుపోయే మార్గాలు కావలసినన్ని లేని సమయాల్లో ప్రభుత్వంవారు సబ్సిడీలుయిచ్చే అవకాశాన్ని గురించి తప్పక ఆలోచించాలి. కాని పొగాకుకు దేశీయవిదేశీయ మార్కెట్ పరిస్థితులు అనుకూలంగానే ఉన్నవని మూడవ భాగంలో తెలియపరచబడింది.

1946 సం॥ లో ఉన్న మార్కెటు పరిస్థితులనుబట్టి ఫ్లూక్యూర్డు వర్జీనియా పొగాకు నిల్వలు రైతులవద్దనుండీ వర్తకులవద్దనుండీ విడుదలైనవి. నాటు పొగాకు విషయంలో మాత్రం, రైతులవద్ద యెక్కువ నిల్వలు లేక పోయినప్పటికి వర్తకుల చేతుల్లోనుంచి యెక్కువ నిల్వలు విడుదలకాలేదు. ధరల విషయంలోనూ, అమ్మకునే అవకాశాల్లోనూ, యెక్కువగా అంచనాలు వేసుకొన్న యెగుమతిదారుల చేతుల్లో సరుకు నిల్వలన్నీ కేంద్రీకరింపబడి నిలబడి పోయినవి. యూరపు రాజ్యాల మార్కెట్లకు యెక్కువ పొగాకును సప్లైచేయాలని విదేశీయ దిగుమతిదార్లు వేసుకున్న ప్లానులవల్ల, యిండియా పొగాకు చైనాకు యెగుమతిచేసే సందర్భంలో ప్రోత్సాహం యిస్తున్న చెట్టూర్ స్కీమువల్ల, యిప్పుడు యెగుమతిదార్ల వద్దనున్న నిల్వలన్నీ లాభదాయకంగా విడుదలయ్యే సూచనలు ఉన్నవి.

ఫ్లూక్యూర్డ్ వర్జీనియా పొగాకు:- 1946 సంవత్సరంలో యింగ్లండు మార్కెట్‌లో ఆగ్‌మార్కు చేసిన పొగాకుకు ధరలు యీక్రింది విధంగా ఉన్నవి.

| క్రేడ్రుచేసిన ఫ్లూక్యూర్డు వర్జీనియా పొగాకు ముక్కలు | పౌ 1 కి పెన్సీలు | సగటు (పెన్నీలలో) | ఖర్చులు కమీషన్ (పెన్నీలలో) | నిలువ | (దానికి సరిపోయే ఇండియా నాణెములలో) |
|---|---|---|---|---|---|
| ఆగ్‌మార్కు నెం.1 | 44 – 46వ॥ | 45 | 5 | 40 | రు. 2– 3–0 |
| నెం. 2 | 40 – 42 | 41 | 5 | 36 | 1–15–3 |
| నెం. 3 | 36 – 38 | 37 | 5 | 32 | 1–11–6 |
| నెం. 4 | 32 – 34 | 33 | 4 | 29 | 1– 9–6 |

మారకపు విధానములవల్ల, అవి లండన్ బ్రోకర్ల చేతులలో ఉన్నందువల్ల మన పొగాకుకు లండన్ బ్రోకర్లద్వారానే యితరయూరపు రాజ్యాలు పై ధరల కంటే యెక్కువ ధరలనే యిచ్చినవి. లండనులోని బ్రోకరు కమిషన్ చార్జీలు తీసివేసి యింగ్లండులోని ధరలను మన నాణెములకు మార్చుకొని చూసుకున్నప్పటికీ 1946 లో గుంటూరు మార్కెటులో ఉన్న యీక్రింది ధరలకంటే అవి యెక్కువగానే ఉన్నవి.

| ఆగ్‌మార్కు గ్రేడు | 1946లో గుంటూరుమార్కెటులోని సగటు ధర | న్యాయమైన లాభము | న్యాయమైన వడ్డీ | ప్రాశెసింగులో పోయిన తరుగుల విలువ | యెస్టాబ్లిష్‌మెంటుసహా అన్ని యితర ఖర్చులు | పౌ॥ 1కి యివ్వవలసిన ధర | 500 పౌనుల పుట్టి 1కి యివ్వవలసినధర | సబ్ కమిటీ సూచించిన కనీస ధరలు |
|---|---|---|---|---|---|---|---|---|
| **రీడ్రైచేసిన స్ట్రిప్సు :-** | | | | | | | | |
| | | | | | | | రు. | రు. |
| సెం. 1 | రు. 2-2-0 | 0-4-0 | 0-2-0 | 0-5-3 | 0-1-6 | 1-5-3 | 664 | 800 |
| 2 | 1-14-6 | 0-4-0 | 0-2-0 | 0-4-9 | 0-1-6 | 1-I-3 | 539 | 650 |
| 3 | 1-11-0 | 0-3-0 | 0-1-6 | 0-4-3 | 0-1-6 | 1-0-9 | 523 | 625 |
| 4 | 1-7-6 | 0-3-0 | 0-1-6 | 0-3-9 | 0-1-6 | 0-13-9 | 430 | 520 |
| **రీడ్రై చేయని ఆకు :-** | | | | | | | | |
| యల్ బిఫై. 1 | 0-12-3 | 0-1-6 | 0-0-9 | 0-0-4 | 0-0-8 | 0-9-0 | 281 | 360 |
| ,, ,, 2 | 0-10-3 | 0-1-6 | 0-0-9 | 0-0-4 | 0-0-8 | 0-7-3 | 226 | 300 |
| యల్. జి. | 0-12-6 | 0-1-6 | 0-0-9 | 0-0-4 | 0-0-8 | 0-9-3 | 289 | 375 |
| యల్. యం. జి. | 0-9-9 | 0-1-0 | 0-0-6 | 0-0-4 | 0-0-8 | 0-7-3 | 226 | 300 |
| డి. జి. | 0-5-6 | 0-0-9 | 0-0-3 | 0-0-3 | 0-0-7 | 0-3-8 | 115 | 150 |
| బి. | 0-8-0 | 0-1-0 | 0-0-6 | 0-0-3 | 0-0-7 | 0-5-8 | 177 | 230 |
| డి. బి. | 0-7-0 | 0-0-9 | 0-0-6 | 0-0-3 | 0-0-7 | 0-4-11 | 154 | 200 |
| బి బి. 1 | 0-8-0 | 0-1-0 | 0-0-6 | 0-0-3 | 0-0-7 | 0-5-8 | 177 | 230 |
| బి. బి. 2 | 0-6-0 | 0-0-9 | 0-0-3 | 0-0-3 | 0-0-7 | 0-4-2 | 130 | 170 |
| పి. యల్. | 0-4-6 | 0-0-6 | 0-0-3 | 0-0-3 | 0-0-7 | 0-2-11 | 91 | 120 |

ఆగ్‌మార్కు చేసిన ఆకు విలువలను దృష్టిలో ఉంచుకోని, స్థానిక గ్రేడ్లకు యీ క్రింది కనీసధరలను సూచిస్తూ గుంటూరు టుబాకో మార్కెటు కమిటీ జనరల్ బాడీ సమావేశంలో తీర్మానింపబడింది. 1947 సంవత్సరానికి అభివృద్ధి

కరమైన మార్కెటు పరిస్థితులనూ పెరిగిపోయిన ఉత్పత్తి ఖర్చులనూ, దృష్టిలో పెట్టుకొని, సబ్ కమిటీ రిపైజుచేసిన స్టాండర్డు గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీ గ్రేడ్ల ఆధారంతో సూచించిన కనీసధరలు యీదిగువ యివ్వబడినవి.
(అనుబంధం 7 చూడుడు)

కనీసధరలు (500 పౌన్ల పు 1 కి రూపాయలలో)

| స్థానిక గ్రేడ్లు | గుం. టు. మా. కమిటీ జనరల్ బాడీ సూచించిన రేట్లు | సబ్ కమిటీ సూచించిన రేట్లు | రిమార్కులు |
|---|---|---|---|
| 1 | రు 575 | రు 690 | |
| 2 | 450 | 540 | |
| 3 | 390 | 470 | |
| యల్. జి. | 325 | 400 | |
| 5 | 160 | 250 | |
| డి. జి. | 125 | 175 | |
| పి. యల్. | 50 | 70 | |
| బి. యల్. | ... | 400 | |

జనరల్ బాడీచే సూచించబడిన కనీసధరలకు, పోయినసీజన్ నాటిమార్కెట్ రేట్లు, క్రితం రెండు సంవత్సరాలలో అయిన ఉత్పత్తి ఖర్చులు ఆధారం. కాని ఉపసంఘము యీ సీజన్ లోని మార్కెట్ పోకడను, ఈ సంవత్సరం అయిన హెచ్చు ఉత్పత్తి ఖర్చులను విచారించి స్థానిక, ఎగ్మార్కు గ్రేడ్లకు పై జెప్ప బడిన కనీసధరలను నిర్ణయించినది.

ఎండు వర్జీనియా :-- శ్రీ శ్రేష్టిగారు తమ పుస్తకంలో యిచ్చిన లెక్కల నిర్ణయాలతో మేము సంపూర్ణంగా యేకీభవిస్తూ, 1945-46 పంటకు వారిచే తేల్చబడినధర పుట్టి 1 కి రు 170 లు మీద నూటికి 32 వంతులు హెచ్చుగా,

అంటే పుట్టి 1 కి ధర రు 225 లు నిర్ణయించటానికి మేము అంగీకరిస్తున్నాము. యిండియాలో జట్టీ, అమెరికాలో మేరీలాండ్ పొగాకు పౌ 1 కి ఒక డాలరు ఖరీదుకు అమ్మిన కారణంచేత, అంటే తేలిక అయిన ఎండు వర్జీనియా ధరలు విపరీతంగా పెరిగినందువల్ల యీపైన సూచించిన ధర న్యాయమైనదేనని మేము అభిప్రాయపడుతున్నాము.

| ఆయా గ్రేడ్లకు ఉపసంఘం సిఫార్సుచేసిన కనీసధరలు | గ్రేడ్ చేయబడిన పొగాకు | | | | రిడ్రై చేయబడిన స్ట్రిప్స్ | | |
|---|---|---|---|---|---|---|---|
| | రు | అ | పై | | రు | అ | పై |
| ఆగ్మార్కు నెం. 1 (బ్రైట్) పౌ 1కి | 0 | 9 | 6 | పౌ 1కి | 0 | 14 | 0 |
| ,, నెం.2 రు (లైట్ బ్రౌన్),, | 0 | 8 | 6 | ,, | 0 | 12 | 0 |
| ,, నెం.3రు (డార్కు బ్రౌన్),, | 0 | 7 | 6 | ,, | 0 | 11 | 0 |
| ముక్కలు (దెబ్బతిన్నది) ,, | 0 | 2 | 0 | ... | | ... | |

<u>నాటుపొగాకు</u> :— మేము జిల్లాలో పర్యటనచేసిన సందర్భంలో ని అనుభవాలను పురస్కరించుకొని, నాటుపొగాకు ఉత్పత్తిదారుడు తను పెట్టిన 'పెట్టుబడిలో రు 1కి 0–8–9 మాత్రమే తిరిగి పొందగలుగుతున్నాడనీ, యిందుకు ముఖ్య కారణం, నాటుపొగాకు వర్తకులు, దేశీయ విదేశీయ మార్కెట్లను అందుకోని, తగినంతగా వ్యాప్తి చెందలేకపోవటమేననీ గ్రహించ గలిగాము. అందువల్ల గుంటూరు మార్కెటులో ఉన్న ధరల ఆధారముతో మొదట్లో రు 135 ల తక్కువ ధరను మాత్రమే నిర్ణయించటం జరిగింది. అప్పటికి అది సరియైనదేనని మా అభిప్రాయము.

కాని నాటుపొగాకు భవిష్యత్తు గుంటూరు మార్కెట్‌లో ఉన్నంత హీనంగా లేదు. విజయనగరం ప్రాంతంలోని చుట్టపొగాకు పు1కి రు360 లు ధరఉంటే, సత్తెనపల్లి చుట్టపొగాకు పుట్టి 1కి రు 600 లలో 3వ వంతు అంటే రు 120లు ఖరీదు ఉంది. అదేవిధంగా యితర ప్రాంతాలలో పండే, నమిలే పొగాకు పుట్టి 1 కి

రు275 లు సగటున అమ్ముతుంటే, అంత మంచిగుణాలు కలిగిన యింకొల్లు నమిలే పొగాకు 1946 లో దానిలో సగం ధరకే అంటే రు 130 లు మాత్రమే అమ్మింది.

(అనుబంధం 5 చూడుడు.)

| | | |
|---|---|---|
| మంగుళూరు | రు | 465 |
| మీనంపాళెయం | | 240 |
| తిరుపూరు ఫ్లైర్ క్యూర్డు | | 235 |
| ,, పిట్ క్యూర్డు | | 155 |
| సగటు | రు | 275 |

విచారణ సందర్భంలో యింకొక విషయంకూడా తెలిసింది. నాటుపొగాకును త్వరగా పదునుచేసి, వినిమయ దారులకు అమ్మితేవచ్చే ధర ఎక్సైజ్ పన్నుపోను, పండించే రయితుకు వచ్చేధరకు రెండింతలు ఉంటుంది.

రొడీసియాలోని ఫ్లైర్ క్యూర్డ్ పొగాకు పు1కి రు. 441 లు అమ్ముతున్న దని (యింకొల్లు పొగాకు లాంటిదే) 3 వ భాగంలో తెలియపర్చబడింది. నాటుపొగాకువంటివే అయిన అమెరికాలోని ఫ్లైర్ క్యూర్డ్ గ్రీన్ రివర్, ఒకనసకన్ పొగాకులు, పుట్టి 1 కి రు. 375 లు, రు. 414 లు వరకు అమ్ముతున్నవి. ఈ పరిస్థితుల్లో మన నాటుపుగాకుకు రు. 200 లు ధర నిర్ణయించడం న్యాయమేనని మేము అభిప్రాయ పడుతున్నాము.

# ఆరవ భాగము.

## కనీస ధరలు అమలుపరచవలసిన విధానము.

ఒక అభివృద్ధికర విధానము యివ్వగల అధికఫలితాలనుబట్టి దానిని గురించిన ప్రచారం ఆధారపడి ఉంటుంది. చాలా కాలంనుండి వ్యవసాయ పంటలకు ఒక నిర్ణీత స్థాయిని తేగలదనీ, ధరలవిషయంలో స్పష్టంచేయగలదనీ, గ్రేడింగు ఒక అభివృద్ధికర విధానంగా పరిగణింపబడుతున్నది. కాని గ్రేడింగు అంటే మామూలుగా రైతులకు వ్యతిరేక అభిప్రాయం కలగటానికి ముఖ్య కారణం, రైతులపంటలకు, రైతులు చేసిన శ్రమకూ ఉచితమైన ప్రతిఫలంరాక పోవడమే. పైగా తన పంటకు కనీసం యెంతవస్తుందోనని, తెలుసుకోటానికైనా కనీసధరల నిర్ణయంకూడా లేక పోవడంకూడా ఒక ప్రధానకారణమే. కనీస ధరలు రైతుకు ఆకర్షణీయంగా లేక పోయినప్పటికీ, తగినంత ప్రతిఫలం కలిగించేవిగా ఉండాలి.

మొట్ట మొదటిసారిగా 1947 లో యీ జిల్లాలో యిప్పుడున్న వ్యాపార సౌకర్యాల నాధారంచేసుకొని, కనీసధరలను అమలుపరచడానికి యీ క్రింద వివరించిన విధానం సూచింపబడుతున్నది.

ముఖ్యమైన పెద్ద కంపెనీలకు అనుగుణ్యంగా, యింతకు పూర్వం గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీ నిర్ణయించిన 'గుంటూరు గ్రేడ్లు' అని పిలువబడే స్థానిక గ్రేడ్ల (రాష్ట్ర ప్రభుత్వంకూడా ఆమోదించింది.) ద్వారానే రైతు తన పొగాకును గ్రేడ్ చేసుకోవాలి. గ్రేడ్ చేసిన తన పొగాకును అమ్మకానికి తెచ్చినప్పుడు రైతు యిది ఫలానా గ్రేడ్ అని చెప్పుతాడు. కొనుగోలుదారు ఆ గ్రేడ్‌కు యిష్టపడినట్లయితే దానికి నిర్ణయించిన కనీసధరకంటే తక్కువగాని ధరను రైతుకు చెల్లించవలసి యుంటుంది. గ్రేడ్ విషయంలో రైతుకూ, కొనుగోలుదారుకూ మధ్య పేచీవచ్చినట్లయితే, వెంటనే స్థానిక గ్రేడింగ్ యిన్‌స్పెక్టరుకు నివేదించుకోవలసి ఉంటుంది. (స్థానిక గ్రేడింగ్ ఇన్‌స్పెక్టర్లను, రాష్ట్ర

ప్రభుత్వ ఆమోదంతో గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీ నియమిస్తుంది.) గ్రేడింగ్ యిన్స్పెక్టరు స్థానికంగా అనుభవంగల ఒక ఉత్పత్తిదారుని, ఒక వ్యాపారిని సహాయం తీసుకొని గ్రేడ్ తగాదాను పరిష్కరించ వచ్చును. ఫలాని గ్రేడ్ అని నిర్ణయించవచ్చును. యీరకమైన పేచీలన్నిటిలోనూ యిన్స్పెక్టరు తుది నిర్ణయం అయిన తర్వాత, వ్యాపారి, రైతు యిద్దరు ఆ నిర్ణయానికి బద్ధులు కావలసి ఉంటుంది. వ్యాపారి ఆ పొగాకును కొనవలసిందే, రైతు అమ్మవలసిందే. కొనడానికి యేమైనా అభ్యంతరాలుంటే, మొదటనే తెలియపరచాలి. కారణాలను అమ్మకునే రైతు తెలుసుకునేందుకుగాను స్పష్టంగా తెలియజేయాలి. కొనుగోలు దారుకూ రైతుకూ వచ్చిన పేచీలు సాధ్యమైనంతవరకు తక్షణమే పరిష్కరింపబడుతవి. యేసందర్భంలోనూ తగాదావచ్చిన రోజునుండి 3 రోజులకంటే యీ విషయంలో యెక్కువ కాలం జరుగరాదు. పేచీలన్నీకూడా, ప్రత్యేకంగా నిర్ణయింపబడిన అప్లికేషన్ ఫారం మూలకంగా గ్రేడింగ్ యిన్స్పెక్టరుకు నివేదింపబడాలి – ఈ రకంగా పేచీ వచ్చిన పొగాకుకు సంబంధించిన అరువు బేరాలన్నిటిలోనూ, ప్రత్యేకంగా డూప్లికేటు కాంట్రాక్టు ఫారాలను అమలులో పెట్టాలి. పరిష్కారం కాగానే వెటనే ఒక కాపీని కొనుగోలుదారు గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీకి పంపాలి. కనీసధరలను అమలు పరచటం సందర్భంలో, యింకా కొన్ని ముఖ్యమైన అంశాలను చర్చించవలసి ఉంది.

| |
|---|
| గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీ |
| –మధ్యవర్తి పరిష్కారానికి అప్లికేషను– |
| విక్రయదారుడు.................... |
| కొనుగోలుదారుడు................. |
| పొగాకు రకం...................... |
| విక్రియదారుడు చెప్పిన గ్రేడు,...... |
| తేది............ |
| కొన్నవారి సంతకం. |

ముఖ్యాంశాలు :—

1) <u>ఉత్పత్తిదార్లకు గ్రేడింగు సౌకర్యాలు</u> :— గ్రేడింగు సౌకర్యాలు లేనటువంటి రైతుల సహాయార్థం గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీ ఆధ్వర్యాన ఆయా గ్రామాలలో గ్రేడింగ్ కేంద్రాలు స్థాపింపబడుతవి. కూలీలు

మొ॥ విషయాలకు సంబంధించిన విషయాలన్నీ ఉత్పత్తిదారుడే చూసుకోవాలి. కాని గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీ, గ్రేడింగ్ విషయంలో రైతులకు చేతనైనంత సహాయం చేస్తుంది.

2) గ్రేడ్ల తనిఖీ :— ఉత్పత్తిదారుడు తన పొగాకు ఫలాని గ్రేడ్ అని చెప్పలేక పోయినప్పుడు, మార్కెటు కమిటీ సూపర్వైజర్లు (మామూలు సూపర్వైజర్లు, అవసరమైతే కొత్తగా నియమింపబడే గ్రేడింగ్ సూపర్వైజర్లు), గ్రేడింగ్ యిన్స్పెక్టర్లు రైతుకు యీ విషయంలో సహకారంచేసి అతని గ్రేడును నిర్ణయించేందుకు సహాయం చేయటానికి సిద్ధంగా ఉంటారు. వివిధ గ్రేడింగ్ కేంద్రాలలో గ్రేడ్ చేసి, చెక్కులుకట్టి, మార్కెటుకు పోవటానికి సిద్ధంగావున్న పొగాకు చెక్కులను సాధ్యమైనంతవరకు సూపర్వైజర్లు తనిఖీ చేస్తారు.

3) మధ్యవర్తిత్వము :— (ప్రభుత్వ అనుమతితో) గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీ, ఒక్కొక్క కొనుగోలు కేంద్రానికి ఒక గ్రేడింగ్ యిన్స్పెక్టరును, గుంటూరులో అదనంగా ఒక యిన్స్పెక్టరును నియమిస్తుంది. వివిధగ్రేడ్ల శాంపిల్సు గ్రేడింగ్ యిన్స్పెక్టర్లు తమవద్ద ఉంచుకుంటారు. మధ్యవర్తిత్వ పరిష్కారాలలో న్యాయం జరిగేటట్లు చూసేనిమిత్తం మార్కెటింగ్ అడ్వైజరుగారు యీ కేంద్రాలకు తరచుగావచ్చి పరీక్షిస్తుంటారు.

4) కంపల్సరీ గ్రేడింగ్ :— ఈ కనీసధరల స్కీములో అమ్మకం అంతా గ్రేడ్లవారీగా జరుగవలసి ఉండటంచేత గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీ, కొనుగోలు అంతా గుంటూరు లేక అగ్మార్కు గ్రేడ్ల ద్వారానే జరగాలని ఒక బైలాను ప్యాసుచేస్తుంది. ఉత్పత్తిదార్లతో యితర చిన్నవర్తకులు పోటీపడకుండా చేయాలంటే, ఒకసారి కొని తిరిగి అమ్మే అమ్మకాలన్నీ అగ్మార్కు గ్రేడ్లద్వారానే జరగాలని నిబంధించటం చాలా అవసరం. యిండియా ప్రభుత్వం వారు తమ సర్టిఫికేషన్ స్కీములో తగినంతమంది గ్రేడింగ్ యిన్స్పెక్టరులను నియమించని పక్షంలో, ప్రభుత్వం అనుమతితో గ్రేడింగ్ యిన్స్పెక్టర్లు అగ్మార్కు గ్రేడ్లను తనిఖీచేసే అధికారం కలిగి ఉండాలి.

5) అమ్మబడుపోకుండా ఉత్పత్తిదార్లవద్ద నిల్వఉండిపోయిన కొన్ని గ్రేడ్లను గురించి తగినచర్యలు:- కొన్నికొన్ని సమయాల్లో కొన్ని గ్రేడ్లు అమ్మబడుపోకుండా నిలిచిపోవచ్చు. అలాంటి నిల్వసరుకులను గురించి ఆలోచించి తగిన అవకాశాలు యిప్పుడే చర్చించి కల్పించుకోవాలి. ఉత్పత్తిదార్ల సహకార సంఘాలు స్థాపింపబడి, రిజిష్టరు చేయబడి, తాము ఉంచిన నిల్వసరుకు హామీమీద ఉత్పత్తిదార్లకు సంఘాలు అప్పులు యివ్వాలి. 'పూలింగు అండ్ కలెక్టివ్ సేల్స్' పద్ధతి ద్వారా పైనచెప్పిన సమయాల్లో రైతులకు రక్షణ కల్పించబడ వలసి ఉంది.

యింకాకొన్ని యితర అంశాలు :

1. కొనుగోలులో తగినంతపోటీ వచ్చేటట్లు చూడాలి:- కొనుగోలుదార్లలో తగినంతపోటీ యేర్పడేందుకుగాను, అమ్మకమంతా మార్కెట్ యార్డుల్లోనే తప్పనిసరిగా జరగాలనే నియమం అమలు జరపాలి. వ్యక్తిగత ఉత్పత్తిదార్లకూ, ఉత్పత్తిదార్ల సహకారసంఘాలకూ, తక్షణమే తగిన అవకాశాలు కల్పింపబడేటందుకై యెక్కువగా పబ్లిక్ బాండెడ్ వేర్ హౌసులూ, ప్రొశెశింగ్, రీడ్రైయింగ్ యంత్రాలూ, అందరికీ అందుబాటులో ఉండేటట్లుగా స్థాపింపబడ వలసి ఉంది. ఇంతకుముందు ప్రభుత్వ ఉత్తర్వులలో చెప్పినట్లుగా 'మార్కెట్లోని వ్యాపారాన్ని సమన్వయపరచేందుకు'గాను తక్షణమే ఉత్పత్తిదార్ల సహకార సంఘాలను రిజిష్టరుచేయాలి. గుత్తవ్యాపారానికి దారి తీస్తే, 'సంయుక్త వ్యాపార సంస్థలు' (Trade-Combines) యేర్పడకుండా ఉండేందుకు. తగిన బైలాలను తయారు చేసేందుకు తక్షణమే ప్రభుత్వం అనుమతించాలి. యీనాడు యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికాలో యిలాంటి గుత్త వ్యాపార విధానాలు చట్టరీత్యా అక్రమాలుగా, శిక్షార్హములుగా ప్రకటింపబడినవి.

2. దేశీయ అంతర్దేశీయ మార్కెట్లను గురించి పరిశోధించుట:- ఈ రిపోర్టులో చూపిన లెక్కల ప్రకారం ఆర్థికంగా క్షీణించిపోయిన ఉత్పత్తిదారులను రక్షించాలంటే, వర్తకులకు లాభదాయకములైన యితరదేశ మార్కెట్లకు వ్యాపించుటలో తగిన సహాయం జరుగనిదే సాధ్యపడదు. విశాలమైన, లాభమైన మార్కెట్ల అవకాశాలను వర్తకునికి, తద్వారా రైతుకు కలుగజేయాలంటే,

యిండియన్ సెంట్రల్ టుబాకో కమిటీ సహాయంతో కాని లేకగాని, రాష్ట్రీయ ప్రభుత్వం (1) యింగ్లండు, (2) యూరపు, (3) మధ్యప్రాచ్యం, (4) దూర ప్రాచ్యం - పోతే మనదేశంలో (1) దక్షిణ ఇండియా, (2) ఉత్తర యిండియా, మొదలైనచోట్ల టుబాకో సేల్సు ఆఫీసర్లను నియమించి, ఆయా ప్రాంతాల మార్కెట్లకు మనదేశ పొగాకు వ్యాపించటానికి అనువైన మార్గాలను అన్వేషింప చేసి, ఈ నాడా విదేశీయ మార్కెట్లలోని డిమాండును మనం ఉపయోగించు కొనే విధంగానూ, డిమాండు లేక పోవడంవల్ల ధరలు పడిపోయేస్థితిని తప్పించు కొనే విధంగానూ వెంటనే కృషి చేయవలసి ఉంటుంది.

3. విదేశీయ మార్కెట్లనుండి ఆర్డర్లు తెప్పించి, వాటిని యెగుమతి దార్లకు అందించుట:- గుంటూరు మార్కెట్‌లో రెండు రకాలైన యెగుమతిదార్లు ఉన్నారు. (1) మామూలుగా దేశంలోని కంపెనీలకు, యితరులకు ఆర్డరమీద యెగుమతిచేసేవాళ్ళు (2) మామూలుగా కన్‌సైన్‌మెంటు పద్ధతిమీద విదేశాల లోని బ్రోకర్లకు, అప్పుడప్పుడు ఆర్డరమీద యెగుమతి చేసేవాళ్ళు. పైన చెప్పిన టుబాకో సేల్సు ఆఫీసర్లు, మార్కెట్లను గురించి పరిశోధనలు చేయటమే కాకుండా విదేశమార్కెట్లలో ఆర్డర్లు సేకరించి, కన్‌సైన్‌మెంటు పద్ధతి యెగుమతి దార్లకు, వారు అంతకుముందు సంవత్సరం చేసిన యెగుమతుల ఆధారంతో, కోటా పద్ధతి మీద ఆర్డరను పంచి యివ్వాలి. ఏకారణాలవల్లనైనా డిమాండుకు తగినంతసప్లయి చేయలేక పోయినట్లయితే, యితర రకాల యెగుమతిదార్లనుకూడా యీప్లానులోకి తీసుకోవచ్చు.

4. మార్కెట్ విజ్ఞానశాఖ:— మార్కెట్‌ను గురించిన సరియైన విజ్ఞానం లేక పొగాకు వ్యాపారం చాలా నష్టపడుతున్నది. సేల్సు ఆఫీసర్లు, మార్కెట్ కమిటీలు మొదలైనవారివల్ల తెలియవచ్చిన సంగతుల సహాయంతో మార్కెట్ విజ్ఞానాన్ని బహుళ ప్రచారంలోకి తీసుకురావటానికి రాష్ట్రీయ ప్రభుత్వం వెంటనే ఒక టుబాకో డెవలప్‌మెంట్ ఆఫీసరును నియమించాలి. పొగాకు ఉత్పత్తి, మార్కెటింగ్ విషయాలేకాక, పై కార్యాలనుకూడా ఆయన చేయవచ్చు. రాష్ట్రీయ ప్రభుత్వం యీ వ్యాపారపంట (పొగాకు) విషయంలో యిదివరకే అశ్రద్ధచేసి యుండినందువల్ల, యీ నియామకం యిప్పటికైనా చేయవలసి ఉంది.

# ఏడవ భాగము.

## ప్రభుత్వం ఆమోదించ వలసిన విషయాలు.

ధరల సమన్వయానికీ రైతు సౌభాగ్యానికీ అవసరమైన ధరలను గురించిన నిర్ణయాలు మద్రాసు వ్యాపార పంటల చట్టంలో లేనేలేవనే విషయం యీ రిపోర్టు మొదటి భాగంలోనే చెప్పబడింది. చట్టంలోని 18 వ శెక్షన్ క్రింద రాష్ట్రీయ ప్రభుత్వంచేసిన నిర్ణయాలకు అనుకూలంగా, 19 (i) శెక్షన్ క్రింద, మార్కెట్ పరిస్థితులను, వ్యాపార నియమాలను సక్రమ పరచేందుకు కావలసిన బైలాలు చేయటానికి మాత్రం అధికారం యేర్పడుతున్నది.

1. అందువల్ల రాష్ట్రీయ ప్రభుత్వం, చట్టంలోని 18 వ శెక్షన్‌కు యీ క్రింది నియమాన్నికూడా కలుపుతుందని ఆశిస్తూ యీ సూచనచేయబడింది.

(xvi) ఒక వ్యాపార పంటకుగాని, లేక పంటలకుగాని, ఒక నిర్ణీత ప్రదేశంలో కనీస ధరలను నిర్ణయించి అమలుజరుపుట; యీ సందర్భంలో చేయబడిన యే బైలానైనా అతిక్రమించిన యెడల రెండు వందల రూపాయల వరకు జరిమానాకు పాత్రులగుదురు.

2. చట్టప్రకారం నేరాలకు త్వరగా పరిష్కారం జరిగేలాగా-ముఖ్యంగా యీ కనీస ధరల విషయంలో—చట్టంలో అవకాశం కల్పించాలి. వ్యాపార పంటల్లో అనుభవజ్ఞుడైన ఒక వ్యవసాయ శాఖాధికారిని నియమించి కనీస ధరలకు సంబంధించిన నేరస్థులను శిక్షించే అధికారం కల్పించాలి. దీనివల్ల, యిప్పటిలాగా కోర్టుద్వారా పరిష్కరించే సందర్భంలో, యితర కోర్టుపనులవల్ల జరిగే ఆలశ్యాన్ని తగ్గించటానికి వీలున్నది. కాని ఆఫీసర్లపని మార్కెట్ కమిటీ అజమాయిషీ క్రింద వుండాలి. ఒకే వ్యాపారపంటకు సంబంధించిన కొన్ని కమిటీలను కలిపి, మునిసిపాలిటీలకు కమీషనర్లులాగా కొందరు ప్రత్యేక ఆఫీసర్లను నియమించాలి. నేరస్థు

లతో వ్యవహరించే విషయంలో ఎక్సైజు మొదలగు శాఖలలో ఉన్నవిధానాన్ని అనుసరించి, పైన వివరించిన ప్రకారం నియామకాలు జరగాలని కోరడమైనది.

3. ఒక నిర్ణీత ప్రదేశంలోని వర్తకులు ఆ ప్రాంతాల ఉత్పత్తి దార్లను యిబ్బందులు పెట్టకుండా చేయటానికని మద్రాసు వ్యాపార పంటల చట్టాన్ని తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలకూ, అవసరమైతే నెల్లూరు జిల్లాలోని కందు కూరు తాలూకాకు గూడా, పొగాకు పంట విస్తీర్ణాన్ని బట్టి అనువర్తింప జేయ వలసి ఉంటుంది.

4. డిమాండులేక నిలిచిపోయిన సరుకు, యితర కారణాలవల్ల నిలిచిపో యిన సరుకు హామీగా ఉంచుకొని రయితుకు అడ్వాన్సులు యివ్వటానికై రాష్ట్రీ య ప్రభుత్వం కనీస ధరలను అమలు పరుస్తున్న మార్కెట్ కమిటీలకు మళ్లీ యిచ్చే షరాకుమీద 10 నుండి 20 లక్షల రూపాయలవరకు ధనసహాయం చేయాలి. ఆ సరుకును బట్టి, దాని విలువలో యెన్నిసార్లు రయితులకు అడ్వా న్సుగా యివ్వవచ్చు అనేది ప్రభుత్వంకాని, వ్యవసాయశాఖా డైరెక్టరుగారి అను మతితోగాని నిర్ణయింప బడుతుంది.

5. యింక యేమాత్రం ఆలశ్యం చేయకుండా, రాష్ట్రీయ ప్రభుత్వం పొగాకు ఉత్పత్తిదార్ల సహకార సంఘాలను రిజష్టరుచేసి, రైతులు లాభదాయక మైన సక్రమధరలను పొందగలిగే అవకాశాలను కల్పించాలి.

6. దేశంలోని అమ్మకాల విషయంలోకూడా ఆగ్‌మార్క్‌ను అమలు పరచ వలసినదిగా యిండియన్ సెంట్రల్ టుబాకో కమిటీని కోరాలి. అదిసాధ్యం కాని పక్షంలో గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీ నియమించిన గ్రేడింగు యిన్స్పెక్టర్లకే, ఆగ్‌మార్కు గ్రేడ్లప్రకారం, దేశంలోనికి అమ్మకాల విషయంలో సర్టిఫై చేసే అధికారాన్ని యివ్వాలి.

7. గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీచేత వ్రాసుచేయబడి, ప్రభుత్వ ఆమోదాన్ని పొందేందుకై యీ క్రింది బైలా సూచింప బడింది:-

బై లా:— నిర్ణీతస్థలంలో ఫ్లూక్యూర్డు వర్జీనియా, ఎండువర్జీనియా పొగాకులకు సంబంధించిన కొనుగోలు అంతా, గుంటూరు గ్రేడ్లు, లేక ఆగ్‌మార్కు గ్రేడ్లు, లేక గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీచే ఆయాసమయాల్లో నిర్ణయించబడిన గ్రేడ్లద్వారానే జరగాలి. పునర్విక్రయ సందర్భంలో, ఆయా కాలాలకు సంబంధించిన కనీస ధరలప్రకారం, ఆగ్‌మార్కు గ్రేడ్లు మాత్రమే అనుసరింపబడాలి. నాటుపొగాకు కొనుగోలుమాత్రం డోల్లింపు పద్ధతినగాని ఆగ్‌మార్కు గ్రేడ్లద్వారాగాని జరుగవచ్చును. డోల్లింపు పద్ధతిలో కొనుగోలు జరిగేటప్పుడుమాత్రం ఆయా కాలాల్లో అమల్లో ఉన్న కనీస ధరలు వర్తిస్తవి. గ్రేడుచేయని లేక కచ్చాగ్రేడు ఫ్లూక్యూర్డు వర్జీనియాగాని, ఎండు వర్జీనియాగాని కొనుగోలు చేసిన యెడల, యీ బై లాను అతిక్రమించినట్లయి, రెండువందల రూపాయలవరకు శిక్షకు పాత్రులగుదురు.

గమనిక:— జిల్లాలోని పొగాకు ఉత్పత్తి మార్కెటింగు వ్యవహారలలో ప్రత్యేక శ్రద్ధ కలిగిన యితర ప్రముఖులను కోఆప్టు చేసుకొనిగాని, లేకగాని, గుంటూరు టుబాకో మార్కెటు కమిటి ప్రతిసంవత్సరం కనీస ధరలను నిర్ణయిస్తుంది. ఈ నిర్ణయం, అమలులోకి రాకముందుగా వ్యవసాయశాఖ డైరెక్టరుగారి ఆమోదాన్ని పొందుతుంది. వార్తాపత్రికలద్వారా ప్రకటించిన 10 రోజుల అనంతరం, కనీస ధరలు అమలులోకి వచ్చినట్లుగా భావింపబడుతుంది.

బై లా:— ముందుగా చేసుకొన్న వర్తక కాంట్రాక్టులన్నీ, పొగాకు సప్లయిచేసే రోజున అమలులో ఉండే కనీసధరలకు (ఆ గ్రేడ్లకు) బద్ధములై ఉంటవి. ఈ బై లాకు వ్యతిరేకంగా చేసుకొన్న కాంట్రాక్టుల సందర్భంలో, కొనుగోలు దారుడు, విక్రయదారుడు, వ్యక్తిగతంగాకాని,సమిష్టిగాకాని అయిదువందల రూపాయలకు మించని జరిమానాకు పాత్రులగుదురు.

# ఎనిమిదవ భాగము.

## ఉపసంహారము.

ఈనాటి ఆర్థిక వ్యవస్థలో వ్యాపారపంటలు, రైతుకు అవసరమైన జీవితావసర వస్తువులను కొనుక్కోటానికి కావలసిన ధనమును సేకరించగలిగిన కారణంచేత, ఆహారపంటలంత ప్రాముఖ్యమైనవేనని మేము అభిప్రాయపడుతున్నాం. అంతమాత్రంచేత, ఆహార ధాన్యాలను పట్టించుకోకుండా ఉన్న పొలమంతా వ్యాపారపంటలే పండించాలని మా అభిప్రాయం కాదు. అందువలన రైతు క్షీణించి జిల్లాలోని, రాష్ట్రంలోని యితరప్రాంతాల రైతులమీద దేనికో ఒకదానికి ఆధారపడే అవకాశం రాకుండా, ఆహార పంటలకు, ధనంపంటలకూ, అంటే రైతుయొక్క భుక్తికీ, ఆర్థికస్థితికీ, సమన్వయం కలిగించి, రైతును స్వయంపోషకుడిగా చేయటానికి ఒక ప్లానింగు యొతైనా అవసరమని మా నమ్మకం. ఉత్పత్తిదారునికి, తన పంటను. దాని గుణాలను, అభివృద్ధి చేసుకొనే అవకాశాలు, దానికి కావలసిన ప్రోత్సాహం యివ్వాలి. రైతు వ్యవసాయంలోనూ, క్యూరింగులోనూ అభివృద్ధికర విధానాలు అవలంబించి, తన ఉత్పత్తిని వృద్ధిచేసుకొని, యెగుమతులను అభివృద్ధిచేసే అవకాశాలు కల్పింపబడాలి. యిదంతా జరగటానికి ముందుగా, ఒక టుబాకో డెవలెప్‌మెంటు ఆఫీసరు నియామకం, యీ రిపోర్టు ఆరవభాగంలోసూచించిన విధానాలు అమలు పరచటం, యేడవభాగంలోని వివరములతోసహా కనీసధరల స్కీమును ఆమోదించటం యివన్నీ తక్షణమే జరగాలి.

కనీసధరల ప్లానుయొక్క ఉపయోగం విస్తృత పరచాలంటే, పొగాకు ఉత్పత్తిదారులనుండి, వ్యాపారులనుండి, పొగాకు పరిశ్రమలు నడిపించే వారినుండి ఒక నిపుణుల సంఘాన్ని నియమించడం అవసరం. ఆసంఘం పొగాకు వినిమయదారుడిచ్చే ధరలో ఎంతభాగం ఉత్పత్తిదారునికి సక్రమంగా రావలెనో నిర్ణయించాలి. ఈవిధంగా ముందుముందు, ప్రస్తుతానికంటే సకారణంగా, కనీసధరల నిర్ణయం చేయవచ్చును. పొగాకు డెవలెప్‌మెంట్ ఆఫీసరు (పొగాకు అభివృద్ధి

శాఖోద్యోగి)ను నియమించినట్లయితే యీ నిపుణుల సంఘానికి ఎక్కువ సహాయకారిగా వుంటుంది.

ఈ కనీసధరల ప్లానును అంగీకరించటమంటే పొగాకు రైతుల ఆర్థికస్థితిని వృద్ధిచేయటం, మధ్య దళారీలు అవసరం లేకుండానే వినిమయదారుణ్ణి, ఉత్పత్తిదారునికి సాధ్యమైనంత సమీపంలోకి తీసుకరావటం, అన్నమాట. యిప్పటిలాగా ముడిపొగాకు యెగుమతులు కాక తయారైన సిగిరెట్లు మొ॥ వస్తువులను హిందూదేశం యెగుమతి చేయగలగటానికీ, మనదేశ పొగాకులో యెక్కువ భాగాన్ని ఉపయోగించుకోగలగటానికీ, వెంటనే భారీ పొగాకు పరిశ్రమలను నిర్మించటానికి పూనుకోవలసిందిగా, యీ సందర్భంలో మేము రాష్ట్రీయ ప్రభుత్వానికి సూచిస్తున్నాము. విదేశీయ డిమాండుకు తగినంతగా సప్లైచేయలేక పోవటం, మన మార్కెటులో కొంత సరుకు నిలబడిపోవటం మొదలైనవాటిని తప్పుకోవాలంటే, ప్రభుత్వమూ, యిండియన్ సెంట్రల్ టుబాకో కమిటీ, ప్రజలూ, ముఖ్యంగా రైతులు, వర్తకులు కలిసి ప్రయత్నించి, ప్రభుత్వ యాజమాన్యంక్రింద టుబాకో క్రెడిట్ కార్పొరేషన్లను స్థాపించాలి.

గుంటూరుజిల్లా మొత్తముమీద 1946-47 పంట చాలా నిరుత్సాహకరంగా ఉంది. ఉత్పత్తిదార్లకు చాలా నష్టంవచ్చేటట్లున్నది. అందువలన, దేశీయ విదేశీయ మార్కెట్ల ప్రోత్సాహకర పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని, రైతుకు రక్షణ కల్పించవలసిన ఆవస్యకతను గుర్తించి, యిందులో వివరించిన కనీస ధరల ప్లానును తక్షణమే ఆమోదించి 1947 సీజనుకు ఉపయోగపడేటట్లు చేయవలసిందని, ఈ క్రింద సంతకాలు చేసిన పొగాకు కనీస ధరల సబ్ కమిటీ సభ్యులమైన మేము మద్రాసు ప్రభుత్వమువారిని కోరుచున్నాము.

1. (సం) కొల్లా వెంకయ్య, బి. ఎ., ఛైర్మన్, గుంటూరు పొగాకు మార్కెట్ కమిటీ, గుంటూరు.

2. ,, డి. వి. అప్పారావు, బి. ఎ., వైస్ఛైర్మన్, గుంటూరు పొగాకు మార్కెట్ కమిటీ, గుంటూరు.

3. (సం) కె. నరశింగరావు, సభ్యుడు, గుంటూరు పొగాకు మార్కెట్ కమిటీ, గుంటూరు.

4. ,, కొల్లూరు వెంకటేశ్వర్లు, సభ్యుడు, గుంటూరు పొగాకు మార్కెట్ కమిటీ, గుంటూరు.

5. ,, ఉన్నవ గోపాలకృష్ణయ్య, బి. ఎ., బి. ఎల్., జిల్లా కమ్యూనిష్టు పార్టీ ప్రతినిధి, గుంటూరు,

6. ,, కె. కుటుంబరావు, వైస్ ప్రెసిడెంటు, జిల్లా రైతుసంఘం, గుంటూరు, గుంటూరు జిల్లా రైతుసంఘం ప్రతినిధి.

7. ,, సయ్యద్ మహబూబ్, సెక్రటరీ, జిల్లా ముస్లింలీగ్, గుంటూరు, గుంటూరుజిల్లా ముస్లింలీగ్ ప్రతినిధి.

8. ,, మేడూరి నాగేశ్వరరావు, యం. యల్. ఎ., ఏటుకూరు.

9. ,, మంతెన వెంకట్రాజు, యం. యల్. ఎ., బాపట్ల.

10. ,, యం. ఎ. సలాం, బి. ఎ., బి. ఎల్., యం. ఎల్. ఎ., గుంటూరు.

11. ,, పిల్లలమర్రి వెంకటేశ్వర్లు, యం. యల్. ఎ., బెజవాడ.

12. ,, పోసాని ప్రకాశరావు, యం. ఎ., క్రిష్ణాయపాలెం, రైతుల ప్రతినిధి.

13. ,, పాటిబండ్ల రంగనాయకులు, భీమవరం, రయితుల ప్రతినిధి.

14. ,, లావు అంకమ్మ, పెదనందిపాడు, రయితుల ప్రతినిధి.

15. ,, కాళిదాసు శంకరయ్య, తూబాడు, రయితుల ప్రతినిధి.

16. ,, యం. అమరారెడ్డి, పణిదం (సత్తెనపల్లి తా॥), రైతుల ప్రతినిధి.

17. ,, గట్టుపల్లి ఆంజనేయులు, మెస్సర్సు నూతలపాటి ఆంజనేయులు అండ్ కో., పొగాకు ఎగుమతిదార్ల ప్రతినిధి, గుంటూరు.

18. ,, డి. రామారావు, సెక్రెటరి, ఇండియన్ టుబాకో ఎసోసియేషన్ గుంటూరు, ఇండియన్ టుబాకో ఎసోసియేషన్ వారి ప్రతినిధి. గుంటూరు. (పై రిపోర్టుకు అసమ్మతి తెలిపారు)

19 (సం) జి. కమ్మింగ్, ఆక్టింగు జిల్లా మేనేజర్, మెస్సర్సు ఐ. ఎల్. టి. డి, కంపెనీ., లిమిటెడ్., చీరాల, మెస్సర్సు ఐ. యల్. టి. డి. కంపెనీ., లిమిటెడ్ వారి ప్రతినిధి. (పై రిపోర్టుకు అసమ్మతి తెలిపారు)

20. ,, కె. రామకృష్ణమూర్తి, ఇండియన్ ఛేంబర్ ఆఫ్ కామర్సు, గుంటూరు వారి ప్రతినిధి. (పై రిపోర్టుకు అసమ్మతి తెలిపారు)

21. ,, యఫ్. యన్. బి. జాన్సన్, నామినేటెడ్ సభ్యుడు, గుంటూరు పొగాకు మార్కెటు కమిటీ, గుంటూరు., (పైరిపోర్టుకుఅసమ్మతి తెలిపారు.)

---

1] శ్రీ డి. యన్. మూర్తి, రెసిడెంట్ మేనేజరు, మెస్సర్స్ బ్రిటిష్ ఇండియా టొబాకో కార్పొరేషన్, లిమిటెడ్., గుంటూరు. (ఊరియందు లేనందున సంతకము చేయలేదు.)

2] శ్రీ మైలవరపు సుందయ్య, పొగాకు వ్యాపారి, చిలకలూరిపేట, (సంతకముచేయ నిరాకరించారు.)

# అసమ్మతి.

ఈ క్రింద సంతకాలు చేసిన మేము, దిగువ వివరించిన కారణాలవల్ల, పొగాకుకు కనీసధరలు నిర్ణయించాలనే ఆందోళనకు మా అసమ్మతిని తెలియ జేస్తున్నాము:—

1) ఈనాటి పరిస్థితుల్లో పొగాకుపరిశ్రమ, ఉత్పత్తి మొదలుకొని, వినియోగము వరకు యేవిధమైన హీనస్థితిలో లేనందువల్ల, యిట్టి కార్యాచరణకు పూనుకోవలసిన అవసరంలేదు. ఉదాహరణకు ఫ్లూక్యూర్డు వర్జీనియా పొగాకుధర 1939 లో పౌ 1 కి 3. 5 అణాలనుండి, ఏటేటా క్రమంగా పెరుగుతూ వచ్చి, యీ సీజనులో పౌ 1 కి 13. 5 అణాలవరకు పోయింధి. వర్జీనియా పొగాకుపంట విస్తీర్ణంలో 20% అధికం కావటం, నిర్మాణ పరికరాలు అధికధరలతో ఉన్నప్పటికీ, 1000 బారన్లు కొత్తగా నిర్మించబడటమూ, యివే నిదర్శనాలు. పొగాకు పరిశ్రమ క్షీణ స్థితిలో లేనేలేదని చెప్పటానికి సంక్షోభ కాలాలలో మామూలుగా వచ్చే కనీసధరల ఆందోళనకు యిప్పటిస్థితిలో యేమాత్రం అవకాశంలేదు.

2) యింగ్లండు, యీజిప్టు, యూరపు దేశాలు, మొదలైన విదేశమార్కెట్ల నుండి తెలిసిన సంగతులనుబట్టి, యిండియా పొగాకుకుధర యింకా పెరిగినట్లయితే మనం యీ విదేశ మార్కెట్లను వదలుకోవలసి వస్తుందని తెలుస్తున్నది. కాబట్టి యీ కమిటీ యిప్పటి ధరలను పెంచటానికి చేసేప్రయత్నం, యెక్కువభాగం సరుకు యెగుమతి కావలసి యుండటం వలన దేశంలోని వ్యాపార,వ్యవసాయాలకు చాలా హానికలిగిస్తుంది.

3) యుద్ధానంతరకాలంలో సంక్షోభాలురాకుండా చేసేందుకై, యిండియా లోని వ్యవసాయ పంటల ధరలు కంట్రోలు చేసే సమస్యను కేంద్రప్రభుత్వం తీసుకొన్నదని, న్యూఢిల్లీలో జనవరి 17 వ తేదీ సమావేశమైన వ్యవసాయ ధరల మహాసభ యీవిషయం చర్చించిందనీ మనం పత్రికలలో చూస్తున్నాం. అందువల్ల అఖిల భారత ప్రాముఖ్యంగల ఈ స్కీమును గుంటూరులాంటి చిన్నప్రదేశంలో

యింత త్వర త్వరగా, యీ కమిటీ అమలు పరచవలసిన అగత్యం ఏమీలేదు. వ్యవసాయానికీ, వ్యాపారానికీ యిది మహా హానికర ఫలితాలను గలిగిస్తుంది.

1. (సం) డి. యస్. మూర్తి, రెసిడెంట్ మేనేజరు, బ్రిటిష్ ఇండియా టుబాకో కార్పొరేషన్ లిమిటెడ్.
2. (సం) డి. రామారావు, శెక్రటరీ, యిండియన్ టుబాకో యసోసియేషన్, గుంటూరు.
3. (సం) కె. రామకృష్ణమూర్తి, శెక్రటరి, యిండియన్ ఛేంబర్ ఆఫ్ కామర్సు, గుంటూరు.
4. (సం) ఫ్రెడరిక్ జాన్సన్, సభ్యులు.

గుంటూరు,
25—1—47.

# అనుబంధ సూచిక.

**1.** కనీస ధరలను గురించి గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీ యిదివరకు చేసిన ప్రయత్నాల సందర్భంలో రాష్ట్రీయ ప్రభుత్వానికి నివేదించిన వ్యవసాయ శాఖా డైరక్టరుగారి భావాలు.

(మద్రాసు ప్రభుత్వ డెవలప్‌మెంట్ శాఖా కార్యదర్శిగారికి వ్యవసాయ శాఖా డైరెక్టరుగారు వ్రాసిన ది 19-8-1941 గల నెం. సి. 2. 573/40 రు లేఖ యొక్క సరియైన నకలు)

**2.** యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికాలో పొగాకుకు ఉన్న ధరలవివరాలు.

**3.** 1946 పంటకు, ఫ్లూక్యూర్డు వర్జీనియా పొగాకుకు కెనడాలో నిర్ణయింప బడిన గ్రేడ్ వారీ కనీస ధరలు.

**4.** పొగాకుకు సంబంధించి నంతవరకు యింపీరియల్ ప్రిఫరెన్సు పాలసీనిగురించి, బ్రిటిషుసామ్రాజ్య ఉత్పత్తిదార్ల మహాసభ (British Empire Producers' Organisation) వారు యిచ్చిన సర్క్యులరులోని భాగాలు.

(యిండియన్ సెంట్రల్ టుబాకో కమిటీవారి ది 15-1-1947 గల నెం. యఫ్. 41 (ఎ) /46 రు మెమొరాండంలోని భాగాలు.)

**5.** దక్షిణదేశ మార్కెట్‌లో నమిలే పొగాకుకూ, చుట్టపొగాకుకూ ఉన్న ధరల వివరాలు.

**6.** ఉత్పత్తిదారులకిచ్చిన ప్రశ్నావళికి జవాబులు వచ్చిన గ్రామముల పేర్లు-నాటు పొగాకు - ఫ్లూక్యూర్డు వర్జీనియా పొగాకు.

**7.** ఎ) పునర్విచారించి నిర్ణయించబడిన స్టాండర్డు గ్రేడ్లవివరాలు (గుంటూరు పొగాకు మార్కెట్ కమిటి గ్రేడ్లు.)

**7.** బి) అగ్మార్కు గ్రేడ్ల వివరాలు.

# అనుబంధము 1.

మద్రాసు ప్రభుత్వ డెవలప్‌మెంటు శాఖా కార్యదర్శిగారికి వ్యవసాయ శాఖా డైరక్టరుగారు వ్రాసిన ది 19-8-1941 గల నెం. సి.2-573/40 రు లేఖ యొక్క నకలు:—

కమిటీలు-గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీ-పొగాకుకనీస ధరలు-నిర్ణయము.

ప్రభుత్వ మెమొరాండం నెం. 31691-జి-140-3, 28-7-1941. గుంటూరుజిల్లాలో పొగాకుకు కనీసధరలను నిర్ణయించే సందర్భములో, విపులమైన విచారణచేసి, అసిస్టెంటు మార్కెటింగ్ ఆఫీసరు శ్రీ యస్. యన్. వెంకట్రమణ అయ్యరుగారు నివేదించుకున్న రిపోర్టును యిందుతో పంపుకొను చున్నాను.

2. ముఖ్యమైన పెద్దకంపెనీలవారు కలిసి ఒకటిగా కట్టు కట్టారని ఆరోపింపబడిన విషయం వాస్తవమేనని యీ రిపోర్టు ధృవపరుస్తూ అందువల్ల కొనుగోలుదార్లలో తగినంత పోటీలేక రైతులకు మంచిధరలు రాలేదని తెలియ పరుస్తున్నది.

3. పెద్ద పెద్ద కంపెనీలు కలసి జాయింటుగా కొనుగోలు చేసేవిధానాన్ని అరికట్టడం కష్టసాధ్యమే అయినప్పటికీ, ఉత్పత్తిదార్లకు సక్రమ కనీసధరలు గిట్టే టట్లు చేయటానికి తగినచర్యలు తీసుకోవలసిన అవసరం ఉంది. చెరుకు ధరకూ తయారైన పంచదార ధరకూ ఉన్నసంబంధం తెలిసినట్లుగా క్యూర్ చేసిన ముడి పొగాకు ధరకూ, తయారైన సిగరెట్ల ధరకూ ఉన్న సరియైన సంబంధం ఖచ్చితంగా తెలియనందువల్ల కనీస ధరల నిర్ణయం ఉత్పత్తిఖర్చుల (ప్రాసెసింగ్ ఖర్చులుసహా) ఆధారంలోనే జరుగవలసి ఉంటుంది. యిందులోనూ ఏ ప్రాంతానికి ఆ ప్రాంతం విడి విడిగా ఉత్పత్తిఖర్చులు, వాటి ఆధారంతో ఉత్పత్తిదారుడు పెట్టిన పెట్టుబడికీ, చేసిన శ్రమకూ న్యాయమైన ప్రతిఫలం వచ్చేలాగున కనీసధరలు నిర్ణయించాలి.

4. రకాన్ని గురించి వచ్చే తగాదాలు, వాటికి కావలసిన పరిష్కారాల అవకాశాలను సాధ్యమైనంతవరకు తగ్గించేందుకై, యిప్పుడు అగ్మార్కు స్కీములో గాని, పెద్ద కంపెనీల నిత్యవ్యవహారంలోగాని ఉన్న గ్రేడ్లకంటే యెక్కువ గ్రేడ్లను నిర్ణయించాలి.

5. మద్రాసు వ్యాపార పంటల చట్టంలో 19. ఎ. రూలులోనున్న యీ సంబంధమైన అవకాశం మార్కెటు కమిటీ కనీస ధరలను నిర్ణయించటానికి చాలదు. 'చెరుకు-చట్టం'లాంటి శాసనసభా కార్యక్రమ చర్యలు తీసుకోనేదానికి ముందుగా, ప్రథమంలో, కనీసధరలను నిర్ణయించి, ప్రకటించి, అంతకు తక్కువగా కొనవద్దని వ్యాపారులను కోరటం మంచిది. వ్యాపారులు యీ సలహాను పెడ చెవిని పెట్టినయెడల అప్పుడు చట్టంద్వారా పనిచేయవచ్చును. ఈ సందర్భంలో, అవకాశమున్నన్ని గ్రేడ్లను యేర్పరచటానికి అనువుగా తగిన స్పష్టమైన సూచనలు చేయవలసిందిగా మార్కెటు కమిటీని కోరవచ్చును. చెరుకుపంట విషయం లాగా ప్రభుత్వమే కనీసధరలను నిర్ణయించవచ్చును. దీనికి ప్రభుత్వంగనక అంగీకరించేటట్లయితే, జిల్లా వ్యవసాయ శాఖాధికారులను ఆయా ప్రాంతాలలోని సగటు ఉత్పత్తి ఖర్చులను సేకరించి పంపమనికోరి, వాటి ఆధారంతో ప్రాథమిక కనీసధరలను నిర్ణయించి, ఒకటి రెండు నెలలు ముందుగా (సీజనుకు) ప్రకటించి, ప్రజాభిప్రాయాన్ని సేకరిస్తాను. ఆ తరువాత కనీసధరల విషయంలో తుది నిర్ణయం చేయవచ్చు.

# అనుబంధము 2.

**యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికాలో పొగాకు ధరల వివరాలు (1946 లో)**

| ఫ్లూక్యూర్డు వర్జీనియా పొగాకు. | | పౌ 1 కి సెంట్లు. | రిఫరెన్సు. |
|---|---|---|---|
| (ఎ) నూతన ప్రాంతం. | | | |
| దక్షిణ కెరోలినా | | 49.39 | టుబాకో, (యు. యస్. ఎ.) |
| | మామూలు సగటు | | |
| తూర్పు - ఉత్తర కెరోలినా | ,, | 53.01 | 21-11-46, (పేజీ 18) |
| (బి) మధ్య ప్రాంతం | ,, | 49.54 | ,, |
| (సి) పూర్వ ప్రాంతం | ,, | 49.35 | ,, |
| | సగటు | 50.32 | |

డార్కు-ఫైర్డ్ వర్జీనియా. (ఎండువర్జీనియాలాంటిదే కాని యింకానలుపు)

| | | | |
|---|---|---|---|
| * 1945-46 పంట. | మామూలు సగటు | 32.40 | నెలసరి మార్కెటురిపోర్టు మార్చి 1946. |

ఫైర్ క్యూర్డు కెంటకీ అండ్ టెనసీ. (అతినలుపు పొగాకురకాలవంటివి)

* 1945-46 పంట. మామూలు సగటు.

| | | | |
|---|---|---|---|
| పశ్చిమ జిల్లా | ,, | 29.40 | ,, |
| తూర్పుజిల్లా | ,, | 32.85 | ,, |
| | సగటు | 30.28 | ,, |

ఎయిర్ క్యూర్డు పొగాకు.

| | | | |
|---|---|---|---|
| బర్లీ 1945-46 పంట | మామూలు సగటు | 39.49 | ,, |
| గ్రీన్ రివర్ * 1945-46 పంట (నాటుపొగాకు వంటిది) | ,, | 24.75 | ,, |
| ఒన్-సకర్ * 1945-46 పంట. (నాటుపొగాకు వంటిది) | ,, | 24.95 | ,, |
| మేరీలాండ్ * 1945-46 పంట | ,, | 57.18 | జులై 1946 |

గమనిక:—ఒక సెంటు (యు. యస్. ఏ. నాణెం) = 6.4 పైసలు (షుమారు.)

---

* 1946-47 పంట యింకా మార్కెటులోకి రాలేదు.

# అనుబంధము 3.

## 1946 పంటకు ఫ్లూక్యూర్డ్ వర్జీనియా పొగాకుకు కెనడాలో నిర్ణయింపబడిన గ్రేడ్ వారీ కనీసధరలు.

| గ్రేడు | పౌ 1కి వెల (సెంట్లలో) | గ్రేడ్ల వర్ణన. |
|---|---|---|
| బి1 | 69.13 | ఆకు నిమ్మ,నారింజ రంగులు – ఫ్యాన్సీరకం |
| బి2 | 55.31 | ,, ,, ,, తేలికమహాగనీ – మేలురకం |
| బి2 యల్. | 48.31 | ,, ,, బి 2 కంటె తక్కువరకం– మంచిరకం. |
| బి3 | 41.48 | ,, ,, నారింజనుండి మధ్యరకం మహాగనీ – ఒక మోస్తరు రకం |
| బి3 యల్. | 35.26 | ,, ,, కొంచెం నలుపు మహాగనీ – బి 3 కంటె తక్కువరకం. |
| బి4 | 29.03 | ,, ,, ఆకుపచ్చ రంగు కొద్దిగా. |
| బి5 | 25.31 | ,, ,, నారింజ, నలుపు మహాగనీ – మామూలు రకం, ఆకుపచ్చరంగు. |
| బి6 | 17.28 | ,, ,, ,, బాగా నలుపు మహాగనీ, ఆకు పచ్చ రంగు, చాలాతక్కువరకం. |
| సి2 | 69.13 | కట్టలు నిమ్మ,నారింజ – ఫ్యాన్సీరకం. |
| సి3 | 55.31 | ,, ,, ,, మేలురకం. |
| సి4 | 48.39 | ,, ,, ,, మంచిరకం. |
| సి5 | 41.48 | ,, ,, ,, ఆకుపచ్చరంగు,ఒకమోస్తరురకం. |
| యం 1 | 34.57 | ,, ,, మామూలు రకం. |
| యం 2 | 28.65 | మారేరంగులు – తక్కువరకం. |
| యక్స్ 2 | 34.58 | |
| యక్స్ 3 | 22.65 | నిమ్మ,నారింజ – మధ్యరకం. |
| యక్స్ 4 | 20.74 | ,, మామూలు రకం. |
| యన్ డి. | 3.45 | వర్ణనలేదు. |

# అనుబంధము 4.

యింపీరియల్ ప్రిఫరెన్సు భవిష్యత్తును గురించి, బ్రిటిష్ సామ్రాజ్య ఉత్పత్తిదార్ల మహాసభ (British Empire Producer's Organisation) నిర్ణయాలు:

ఈ మెమొరాండంలో వివరించిన చర్చలనుబట్టి, ప్రత్యేకవస్తువుల పరిస్థితులను గూర్చి యిచ్చిన స్టేటుమెంట్లలోని వివరణలనుబట్టి, యీ మహాసభవారు యీ క్రింది విధంగా అభిప్రాయ పడుతున్నారు:—

1. యిప్పుడు అమల్లో ఉన్న యింగ్లీషు ప్రిఫరెన్సులు యే సందర్భంలోనూ యెక్కువగా లేవు.

2. డొమినియన్లలోనూ, వలసరాజ్యాల్లోనూ, యింగ్లండు మార్కెట్టులో తమకు యిచ్చే ప్రిఫరెన్సు సహాయంతో అవసరం లేకుండా త్రోసివేయగలిగేటంత స్థాయికి రానటువంటి అనేక ప్రాథమిక పరిశ్రమలను అభివృద్ధిపరిచే విషయంలో యీ ప్రిఫరెన్సులు యెంతో ప్రధాన పాత్రను వహించాయి.

3. జగద్వర్తక రంగంలో సప్లై, డిమాండులమధ్య యెప్పుడువామూలు సంబంధాలు తిరిగి యేర్పడుతవో, అప్పుడు ప్రిఫరెన్సులు తీసివేయటంగాని, తగ్గించటంగాని సామాన్య ఉత్పత్తిదారుకు చాలా హానికరమైన ఫలితాలకు దారితీస్తవి. యీ ఫలితాలు యింగ్లండునుండి జరిగే యెగుమతులకు కూడా వ్యాపిస్తవి.

4. యుద్ధకాలంలో ఆదాయంకోసం పొగాకు, వైన్, మత్తుపదార్థాలమీద యెక్కువపన్నులు వేయటం అంతకుముందున్న ప్రిఫరెన్సు చాలాభాగం తగ్గించినట్లుగనే ఫలితం కలిగింది. అందుకని యీ వస్తువులమీద ప్రిఫరెన్సును యింకా యెక్కువ చేయటం చాలా అవసరం.

5. ఈక్వాలిటీఆఫ్ట్రీట్మెంటు క్లాజును (అధ్యాయం 3. శెక్షన్ (ఇ), 1వ పారా) (Equality of Treatment clause) అంగీకరించటంద్వారా యితర సామ్రాజ్యవాద దేశాలతో, ప్రిఫరెన్సు ధరలతో, పెద్దపెద్ద డాల్లింపు కొనుగోలు చేయటానికిగల కామన్వెల్తు పరిభుత్వాల స్వాతంత్ర్యాన్ని అరికట్టటమే అవుతుంది.

6. బ్రిటిష్ కామన్వెల్తు రాజ్యాల ఆర్థిక సూత్రాలలో ప్రధాన భాగమైన యింపీరియల్ ప్రిఫరెన్సును యితరరాజ్యాలు త్రోసి రాజనటానికి ప్రయత్నించినట్లయితే, యూరప్ వలసరాజ్యాలు, యు. యస్. ఎ. మొ॥ రాజ్యాలు అమలు పరచే ప్రిఫరెన్సుల సహాయంతో యెదుర్కొనే అవకాశం ఉంది.

## — ఇంపీరియల్ ప్రిఫరెన్సు —

### — సామ్రాజ్య వర్ధమాన పొగాకు పరిశ్రమకు దాని ఆవశ్యకత —

1920 సంవత్సరంలో యింగ్లండులో ఉపయోగింపబడే పొగాకుకంటే నూటికి 3 పాళ్ళు యెక్కువగామాత్రమే సామ్రాజ్య దేశాల్లో పొగాకుపంట వచ్చింది. 1938 లో చిట్టచివరి యుద్ధాపూర్వ సంవత్సరంలో, నూటికి 23¾ వంతులు హెచ్చుగా పండింది. యుద్ధకాలంలో ఒకసారి నూటికి 32¾ వంతులైంది. కాని యిప్పుడు, నూటికి 22 వంతులు మాత్రమే అంటే, యీదేశంలోకి దిగుమతి చేయబడి ఉపయోగానికి ఉంచుకోబడిన పొగాకు మొత్తంలో 5 వ వంతు అన్నమాట.

గత రెండు ప్రపంచ యుద్ధాల మధ్యకాలంలో వచ్చిన అభివృద్ధికి ముఖ్య కారణం 1919 లో మొట్టమొదటిసారిగా సామ్రాజ్యంలో పండిన పొగాకుకు యిచ్చిన ప్రిఫరెన్సే. సామ్రాజ్య దేశాలనుండి యు. యస్. ఏ. చేసుకొన్న దిగు

మతులు 1920 లో 4,204,000 పౌనులనుండి, 1938 లో 52,228,000 పౌ. వరకు పెరిగినవి. 1938 లో 83,000,000 పౌ॥ వరకు దిగుమతులు జరిగినవి. దీనికీ, 52,000,000 కు మధ్యన ఉన్న భేదం మళ్ళీ పొగాకురూపంలో, యెగుమతిగాని, తయారైన వస్తురూపంలో యెగుమతి కాని, లేదా నిల్వసరుకుగాని అయిఉండాలి.

సామ్రాజ్య దేశాలు యీ క్రింది విధంగా సప్లై చేసినవి.

| | మిలియన్ పౌన్లు. |
|---|---|
| ఇండియా | 33 |
| దక్షిణ రోడీసియా | 19 |
| కెనడా | 16 |
| న్యాసాలాండ్ | 13 |
| యితర సామ్రాజ్య దేశాలు (దక్షిణ ఆఫ్రికాసహా) | 2 |
| | 83 |

యింగ్లండులో నమ్మకమైన మార్కెటును గ్యారంటీచేయటం ద్వారా యింపీరియల్ ప్రిఫరెన్సు సామ్రాజ్య దేశాల పొగాకు ఉత్పత్తిని అభివృద్ధి చేయ గలిగిందని యీపై అంకెలే ఋజువుచేస్తున్నవి. యుద్ధకాలంలో కొంతవరకు ఓడ సౌకర్యాలు తక్కువైనందువల్లనైతేనేమి ముఖ్యంగా, దేశంలోని సైన్యాలకోసమై యెక్కువైన డిమాండుమూలకంగా నైతేనేమి, యింగ్లండుకు యిండియానుండి దిగుమతులు తక్కువైనవి. కాని యుద్ధకాల విపరీత పరిస్థితులు తీరిపోగానే, మళ్ళీ యిండియా, యింగ్లండు మార్కెటులో అధికభాగాన్ని సాధించుకోవాలని కోరుతుంది.

## ద్వితీయ ప్రపంచ యుద్ధంవలన మార్పులు.

1946 వ సంవత్సరం ఫిబ్రవరి 19 తేదీన పార్లమెంటు సభలో బోర్డుఆఫ్ ట్రేడ్ అధ్యక్షులు యీ క్రింది లెక్కలను వివరించాడు. యివియుద్ధ కారణాలవల్ల యింగ్లండు పొగాకు దిగుమతుల విషయంలో వివిధదేశాల స్థాయిని సూచిస్తున్నవి.

| పొగాకు పండే దేశం. | ఇంగ్లండులోకి దిగుమతులు. 1937 | 1945 | ఉత్పత్తి | |
|---|---|---|---|---|
| | (వేల పౌనులలో) | | | |
| కెనడా | 8649 | 12,096 | 1944, | 102,104,750 పౌ. |
| దక్షిణాఫ్రికా | 205 | లేవు. | 1942-43, | 25,200,000 పౌ. |
| ఇండియా | 19150 | 10,155 | 1942-43, | 965,440,000 పౌ. |
| దక్షిణరోడీసియా | 14519 | 20,600 | 1944-45, | 46,300,000 పౌ. |
| న్యాసాలాండ్ | 13505 | 11,572 | 1944-45, (అంచనా) | 20,000000 పౌ. |
| మిగిలిన సామ్రాజ్యం | 1308 | 1578 | అంచనా | 19,000000 పౌ. |

కెనడా పొగాకు శీతోష్ణస్థితిగతులనుబట్టి రకరకాలుగా మారుతూ ఉంటుంది. మనం అత్యధికభాగం, అన్ని దేశాలకంటె యెక్కువగా కెనడానుండి దిగుమతి చేసుకుంటాం. కాని కొన్ని సంవత్సరాలుగా మనకు కావలసినంత పొగాకు కెనడా సప్లై చేయలేకపోయింది.

ఆస్ట్రేలియాలో సగటుపంట 6,000,000 పౌనులు, కాని ఆదేశం దిగుమతి చేసుకుంటుందే కాని యెగుమతులు చేయలేదు. న్యూజిలాండ్ తనుపండించినదానికి రెండింతలు ఉపయోగించుకోటంచేత యెగుమతులు చేయలేదు.

యిండియా పంటలో 40,000,000 పౌనులు మాత్రమే ఫ్లూక్యూర్డు చేయబడుతోంది. అందులో యెంతవరకు వీలుంటే అంతవరకు యింగ్లండు దిగుమతి

చేసుకుంటుంది. గత కొద్ది సంవత్సరాలనుండి, ముఖ్యంగా ఫ్లూక్యూర్డు పొగాకు విషయంలో యిండియా స్వంత ఉపయోగం చాలా యెక్కువైంది. దక్షిణఆఫ్రికా తనపంట యెంతో అంతా ఉపయోగించు కుంటుంది. పంట తక్కువైనప్పుడు దక్షిణ రోడీసియానుండి దిగుమతి చేసుకుంటుంది.

దక్షిణ రోడీసియానుండి యెగుమతులకు మిగిలినదంతా ఇంగ్లండు దిగుమతి చేసుకుంటుంది. న్యాసాలాండ్ నుండి సగటు దిగుమతి 14,000,000 పౌ॥ ఉంటుంది. 1945 లో తగినంత నిలువ ఫ్యాక్టరీ యజమానులవద్ద ఉండటంవల్ల దిగుమతులు తగ్గినవి. న్యాసాలాండ్ పొగాకు ప్రధానంగా చుట్టలలోనూ, కొంతవరకు పైపు లకూ ఉపయోగిస్తుంది.

1940 సంవత్సరంలో బర్మా 136,600,000 పౌనులు పొగాకు పండించింది.

## మధ్యఆఫ్రికాలో పొగాకు ఉత్పత్తి :

యుద్ధానికిముందు సంవత్సరంలో న్యాసాలాండ్ నుండి అయిన యెగుమతుల మొత్తం విలువలో సగభాగం పొగాకుకే సంబంధించింది. దక్షిణ, ఉత్తర రోడీసి యాలకు పొగాకు చాలా ప్రధానమైనది.

దక్షిణ రోడీసియాలో యుద్ధప్రారంభంలో, యూరపు జనభాలోని పురు షుల్లో షుమారు 10 వంతు మంది, దేశీయులు షుమారు 25000 మంది, పొగాకు ఉత్పత్తిలో నిమగ్నులై ఉన్నారు. పొగాకు ఉత్పత్తికి అనువైన 2,000,000 యక రాల్లో కొద్దిభాగం మాత్రమే యింతవరకు ఉపయోగింప బడింది.

న్యాసాలాండ్ లో ప్రధాన యెగుమతి, పొగాకే. ఉత్తర రోడీసియాలోని వ్యవసాయ పంటలలో, మొక్కజొన్న తర్వాత ప్రధానమైంది పొగాకే.

యీ మధ్య ఆఫ్రికాదేశాల్లో, అధికశ్రమవల్లనూ, పెట్టిన ఒకమోస్తరు పెట్టుబడిని సక్రమంగా వినియోగించటంవల్లనూ, పొగాకు ఉత్పత్తి స్థాపింపబడటం

సాధ్యమైంది. అక్కడి వీరోపియులకు ఒక మోస్తరు సంపదభివృద్ధులనూ, ఆఫ్రికా దేశీయుల జీవితప్రమాణంలో వాంఛనీయమైన అభివృద్ధి నీపొగాకు తెచ్చింది.

## దిగుమతి సుంకాల్లో మార్పు.

డాలర్ ఎక్ఛేంజికి డిమాండును తగ్గించాలంటే, యీరోజుల్లో వీలైనంత వరకు సామ్రాజ్య దేశాలనుండే పొగాకు తెప్పించుకోటం చాలా అవసరం. దుర దృష్టవశాత్తు, 1938 నుండి పొగాకుపన్నులో వచ్చిన మార్పులు, సామ్రాజ్యంలో పొగాకు ఉత్పత్తి అభివృద్ధికి దోహదమిచ్చేవిగా లేవు.

మొట్టమొదట 1919 లో నిర్ణయించిన ప్రకారం, సామ్రాజ్య దేశాల పొగాకుకు యిచ్చిన ప్రిఫరెన్సు, దిగుమతి చేసుకొన్న పొగాకుపన్ను మొత్తంలో నూటికి 16⅔ వంతులు ఉండేది. 1925 సంవత్సరంలో యిది నూటికి 25 పాళ్లు పెంచబడింది; అంటే షి. 2-0½ పెన్నీలు. అప్పుడు మొత్తం పన్ను పౌ1కి షి. 8-2 పెన్నీలు. అట్టావాలో జరిగిన యింపీరియల్ ఆర్థిక మహాసభ తరువాత, 10 సంవత్సరాల వరకూ మొత్తంపన్నులో వచ్చేమార్పులో సంబంధంలేకుండా ప్రిఫరెన్సు యొక్క విలువ పౌ 1 కి షి 2-0½ పెన్నీలుగా స్థిరనిర్ణయం చేయబడింది. మొత్తం పన్నులో తగ్గింపులే యెక్కువగా జరుగుతవి గాని హెచ్చింపులకు అవకాశం లేదనే నమ్మకంతో యీ నిర్ణయం జరిగింది. కాని ఆ ఊహ తలక్రిందులైంది. 1938 నుండి యుద్ధ ఖర్చులకోసం పొగాకు మొత్తంపన్ను క్రమంగా షి 35.6 పెన్నీల వరకు పెరిగిపోయింది. 1938 లో యింగ్లండు - అమెరికా వ్యాపార ఒడంబడిక సందర్భంలో చర్చల ఫలితంగా 10 సంవత్సరాల స్థిరనిర్ణయ కాలానంతరం ప్రిఫరెన్సును గురించి పునరాలోచించవలసి రావటంచేత 1943 లో ప్రిఫరెన్సు, షి. 1-6½ పెన్నీలకు తగ్గింప బడింది. దీనితో పరిస్థితులు మరీ విషమించాయి. యీ రకంగా క్రమక్రమంగా 1925 లో నూటికి 25 పాళ్ళనుండి యీనాటికి వచ్చేసరికి నూటికి 4.35 వంతులకు తగ్గిపోయింది.

అమెరికానుండి అప్పుతీసుకొనే సందర్భంలో బ్రిటిష్ ప్రభుత్వం తరఫున యివ్వబడిన వాగ్దానాల ఫలితంగా, ప్రిఫరెన్సుయొక్క విలువలో యిప్పుడు మార్పులు సూచించటం నిష్ప్రయోజనం. యుద్ధకాలపు అదనపుపన్నువల్ల వచ్చిన ఆదాయంలో కొంతభాగం తగ్గించుకోడానికి అవకాశం దొరికినంతనే, పొగాకు మీద మొత్తంపన్నులో కొంతభాగం తగ్గించటంద్వారా ప్రిఫరెన్సు శాతమును కొంత యెక్కువ చేయటానికి, ఋణబడంబడికలో అభ్యంతరం ఏమీ లేనట్లే కన్పిస్తున్నది.

పొగాకు అధికోత్పత్తి అవకాశాలు :

ఉచితమైన ప్రిఫరెన్సు గనుక యిచ్చేటట్లయితే, సామ్రాజ్య దేశాల ఉత్పత్తిదారులు మనకు యిచ్చే పొగాకు, యుద్ధానికిముందు యిచ్చిన నూటికి 24 వంతులకంటె మించటానికి అవకాశం ఉంది. ఆ రకమైన సహాయంతోనూ, బ్రిటిష్ ఫ్యాక్టరీ యజమానుల సహకారంతోనూ, పొగాకుపంట విస్తీర్ణం పెరగటానికి చాలా అవకాశాలు ఉన్నవి. యీ పద్ధతి యిటు ఇంగ్లండుకూ, అటు పొగాకు పండించే దేశాలకూ కూడా లాభదాయకమే. కాని యీ దృష్టితో తీసుకొనే చర్యలకు తగిన ఫలితాలు కనీసం రెండేళ్ళకు తక్కువకాలంలో మాత్రం రావనే చెప్పవలసి ఉంటుంది.

చివరిమాట :

దూరదృష్టితో చూసినట్లయితే, వచ్చే సంవత్సరం జరుగబోవు ట్రేడ్ అండ్ ఎంప్లాయ్‌మెంటు మహాసభలో యునైటెడ్‌స్టేట్స్ ప్రతినిధులు బలవంతం చేయటానికి అవకాశం ఉన్న ప్రిఫరెన్సు తగ్గింపు విధానం సామ్రాజ్యానికీ, పొగాకు ఉత్పత్తి రాజ్యాలకుకూడా చాలా హానికరం. ముఖ్యంగా మధ్య ఆఫ్రికా విషయంలో యిది చాలా హానికరం. తగిన అవకాశాలు ఉన్నట్లయితే, సామ్రాజ్యంలోని పొగాకు, చుట్టల ఉత్పత్తిని ప్రోత్సహించి, తద్వారా, సామ్రాజ్య పొగాకు ఉత్పత్తిదార్లకు రక్షణ కల్పించటానికీ, యింగ్లండుకున్న డాలరు చిక్కులను తొలగించుకోటానికి, సాధ్యమైనంతవరకు, యిప్పటికంటె ప్రిఫరెన్సును పెంచటంమంచిది.

# అనుబంధము 5.

## దక్షిణదేశ మార్కెట్లో నమిలే పొగాకుకు, చుట్ట పొగాకుకూ ఉన్న ధరల వివరము.

(ధరలు యింపీరియల్ మణుగు 1 కి రూపాయలలో)

| | ఏప్రియల్ 1946 | మే 1946 | జూన్ 1946 | జూలై 1946 | ఆగష్టు 1946 | సెప్టెంబరు 1946 | నెలసరి సగటు | షుమారు గా పుట్టికి ధర |
|---|---|---|---|---|---|---|---|---|
| విజయనగరం దేశవాళీ పొటిఆకు. | 50.28 | 50.28 | 50.28 | 50.28 | 50.28 | 106.67 | 59.68 | 358.85 |
| మంగుళూరు నమిలే పొగాకు. | 58.78 | 58.78 | 95.63 | 95.51 | ... | ... | 77.17 | 463.02 |
| మీనంపాళెయం నమిలే పొగాకు. | 37.98 | 39.56 | 41.14 | 39.56 | ... | ... | 39.56 | 237.36 |
| తిరుప్పూరు ఎయిర్ క్యూర్డు. | 38.76 | 38.76 | 38.76 | 38.76 | ... | ... | 38.76 | 232.56 |

# అనుబంధము 6.

ఉత్పత్తిదారులకిచ్చిన ప్రశ్నావళికి జవాబులు యిచ్చిన గ్రామముల పేర్లు — నాటు పొగాకు.

| గుంటూరు తాలూకా | బాపట్ల తాలూకా | ఒంగోలు తాలూకా | | నర్సరావుపేట తాలూకా | | సత్తెనపల్లి తాలూకా | | తెనాలి తాలూకా | రేపల్లె తాలూకా |
|---|---|---|---|---|---|---|---|---|---|
| వాయివ్య నైరుతి ప్రాంతాలు | దక్షిణ ప్రాంతం | తూర్పు ప్రాంతం | పశ్చిమ ప్రాంతం | ఉత్తర చిలకలూరి పేట ప్రాంతం | దక్షిణచిలకలూరిపేట ప్రాంతం | ఉత్తర ప్రాంతం | దక్షిణ ప్రాంతం | పాటి పొగాకు | లంక ప్రాంతం |
| రేవతి, పెనిగండ్ల. గోరిజవోలుగుంట పాలెం, పళ్ళపాడు, చింతపల్లిపాడు, నిమ్మగడ్డవారి పాలెం, రావిపాడు, గొట్టిపాడు. | గొల్లపాలెం, స్వర్ణ, సంతరావూరు, దగ్గుబాడు, నాయుడువారి పాలెం, పూసపాడు, గోనసపాడు, ఇంకొల్లు. | చింతగుంటపాలెం, ఉప్పుగుండూరు, గంగవరం, కొనికి. | మేదరమెట్ల, అద్దంకి, బుడవాడ. | జాలాది, గంటెనపాడు, ఎడ్లపాడు, తాతపూడి, కావూరులింగంగుంట, దొండపాడు. | ఎడ్లపూడి, రంగారెడ్డిపాలెం. | పెదకూరపాడు, నార్నెపాడు, శిరిపురం, నందిగాం, వడ్డావల్లి. | ముప్పాళ్ళ, ఇరుకుపాలెం, మాదల, లంకలకూరపాడు, కొర్రపాడు, పాలడుగు, గార్లపాడు, మేడికొండూరు, తక్కెళ్ళపాడు. | — | — |

# అనుబంధము 6.

## ఉత్పత్తిదారుల కిచ్చిన ప్రశ్నావళికి జవాబులు యిచ్చిన గ్రామముల పేర్లు - ఫ్లూక్యూర్డ్ వర్జీనియా పొగాకు

| తాలూకా | ప్రాంతం | గ్రామములు |
|---|---|---|
| గుంటూరు తాలూకా | మెట్టభూమి | ఏటుకూరు, లాలిపురం, అనంతవరప్పాడు, గోదవర్రు, జొన్నలగడ్డ, పొన్నెకల్లు, కొప్పురావూరు, నారాకోడూరు. |
| | బాడవ | మందడం, పెదపరిమి, మల్కాపురం, తాడికొండ, వెలగపూడి, తుళ్ళూరు, దొండపాడు, కంతేరు, నేలపాడు. |
| బాపట్ల తాలూకా | మెట్ట భూమి | పరుచూరు, జాగర్లమూడి, తిమ్మరాజుపాలెం. |
| | పల్లపు భూమి | పాలపర్రు, తన్నీరువారిపాలెం, పెదనందిపాడు, చిననందిపాడు, కొమ్మూరు, నాగులపాడు, నర్సాయపాలెం, పెద్దివారిపాలెం, వీరన్నపాలెం, ఉప్పుటూరు, దేవరపల్లి, నాగభైరువారిపాలెం, ఈపూరివారిపాలెం. |
| ఒంగోలు తాలూకా | ఉత్తర ప్రాంతం | కొనికి, భీమవరం, చందలూరు. |
| | గుండ్లకమ్మ ప్రాంతం — తేలిక భూమి | ఉల్చి, కరవాది, అమ్మనబ్రోలు, బసవన్నపాలెం, మద్దిపాడు. |
| | గుండ్లకమ్మ ప్రాంతం — మందభూమి | నాగులుప్పలపాడు, ఒంగోలు, మర్లపాడు, త్రోవగుంట, మైనంపాడు, మండవవారిపాలెం, ఘడియపూడి. |
| | దక్షిణ ప్రాంతం | అలకూరపాడు, కంజేడు, టంగుటూరు, జమ్ములపాలెం, కాగుటూరిపాలెం, తూర్పునాయుడుపాలెం, నిడమలూరు. |
| నర్సారావుపేట తాలూకా | పసుమర్రు ప్రాంతం | వేలూరు. |
| రేపల్లె తాలూకా | లంక | వెల్లటూరు, పెదపులివర్రు. |
| తెనాలి తాలూకా | | దోనెపూడి, కొత్తరెడ్డిపాలెం. |

167

# అనుబంధము 7 (ఎ).

## పొగాకు కనీసధరల ఉపసంఘము పునర్విచారించి వర్జీనియా పొగాకుకు ఏర్పరచిన స్టాండర్డు గ్రేడ్లు (స్థానిక గ్రేడులు).

(వీటికి మూలాధారమైన గ్రేడులు గుంటూరు పొగాకు మార్కెట్ కమిటీచే నిర్ణయించబడి మద్రాసు గవర్నమెంటు ఆమోదాన్ని పొందినవి.)

ఫ్లూక్యూర్డు వర్జీనియా పొగాకు :

| ప్రస్తుతపు పేరు (Revised designation) | మొదటి పేరు (Original designation) | ప్రస్తుతపు గ్రేడ్ల వివరాలు (Revised Specifications) |
|---|---|---|
| I గుంటూరు. | నెం. 1 రు. | ఆకు 9 అం. లకు తగ్గని పొడవు కలిగి, సంపూర్ణంగాను, విస్తీర్ణంగాను, పల్చగాను ఉండాలి. పసుపుపచ్చ, నిమ్మపండురంగు, లేక లేత నారింజరంగు ఉండాలి. 7½% వరకు లేబచ్చగాను 6% వరకు 'స్పాంజింగ్' గాను ఉండవచ్చు. కాని మచ్చలుండరాదు. |
| II గుంటూరు. | నెం. 2 రు. | ఆకు 9 అం. తగ్గని పొడవు కలిగి, సంపూర్ణంగాను మధ్యరకమైన (medium) విస్తీర్ణము, మధ్యరకమైన మందమువుండాలి. రంగు దాదాపు నెం. 1రు. వలెనే గాని 15% ఆకుపచ్చ, 20% కొద్ది 'స్పాంజింగ్' గాను, కొద్ది మచ్చలు ఉండవచ్చును. |

| ప్రస్తుతపు పేరు | మొదటి పేరు | ప్రస్తుతపు గేడ్ల వివరాలు |
|---|---|---|
| III గుంటూరు. | నెం. 3 రు. | ఆకు 9 అం. తగ్గని పొడవు గలిగి, సంపూర్ణంగాను, పల్చదనానికి (fine) మధ్య రకమైన మందానికి మధ్యలో ఉండాలి. మంచి విస్తీర్ణంగా వుండాలి. పసువుపచ్చ, లెమన్ లేక నారింజ రంగు లుండవచ్చు. 30% వరకు 'స్పాంజి' అతుకులు (Spongy Patches), అక్కడక్కడ లేబచ్చ రంగు ఉండవచ్చును. ఆకుపచ్చ ముదురుగా గాని, దట్టంగాగాని ఉండరాదు. మచ్చలు మధ్య రకంగా వుండవచ్చు. |
| బి. యల్. గుంటూరు (విరిగిన ఆకు) | నెం. 4 రు. | చిన్నముక్కలుగా విరిగిన ఆకు. ప్రకాశవంతమైన రంగు ఉండాలి. 3 అం. నుండి 9 అం. వరకు పొడవు వుండాలి. |
| V గుంటూరు. | నెం. 5 రు. | ఆకుఅంతా ఎరుపుగాను, లేత బ్రౌన్ రంగు కలిగి, 'స్పాంజి' గాను, సంపూర్ణంగాను ఉండాలి; ఆకుపచ్చ వుండ నేరాదు. జీవంలేని చిన్న చిన్న ముక్కలు గూడా వుండరాదు. |
| యల్. జి. గుంటూరు. | నెం. 6 రు. | సంపూర్ణంగా వున్నఆకు. ఆకుపచ్చగా (లేబచ్చ) ఉండాలి. ముదురు ఆకుపచ్చగా మాత్రం వుండరాదు. |

| | | |
|---|---|---|
| డి. జి. గుంటూరు. | నెం. 7 రు. | ముదుగు ఆకుపచ్చరంగు గలిగిన సంపూర్ణమైనఆకు. పొడవు 9 అం. లకు అటు ఇటుగా వుండాలి. నలుపు లేక బ్రౌన్ గా ఉన్న అతుకులు ఉండాలి. |
| పి. యల్. గుంటూరు. | నెం. 8 రు. | నల్లటి ఆకు, 'స్పాంజి' గా నుండి, కొద్ది సాగుదల కలిగి పై గ్రేడ్లలో దేనిక్రిందికి రాకూడదు. |

గ్రేడింగ్ సమయంలో పొరపాట్లు రావచ్చును. అందువల్ల ఒక గ్రేడు పొగాకు లో దానితగువాటి తక్కువరకపు గ్రేడు యొక్క రంగు, మందము 1/16 వరకు ఉండ వచ్చును. కాని నెం. 1 గ్రేడు విషయంలో మాత్రం యిది చెల్లదు.

కాడ మొదలైనవి ఆకుగా పరిగణించ బడవు. పొగాకు దళసరిలో, పల్చన, మందము మధ్యరకము క్రమంగా, వాటి నాణ్యాల్ని తెలియ జేయును.

స్థానిక గ్రేడులు :—

సన్ క్యూర్డువర్జీనియాపొగాకు—"ఆగ్మార్కు" గ్రేడ్ల వలెనే (అనుబంధము 7 బి.)

నాటు (దేశవాళీ) పొగాకు "అగ్మార్కు" గ్రేడ్ల వలెనే (అనుబంధము 7 బి.)

# అనుబంధము 7 (బి).

## ఇండియాలో మ్యాన్యుఫ్యాక్చర్ చేయబడని పొగాకుయొక్క నాణ్యములవివరాలు— అగ్మార్కు గ్రేడుల వివరాలు:

| గ్రేడు పేరు | రంగు | దసరికళ | ఆకుయొక్క సంపూర్ణత, దానిస్థితి |
|---|---|---|---|
| 1. | ప్రకాశవంతంగాను, లెమన్ (నిమ్మపండు రంగు), కాంతివంత మైన నారింజ, రంగు లు కలిసిగాని విడి విడిగా గానిఉండాలి. | అతిపల్చన (fine) | ఆకు సంపూర్ణంగా వుండాలి. 'స్పాంజి' గాని, చిన్నముక్కలు గాని, జబ్బువల్ల చెడిపోయిన భాగాలుగాని లేకుండా పొడు గాటి ముక్కలుగా వుండాలి. |
| 2. | ,, | పల్చన (good) | సంపూర్ణమైన ఆకులుగాగాని, పొడుగాటి ముక్కలు గాని వుండి, అక్కడక్కడ కొద్దిగా 'స్పాంజి', బ్రౌన్‌గా గాని, జబ్బువల్ల చెడిపోయిన భాగా లు గాని ఉన్నా యివన్నీ కలిపి మొత్తం ఆకు విస్తీర్ణం లో 5% కు మించకుండా వుండాలి. |
| 3. | పసుపుచ్చ నుండి లేత నారింజరంగు వరకు. | మధ్యరకము (Medium) | సంపూర్ణమైన ఆకులు, లేక పొడుగాటిముక్కలు 'స్పాంజి' బ్రౌన్ చుక్కలు, జబ్బువల్ల |

| | | | |
|---|---|---|---|
| | | | చెడినభాగాలు కలిగి వున్నప్పటికి యివన్నీ కలిపి ఆకు విస్తీర్ణంలో 10% కు మించకుండా వుండాలి. |
| 4. | ,, | ,, | సంపూర్ణమైన ఆకులు, లేక పొడవాటిముక్కలు 'స్పాంజ' బ్రౌన్ చుక్కలు, జబ్బువల్ల చెడిన భాగాలు గలిగినా యివన్నీ కలిసి ఆకుమొత్తం విస్తీర్ణంలో 25% కు మించకుండా వుండాలి. |
| యల్. జి. | లేతబచ్చరంగు | ,, | ఆకు సంపూర్ణంగాను, లేక పొడవాటి ముక్కలు గాను, లేతబచ్చరంగుగలిగి, 'స్పాంజ' బ్రౌన్ చుక్కలు, జబ్బువల్ల, చెడిన భాగాలు అన్నీ కలిపి ఆకుమొత్తం విస్తీర్ణంలో 10% కు మించకుండా వుండాలి. |
| యల్.యల్.జి. | లేతమధ్యరకం ఆకుపచ్చ | మధ్యరకంనుండి ముతకవరకు (Medium to caurse) | ఆకు సంపూర్ణంగాను, లేక పొడవాటి ముక్కలు గాను ఉండి, ఆకుపచ్చరంగు గలిగి, 'స్పాంజ' బ్రౌన్ చుక్కలు, జబ్బువల్ల చెడినభాగాలుఅన్నీ కలిపి ఆకుమొత్తం విస్తీర్ణంలో 25%కు మించకుండావుండాలి. |

| గ్రేడు పేరు | రంగు | దళసరి | ఆకుయొక్క సంపూర్ణత, దానిస్థితి |
|---|---|---|---|
| డి. జి. | ముదుగుఆకు పచ్చ. | వివిధరకాలు (Variable) | ఆకు సంపూర్ణంగాను, లేక పొడవాటి ముక్కలు గాను, ఉండి, ముదుగు ఆకుపచ్చ రంగు గలిగి, యల్. జి. లేక యల్. యమ్. జి. గ్రేడ్లకు చెందకుండా వుండాలి. |
| యల్. బి.వై. 1 | లేతబ్రౌన్‌లాంటి పసుపుపచ్చ | మేలురకం లేక కలగలుపు (Fair body or mixed) | ఆకు సంపూర్ణంగాను, లేక పొడవాటి ముక్కలు గాను, ఉండి, బార్న్ అతుకులు, 'స్పాంజి' జబ్బువల్ల చెడిన భాగాల లాంటి చుక్కలు యివన్నీ కలిపి ఆకుమొత్తం విస్తీర్ణంలో 25% కు మించరాదు. |
| యల్.బి.వై.2 | ,, | ,, | అంతా పైదాని మాదిరిగానే ఉండి చుక్కలమొత్తంవిస్తీర్ణం ఆకు మొత్తం విస్తీర్ణములో 50% కు మించరాదు. |
| బి. | బ్రౌన్. | ,, | అంతా పైవిధంగానే వుండి చుక్కల మొత్తం విస్తీర్ణం ఆకు మొత్తం విస్తీర్ణంలో 40% కు మించరాదు. |
| డి. బి. | డార్కు బ్రౌన్ | ,, | అంతా పైవిధంగానే ఉండి చుక్కల మొత్తం విస్తీర్ణం ఆకు మొత్తం విస్తీర్ణంలో 40% కు మించరాదు. |

| | | | |
|---|---|---|---|
| బి. బి.1 | కాంతివంతమైన నిమ్మ పండురంగు లేక ప్రకాశవంతమైన రంగు | ,, | 1, 2 గ్రేడ్లకు చెందిన 3 అంగ తక్కువకాని, విరిగినముక్కలు |
| బి. బి.2 | బ్రౌన్ రంగు | మేలురకం | బి. బి. గ్రేడు కాక మిగతా గ్రేడులకు చెంది ఆకుపచ్చను మించిన ముక్కలు. |
| పి. యల్. | కలగలుపు రంగు | వివిధరకాలు | జీవంలేని ఆకు. |

సన్ క్యూర్డు పొగాకుకు ఆగ్మార్కు గ్రేడ్ల వివరాలు.

| గ్రేడు పేరు | రంగు | దళసరి | పనికిరాని భాగం |
|---|---|---|---|
| 1. | ప్రకాశవంతమైనరంగు | పల్చన | ఉండరాదు. |
| 2. | లేతబ్రౌన్ | మధ్యరకము | 1/16 |
| 3. | ముదుగుబ్రౌన్ | ,, | 2/16 |

నాటు (దేశవాళీ) పొగాకుకు ఆగ్మార్కు గ్రేడ్ల వివరాలు.

| గ్రేడు పేరు | రంగు | దళసరి | పనికిరాని భాగాలు |
|---|---|---|---|
| 1. | ప్రకాశవంతమైనరంగు | పల్చని సంపూర్ణమైనఆకు | ఉండరాదు. |
| 2. | లేతబ్రౌన్ | మధ్యరకము దళసరి మధ్యరకం ఆకు | 2/16 |
| 3. | లేత నలుపు | ,, | 2/16 |
| 4. | ముదురు బ్రౌన్ | బరువైన ఆకు | 2/16 |
| 5. | ముదురు నలుపు | ,, | 2/16 |

174

# మొదటి సమావేశం 30-11-46

హాజరైన సభ్యులు :-

శ్రీ కొల్లా వెంకయ్య, బి. ఏ.,
,, డి. వి. అప్పారావు, బి. ఏ.,
,, కొల్లూరు వెంకటేశ్వర్లు.
మిస్టర్. యఫ్. యన్. బి. జాన్స్టన్.

యీ క్రింది ప్రముఖులను సబ్ కమిటీలోనికి కో ఆప్టు చేసుకొని, తమ అమూల్యమైన కాలాన్ని సబ్ కమిటీ కృషిలో వినియోగించుటకు అవకాశం కల్పించుకొన వలసినదిగా వారిని కోరుటకు తీర్మానించడమైనది.

వర్తకులు :-

1. మెస్సర్సు. ఐ. యల్. టి. డి. కంపెనీ., లిమిటెడ్., చీరాల, ప్రతినిధి
2. ,, బ్రిటిష్ ఇండియా టుబాకో కార్పొరేషన్, గుంటూరు, ,,
3. ఇండియన్ టుబాకో అసోసియేషన్, గుంటూరు, ,,
4. ఈస్టుయిండియా టుబాకో ఫెడరేషన్, మద్రాసు, ,,
5. మెస్సర్సు. నూతలపాటి ఆంజనేయులు అండ్ కంపెనీ, గుంటూరు, ,,
6. శ్రీ కూనల సుబ్రహ్మణ్యం, చిలకలూరి పేట ,,

ఉత్పత్తిదార్లు :-

7. శ్రీ కాళిదాసు శంకరయ్య, తూమాడు.
8. ,, గోగినేని వెంకటసుబ్బయ్య, ఈతేరు,
గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీ మాజీసభ్యులు.
9. అఖిలభారత పొగాకు ఉత్పత్తిదార్ల సంఘం, గుంటూరు వారి ప్రతినిధి.
10. గుంటూరు జిల్లా రైతుసంఘం, గుంటూరు వారి ప్రతినిధి.

ఇతర ప్రముఖులు :—

11. గుంటూరు జిల్లా కాంగ్రెసు కమిటీ, గుంటూరు వారి ప్రతినిధి.
12. ప్రావిన్షియల్ మార్కెటింగ్ ఆఫీసరు (లేక వారిచే నియమితులు)మద్రాసు.
13. శ్రీ కె. చంద్రమౌళి, బి. యస్ సి., యం. యల్. ఎ., మారిస్ పేట, తెనాలి.
14. ,, మేడూరి నాగేశ్వరరావు, యం. యల్. ఎ., ఏటుకూరు.
15. జనాబ్ యం. ఎ. సలాం, బి. ఎ., బి. యల్., యం. యల్. ఎ.,గుంటూరు.
16. శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి, బి. ఎ., బి. యల్., నరసరావుపేట.

సబ్ కమిటీ త్వరలో జిల్లా అంతటా పర్యటనంచేసి, రైతులు, వర్తకుల వద్దనుండి కనీస ధరల నిర్ణయ సందర్భంలో సాక్ష్యాలను సేకరించే విషయమై యీ సమావేశంలో టూకీగా చర్చింపబడింది.

176

# రెండవ సమావేశం 12-12-46

సాయంత్రం 3 గంటలకు.

హాజరైన సభ్యులు :-

1. శ్రీ కొల్లా వెంకయ్య. బి. ఎ., ఛైర్ మన్.
2. ,, వావిలాల గోపాలకృష్ణయ్య, సభ్యులు.
3. మిష్టర్ హెచ్. ఇ. డబ్ల్యు. టైలర్ (సభ్యులైన మిష్టర్. యఫ్. యన్. బి. జాన్సన్ గారి స్థానంలో)
4. శ్రీ కె. నరశింగరావు, సభ్యులు.
5. శ్రీ డి. వి. అప్పారావు, బి. ఎ., ,,
6. శ్రీ డి. రామారావు, ,,
7. శ్రీ గట్టుపల్లి ఆంజనేయులు, ,,
8. శ్రీ యం. బాపయ్య, (సభ్యులైన మిష్టర్ డి.యన్. మూర్తిగారిస్థానంలో)

1. (ఎ) శ్రీ కూనల సుబ్రహ్మణ్యం, చిలకలూరిపేట, గారి స్థానంలో శ్రీ మైలవరపు గుండయ్య, చిలకలూరిపేట గారిని సబ్ కమిటీలోనికి కోఆప్టు చేసుకొనుటకు తీర్మానించడమైనది.

(బి) శ్రీ గోగినేని వెంకటసుబ్బయ్య, ఈతేరు, గారి స్థానంలో, శ్రీ కందిమళ్ళ రామమూర్తి, మురికిపూడి, గారు అంగీకరించని పక్షంలో శ్రీ లావు అంకమ్మ, పెదనందిపాడు, గారిని కోరుటకు తీర్మానించడమైనది.

(సి) అఖిలభారత పొగాకు ఉత్పత్తిదార్ల మహాసభవారు సబ్ కమిటీలో చేరుటకు తమకు అవకాశము లేదని తెలియపరచినందున, వారిస్థానంలో శ్రీ. యం. అమరారెడ్డి, పణిదం, గారిని కోఆప్టు చేసుకొనుటకు తీర్మానించడమైనది.

(డి) సబ్ కమిటీలోకి, గుంటూరుజిల్లా ముస్లింలీగ్ గుంటూరుజిల్లా కమ్యూనిష్టు కమిటీ, ప్రతినిధులనుగూడా కోఆప్టు చేసుకొనుటకు తీర్మానించడమైనది.

(ఇ) శ్రీ పోసాని ప్రకాశరావు, యం. ఎ., కృష్ణాయపాలెం గారిని కానీ, లేక

శ్రీ ఆలూరు లింగయ్య తుళ్ళూరు, గారినికానీ, లేక శ్రీ గట్టుపల్లి వెంక టప్పయ్య, కంతేరు, గారినికానీ, సబ్ కమిటీలోనికి కో ఆప్టు చేసుకొనుటకు తీర్మానించడ మైనది.

(యఫ్) గుంటూరు ఛేంబర్ ఆఫ్ కామర్సువారి ప్రతినిధిని సబ్ కమిటీలోనికి కో ఆప్టు చేసుకొనుటకు అంగీకరిస్తూ తీర్మానించడమైనది.

(జి) శ్రీ పాటిబండ్ల రంగనాయకులు, భీమవరం (ఒంగోలు తా॥) గారినికానీ, లేక శ్రీ లావు అంకమ్మగారినికానీ, లేక రావుబహదూరు శ్రీ జె. కుప్ప స్వామి చౌదరిగారినికానీ, లేక, గుంటూరు జిల్లా వ్యవసాయ సంఘంవారి ప్రతినిధినిగాని సబ్ కమిటీలోనికి కో ఆప్టు చేసుకొనుటకు తీర్మానించడ మైనది.

2. క్రిష్టమస్ కు పూర్వం రోజుల్లో సబ్ కమిటీ సంచార కార్యక్రమాన్ని నిర్ణ యించుటకు ఛైర్మన్ కు అధికారమిస్తూ తీర్మానించడమైనది.

సబ్ కమిటీ సభ్యులతో సంప్రదించిన అనంతరం యీ క్రింది విధంగా పర్యటన కార్యక్రమం నిర్ణయించడ మైనది.

| | | | |
|---|---|---|---|
| డిశెంబరు | 19 | యడ్లపాడు | నర్సరావుపేట తాలూకా. |
| | | గోరంట్లవారిపాలెం | ,, |
| | 20 | చిలకలూరిపేట | ,, |
| | | యద్దనపూడి | ,, |
| | 21 | కావూరు లింగంగుంట | ,, |
| | | ముప్పాళ్ళ | సత్తెనపల్లి తాలూకా |
| | 22 | ఇరుకుపాలెం | ,, |
| | | మేడికొండూరు | ,, |
| | 23 | గుంటూరుకు తిరిగివచ్చుట | |

1947 సం॥ జనవరి నెల మధ్యలో తమ రిపోర్టును గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీ వారికి అందజేయ గలుగవచ్చునని సబ్ కమిటీ సభ్యులనుండి సూచింపబడింది.

178

# మూడవ సమావేశం 16-1-47 - 17-1-47

16-1-47 న హాజరైన సభ్యులు :—

1. శ్రీ కొల్లా వెంకయ్య, ఛైర్మన్.
2. మిస్టర్ యఫ్. యన్. బి. జాన్సన్, సభ్యులు,
3. శ్రీ యం. వీరభద్రరావు, ,,
4. ,, యం. హనుమంతరావు, ,,
5. ,, గట్టుపల్లి ఆంజనేయులు, ,,
6. ,, డి. రామారావు, ,,
7. ,, పాటిబండ్ల రంగనాయకులు, ,,
8. ,, డి. వి. అప్పారావు, ,,
9. ,, కె. శంకరయ్య, ,,
10. ,, కె. నరశింగరావు, ,,
11. ,, యం. అమరారెడ్డి, ,,

దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు మొదలైన ప్రముఖ నాయకుల వద్దనుండీ, ప్రొఫెసర్లు మొ॥ వారి వద్దనుండి, రైతులు, వర్తకులు, యితర విజ్ఞానవేత్తల వద్దనుండి, కమిటీకి వచ్చిన అభిప్రాయాలు సబ్ కమిటీ సభ్యులకు చదివి వినిపించబడినవి. కమిటీ కోరగానే తమ అభిప్రాయాలుపంపి తోడ్పడిన పెద్దలందరికీ ఛైర్మన్‌గారు తమ కృతజ్ఞతను వెల్లడించారు. అంతట రిపోర్టులోని మొదటి 7 పేజీలు ఛైర్మన్‌గారు ప్రతిపాదించగా, అవి సభ్యులకు చదివి వినిపించబడినవి. యీ క్రింది సవరణలు, సూచనలు వచ్చినవి.

ఆహార పదార్థాలను కూడ తృణీకరించి రైతులు పొగాకు పండించటానికి ఐ. యల్. టి. డి. కంపెనీయేకారణమని, బాధ్యత కంపెనీదేననీ, రిపోర్టులో ఉన్న సూచన సరికాదని మిస్టర్ యఫ్. యన్. బి. జాన్సన్‌గారు సూచించగా, రిపోర్టులోని ఉద్దేశం అదియెంతమాత్రమూ కాదనీ, ఆభాగం అదేరీతిని సవరింపబడుతుందనీ ఛైర్మన్‌గారు సభ్యులకు చెప్పారు.

వినిమయదారుడు చెల్లించే ధరలో రైతుకు చెందవలసిన న్యాయమైన భాగాన్ని నిర్ణయించేందుకు ఒక విచారణ సంఘాన్ని నియమించ వలసినదని వ్యవసాయశాఖా డైరక్టరుగారిని కోరవలెననీ, ఆ నిర్ణయం ఆధారంతో 1947-48 సీజను కనీసధరలు నిర్ణయించ వచ్చుననీ, పై చెప్పిన కోరికను రిపోర్టులో చేర్చ వలసిందని సూచిస్తూ, యీ సంవత్సరానికి మాత్రం ఉత్పత్తిఖర్చులు, మార్కెటు పరిస్థితులు, వీటి ఆధారంతో కనీసధరలను గురించి చర్చించి నిర్ణయించ వలెననీ సూచించారు. పై విషయాలను రిపోర్టులో చేర్చుటకు ఛైర్మన్‌గారు అంగీకరించారు

6 వ పేజీలోని (టైపుచేయబడిన రిపోర్టులో) "సాధారణ మానవుని అధిక ఆదాయం" అనేమాటలు తీసివేసి దానికి బదులుగా 'యుద్ధకాలపు చౌకడబ్బు' అనే పదాలు చేర్చాలని శ్రీ డి. వి. అప్పారావుగారు సూచించిన సవరణను ప్రతిపాదకులైన ఛైర్మన్‌గారు అంగీకరించారు.

యేరకమైన వెనుకచూపు లేకుండా, రైతులకు న్యాయమైన ధరలను యివ్వవలసిందిగా వర్తకులను కోరుతూ ఒకవిజ్ఞప్తిని రిపోర్టులో చేర్చవలసిందని శ్రీ పాటిబండ్ల రంగనాయకులుగారు సూచించగా, ఆసూచన అంగీకరించబడింది.

సబ్‌కమిటీ సభ్యులుచేసిన యీ సవరణలు, సూచనలతో సహా 7 వ పేజీ చివరవరకు (టైప్‌చేయబడిన రిపోర్టులోని ఉపోద్ఘాతభాగం) మొదటి రీడింగులో ఏకగ్రీవంగా ఆమోదించ బడింది.

మిగిలిన భాగము, 15 వ పేజీవరకు చదువబడింది. 8 వ పేజీ చదువుతుండగా శ్రీ. డి. రామారావుగారు లేచిపోయారు. మొదటి రీడింగులో వివిధ సభ్యులు యీ క్రింది విషయాలు సూచించారు.

పొగాకు గ్రేడుచేసి అమ్మినపుడూ, డొల్లింపున అమ్మినపుడూ, వచ్చే ఆదాయంలోని వ్యత్యాసాలకు కారణభూతములైన వివిధ విషయాలను చర్చించాలని శ్రీ. డి. వి. అప్పారావుగారు సూచించారు. దీనిపై జరిగినచర్చ సందర్భంలో, మొదటి రీడింగు అనంతరం అన్నివిషయాలను చర్చించవచ్చునని ఛైర్మన్‌చేసిన సూచన ఆమోదించ బడింది. డొల్లింపున అమ్మకమూ, గ్రేడువారి అమ్మకము

లకుగల వ్యత్యాసానికి మూలకారణాలను చర్చించాలని శ్రీ. కె. నరశింగరావు గారు సూచించారు.

అంతట సమావేశం దినం 17-1-47 న ఉదయం 8 గంటలకు వాయిదా వేయబడింది.

17-1-47 ఉదయం హాజరైన సభ్యులు.

| | | |
|---|---|---|
| 1 | శ్రీ. కె. శంకరయ్య | సభ్యులు. |
| 2 | శ్రీ. పాటిబండ్ల రంగనాయకులు | ,, |
| 3 | శ్రీ. డి. వి. అప్పారావు | ,, |
| 4 | శ్రీ. కె. నరశింగరావు | ,, |
| 5 | శ్రీ. గట్టుపల్లి ఆంజనేయులు | ,, |
| 6 | శ్రీ. యం. వీరభద్రరావు | ,, |
| 7 | మిష్టర్ యఫ్. యన్. బి. జాన్సన్ | ,, |
| 8 | శ్రీ. కొల్లా వెంకయ్య | ఛైర్మన్. |
| 9 | మిష్టర్. సయ్యద్ మహబూబ్ | సభ్యులు. |
| 10 | శ్రీ. యం. అమారారెడ్డి | ,, |

యిదివరకు గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీ సూచించిన రేట్లు 1946-47 సంవత్సరానికే నా అనే విషయమై మిష్టర్ యఫ్. యన్. బి. జాన్సన్ గారు ప్రశ్నించారు. 'గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీ సూచించిన రేట్లు, కనీసధరల సబ్ కమిటీ సూచించిన రేట్లు అన్నపదాలను' 45-46 రేట్లు, 46-47 రేట్లు' అనే పదాలకు బదులుగా సవరించాలని శ్రీ. డి. వి. అప్పారావుగారు ప్రతిపాదించారు.

యిదివరకు గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీ సూచించిన రేట్లకు, యిప్పటి సబ్ కమిటీ రేట్లకూ భేదం ఉన్న కారణంచేత, యిప్పుడు సూచించే రేట్లను వర్తకు లందరికీ తెలియపరచి వారితో చర్చించాలని మిష్టర్ యఫ్. యన్. బి. జాన్సన్ గారు సూచించారు.

దీనికి సమాధానంగా 12-1-47 న వర్తకుల సమావేశంజరిగి యీవిషయంపై చర్చ జరిగినందువల్ల మళ్ళీ వర్తకులకు తెలియపరచటం అనవసరమనీ, యిప్పుడు సూచించిన రేట్లు పర్యటన సందర్భంలో చేసిన విచారణమీదనే ఆధారపడి ఉన్నవనీ శ్రీ. డి. వి. అప్పారావు, శ్రీ. యం. వీరభద్రరావు, శ్రీ. కె. శంకరయ్యగారలు జవాబు చెప్పారు.

పి. యల్. కూ, నెం 5 రు కూ సబ్ కమిటీ రిపోర్టులో సూచించిన ధరలు చాలా తక్కువగానున్నవనీ, ఆగ్రేడ్ల విషయంలో మార్కెటు ఆశాజనకంగా ఉన్నందువలన వాటిధర, పి. యల్ కు రు 90 లు. నెం 5 రు కు రు 300 ల వరకు పెంచాలని ప్రతిపాదించారు.

సబ్ కమిటీ సూచించిన ధరలమీద, నెం 1 రు నుండి నెం 4రు వరకు, 20%, నెం 5,రు డి. జి., పి. యల్. లకు 35% పెంచాలని, శ్రీ గట్టుపల్లి ఆంజనేయులు గారు సూచించారు.

శ్రీ మాదల వీరభద్రరావుగారు, అన్ని సవరణలు చేసిన అనంతరం, రిపోర్టు రెండవసారి చదవాలని చేసిన సూచన ఆమోదించబడింది.

గ్రేడ్ల విషయమైన తగాదాలను తప్పించుటకై, గుంటూరు గ్రేడ్లశాంపిల్సు గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీవారివద్ద ఉండాలని శ్రీ. గట్టుపల్లి ఆంజనేయులుగారు సూచించారు.

శ్రీ కాళిదాసు శంకరయ్యగారు, గ్రేడింగు సూపర్వైజర్లను నియమించి గ్రేడింగ్ కేంద్రాలలోని పొగాకు గ్రేడ్లను తరచుగా తనిఖీ చేయించాలని సూచించారు.

కచ్చాగ్రేడుకుకూడా కనీసధరలు నిర్ణయించాలని శ్రీ డి. వి. అప్పారావు గారు, ప్రతిపాదించారు.

24-1-47 వరకు సమావేశం వాయిదా వేయాలని శ్రీ. యం. వీరభద్రరావుగారు చేసిన సూచన ఆమోదించబడి సమావేశం 24-1-47 ఉదయం 9 గంటలకు వాయిదా వేయబడింది.

---

గమనిక :— 24.1.47 ఉదయం 9 గంటలకు గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీ ఆఫీసులో జరిగే సమావేశానికి హాజరు కావలసిందని సభ్యులందరూ కోరబడినారు.

182

# నాల్గవ సమావేశం - 24-1-47 - 25-1-47.

24-1-47 ఉదయం 9 గంటలకు హాజరైన సభ్యులు :

| | | |
|---|---|---|
| 1. | శ్రీ కొల్లా వెంకయ్య, | ఛైర్మన్ |
| 2. | శ్రీ ఉన్నవ గోపాలక్రిష్ణయ్య, | సభ్యులు |
| 3. | శ్రీ గట్టుపల్లి ఆంజనేయులు | ,, |
| 4. | శ్రీ డి. వి. అప్పారావు | ,, |
| 5. | శ్రీ కె. రామకృష్ణమూర్తి | ,, |
| 6. | శ్రీ లావు అంకమ్మ | ,, |
| 7. | శ్రీ కె. నరశింగరావు | ,, |
| 8. | శ్రీ డి. రామారావు | ,, |
| 9. | మిష్టర్ యస్. మహబూబ్ | ,, |
| 10. | మిష్టర్. యఫ్. యస్. బి. జాన్సన్ | ,, |
| 11. | మిష్టర్. జి. కమ్మింగ్ | ,, |
| 12. | మిష్టర్. యం ఎ. సలాం | ,, |
| 13. | శ్రీ కె. కుటుంబరావు | ,, |
| 14. | శ్రీ కె. శంకరయ్య | ,, |

16-1-47, 17-1-47 తేదీలలో జరిగిన సమావేశాల చర్చల వివరాలు చదువబడి, ఆమోదింపబడినవి.

రిపోర్టులోని యేడవ భాగం ఛైర్మన్‌గారిచే ప్రతిపాదింపబడి, యింగ్లీషు లోను, తెనుగులోను సభ్యులకు చదివి వినిపించబడింది.

రిపోర్టులోని 7 వ భాగంలోని 8 వ పారానుగురించి చర్చిస్తూ, అందులో తెల్పబడినట్లుగా మద్రాసు వ్యాపార పంటల చట్టాన్ని ప్రక్కజిల్లాలకు తాలూకా లకు విస్తరింపజేసి అమలు పరచటానికి బదులు, యీ కనీస ధరలస్కీము యావ

ద్వారతి దేశానికి కాకపోయినా, కనీసం మద్రాసు రాష్ట్రం అంతటిలోనైనా అమలుజరుపవలయుననీ, దానిమూలకంగా వివిధప్రాంతాలలోని ధరల వ్యత్యాసాల వల్ల కలిగే ఇబ్బందులను తప్పించటానికి అవకాశం కలుగుతుందనీ శ్రీ డి. రామారావుగారు సూచించారు. గ్రేడింగు యిన్స్పెక్టర్ల నియామకం సందర్భంలో, సర్టిఫై చేసే అధికారాలు యేదో ఒకడిపార్టుమెంటుకే వుండాలి, అంటే, యిప్పటిలాగానే యిండియా ప్రభుత్వపు పొగాకు గ్రేడింగ్ చీఫ్ యిన్స్పెక్టరు అధ్వర్యానగల అగ్‌మార్కు సర్టిఫికేషన్ శాఖకే యీ అధికారాలు ఉండాలనీ, వారు వాదించారు.

మిస్టర్ జె. కమ్మింగ్‌గారు రిపోర్టు 7 వ భాగంలో సూచింపబడిన బైలాల ఆచరణను గురించి ప్రస్తావిస్తూ, గుంటూరు జిల్లా లాంటి అతివిస్తర ప్రదేశంలో వాటిని అమలు జరుపటం దుస్సాధ్యమనీ, జిల్లాలోని అనేకగ్రామాలలో యివి అమలుపరచవలెనంటే వేలాది యిన్స్పెక్టర్ల నియామకం జరుగవలసి ఉంటుందనీ యిది చాలా కష్టసాధ్యమని సూచించారు.

చట్టవ్యతిరేకంగా తప్పుచేసినవారి విషయంలో తక్షణ విచారణకోసం, ముఖ్యంగా 7 వ భాగంలో సూచింపబడిన బైలాలను అమలుపరచే సందర్భంలో నియమింపబడే ప్రత్యేక వ్యవసాయశాఖాధికారులను గురించి చర్చిస్తూ, యిలాంటి అతి విశేషాధికారాలు యిచ్చినయెడల అవి దుర్వినియోగం చేయబడే అవకాశాలు కలవనీ, యిది ప్రజాసామాన్యానికి నష్టదాయకంగా పరిణమించవచ్చుననీ, యెక్సైజు శాఖలోని ఉద్యోగుల అధికారాలు పరిమితమైనవేననీ, శ్రీ కర్పూరపు రామకృష్ణమూర్తిగారు తెలియపరిచారు. పైగా యీ కనీసధరల స్కీమును రాష్ట్ర వ్యాపితంగా అమలుపరచాలనీ, లేనియెడల రాష్ట్రంలోని యితర ప్రాంతాలవారు మనపొగాకును కొనటంలో చిక్కులుయేర్పడుతవనీ వారు సూచించారు. గ్రేడ్ల తనిఖీ విషయంలో, యిప్పుడున్న అగ్‌మార్కు యిన్స్పెక్టర్లలోనే యీ సందర్భంలో పరస్పర అభిప్రాయభేదాలు ఉన్నాయనీ, టుబాకో మార్కెట్ కమిటీచే నియమింపబడే గ్రేడింగ్ యిన్స్పెక్టర్ల మూలకంగా యింకా గందరగోళం జరుగుతుందనీ వారు అభిప్రాయపడ్డారు.

శ్రీ డి. రామారావుగారు తాము ప్రాతినిధ్యం వహిస్తున్న యిండియా టుబాకో యెసోసియేషన్ లోని రైతుసభ్యుల తరఫున మాట్లాడుతూ, కచ్చా గ్రేడు అమ్మకాల నిషేధం రయితుల శ్రేయస్సునుగోరి రిపోర్టులోనుండి వెంటనే తీసివేయాలని కోరారు.

తరువాత రిపోర్టులోని 8వ భాగం ఛైర్మన్ గారిచే ప్రతిపాదింపబడి, యింగ్లీషు, తెనుగు, ఉభయ భాషలలోనూ చదివి వినిపించబడింది.

శ్రీ డి. రామారావుగారు 1946–47 సీజనులో పొగాకు పంట నిరుత్సాహ జనకంగా ఉన్నదని అంగీకరిస్తూ, అంతర్జాతీయ పొగాకు మార్కెటుకూడా నిరుత్సాహ కరంగానే ఉందనిసూచించారు. లండన్‌లోని ఒకానొక పొగాకు దిగుమతిదారుని వద్దనుండి వచ్చినదని చెప్పి, వారు ఒక లేఖలోని కొన్నిభాగాలను చదివి వినిపించారు. పొగాకుపంట విస్తీర్ణాన్ని అధికంచేసి దాదాపు 60 మిలియన్లపౌనులు పండించాలని ప్రయత్నిస్తున్న రొడీసియా ఉత్పత్తిదారులు, తమ పొగాకుకు యూరపు ఖండములో డిమాండు ఉన్నంతకాలం తమ పొగాకు ధరలను తగ్గించటానికి యేమాత్రం యిష్టపడరని లేఖలో వివరించబడింది. ఫ్లూక్యూర్డు యిండియా పొగాకు ధరలు యింక యెంతమాత్రం హెచ్చటానికి వీలులేదని ఆలేఖలో సూచించ బడిందికూడా.

సబ్‌కమిటీ చేసే నిర్ణయాలను సాధ్యమైనంత త్వరలో అమలులోనికి తేవాలని ప్రభుత్వంవారిని కోరేందుకు ఒక రాయబార వర్గాన్ని పంపించాలని జనాబ్ యం. ఎ. సలాం, యం. యల్. ఎ., గారు సూచించారు.

కనీస ధరల నిర్ణయం ఒక జిల్లాకు మాత్రమే అమలు జరపటం కూడదనీ, యీ విషయం కేంద్ర ప్రభుత్వ నిర్ణయానికి వదలివేయ వలసిందనీ, మిస్టర్ యఫ్. యన్. బి. జాన్సన్ గారు సూచించారు.

చెట్టూరు రిపోర్టులో చైనా మనదేశంనుండి కొనటానికి అవకాశం ఉన్నదని సూచింపబడిన మొత్తం, 16 మిలియన్ల పౌనులు కాదు, 10 మిలియన్ల పౌనులు మాత్రమేనని శ్రీ కర్పూరపు రామకృష్ణమూర్తిగారు సూచించారు.

సబ్ కమిటీ రిపోర్టులో వేసిన 16 మిలియన్ల పౌనులు, 'కామర్సు' అనే పత్రికనుండి గ్రహింపబడిందనీ, శ్రీ రామకృష్ణమూర్తిగారు చెప్పినది ప్రభుత్వం వారి ప్రచురణలో నుండి కాబట్టి, అది అంగీకరించవచ్చుననీ, సభ్యులకు శ్రీ సి. వి. యస్. శ్రేష్ఠిగారు తెలియజేశారు.

సిగిరెట్ల, చుట్టల పరిశ్రమలు అభివృద్ధి పరచాలని ప్రభుత్వానికి ఒకవిజ్ఞప్తిని రిపోర్టు 8 వ భాగం చివరలో చేర్చాలని శ్రీ. డి. వి. అప్పారావుగారు సూచించారు.

చర్చల సందర్భంలో గుంటూరులోని వివిధ వర్తక ప్రముఖులు పాల్గొని, యీ విషయంమీద తమ అభిప్రాయాలను వెల్లడించటానికి అనుమతించవలసినదని ఛైర్మన్‌గారిని కోరారు. అసలు సిద్ధాంతంమీద తమ అభిప్రాయాలను యివ్వ టానికి బదులు, చర్చలలో వచ్చిన వివిధ ముఖ్యాంశాలమీద తమ అభిప్రాయా లను యిచ్చి, సబ్ కమిటీ సరియైన నిర్ణయాలకు వచ్చేందుకు తోడ్పడ వలసిందని ఛైర్మన్‌గారు వర్తకులకు విజ్ఞప్తి చేశారు. కాని వర్తకులు కనీసధరల సిద్ధాంతం మీదా, రిపోర్టుమీదా తమ అభిప్రాయాలను ప్రకటించనీయ వలసిందని కోరారు.

మొదటి మూడు భాగాలు యింతకుపూర్వమే సబ్ కమిటీవారిచేత ఆమో దింపబడి నందువలన, మిగిలిన 4 నుండి 8 వ భాగం వరకు తమ అభిప్రాయాలను వెల్లడించటానికి వర్తకులను అనుమతించవచ్చునని జనాబ్ యం. ఎ. సలాం యం. యల్. ఎ. గారు సూచించారు. వర్తకులు తమ అభిప్రాయాలను వెల్లడించ టానికీ సూచనలు యివ్వటానికీ, సబ్ కమిటీ అంగీకరించింది. మాట్లాడటానికి ఉద్యుక్తులైన వర్తక ప్రముఖుల పేర్లను కమిటీ తీసికొన్నది.

ఈ సందర్భంలో, శ్రీ యస్. వి. రంగారావు, శ్రీ పి. రామచంద్రరావు, శ్రీ పి. వెంకటరత్నం, శ్రీ టి. కె. నాగయ్యగారలు ప్రసంగించారు.

యిండియన్ టుబాకో యెక్స్‌పోర్టు కంపెనీకి చెందిన శ్రీ యస్. వి. రంగా రావుగారు, వ్యవసాయ పంటలకు కనీసధరల నిర్ణయ సిద్ధాంతం అవసరమని రాజ కీయ నాయకులూ, కృష్ణమాచారి సబ్ కమిటీ వెల్లడించిన అభిప్రాయాలతో యేకీభవిస్తూ, యీ కార్యభారాన్ని గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీలాంటి సంస్థ నిర్వహించటానికి పూనుకోటం చాలా సాహసం అన్నారు. ఈ సందర్భంలో

వర్తకులు తగినంతగా సహకరించటం లేదని చెప్పి, సబ్ కమిటీవారితో సహకరించటానికి తమ సంసిద్ధతను వెల్లడించారు. పొగాకు వర్తకంలో తగినంత అనుభవం లేనందువల్ల యిలాంటి విషయాల్లో రాజకీయవేత్తల, యితర ప్రజాప్రముఖుల అభిప్రాయాలు అంతప్రయోజనకారులు కావని వారుఅభిప్రాయపడ్డారు. వర్తకులకు అవుతున్న ఖర్చుల విషయంలోనూ, పొగాకు భూముల అధిక కవుళ్ళ విషయం లోనూ యింకా యెక్కువలోతుగా ఆలోచించి, సమగ్రమైన విచారణ చేయటం అవసరమని వారు సూచించారు. ఈ సందర్భములో సబ్ కమిటీకి కొంత సమాచారాన్నిగూడా సేకరించి యిస్తానని వారు వాగ్దానంచేశారు. వర్తకులకూ, రైతులకూ మధ్య పరస్పర మనస్పర్థలకూ, అవిశ్వాసానికీ కనీసధరల నిర్ణయం దారి తీయవచ్చునని వారు సందేహం వెలిబుచ్చారు.

శ్రీ పి. రామచంద్రరావుగారు ప్రసంగిస్తూ, మార్కెట్‌లో అప్పుడప్పుడు నిలిచిపోయే నిల్వసరుకులకు రంగు తగ్గిపోవటం, మొదలైన విషయాలకు తగిన సదుపాయాలు గనుక మనం కల్పించుకో గలిగినట్లయితే కనీస ధరల నిర్ణయ సిద్ధాంతానికి యెవరికీ యెట్టి అభ్యంతరంగాని ఉండటానికి యేమాత్రం అవకాశం లేదన్నారు.

శ్రీ టి. కె. నాగయ్యగారు మాట్లాడుతూ, కనీసధరలు నిర్ణయించేముందు విదేశ మార్కెట్లలోని ధరలనుకూడా దృష్టిలో ఉంచుకోవటం చాలా అవసరమని సబ్ కమిటీకి సలహా యిచ్చారు.

బూర్గు విశ్వనాథం బ్రదర్సువారి ప్రతినిధిగా వచ్చిన శ్రీ పి. వెంకటరత్నంగారు వేలంవిధానంలోని పోటీవల్ల ఉత్పత్తిదార్లకు తగినంత యెక్కువ గరిష్ఠధరలు రావటానికై, జిల్లాలోని పొగాకు కొనుగోలు, అమ్మకం అంతా గుంటూరు టుబాకో మార్కెటు కమిటీవారి మార్కెటు యార్డులు, వేర్‌హౌస్‌లలోనే జరిగేటట్లు నిర్బంధ విధానం అమలుపరచాలనీ, ఆ కనీసధరలమీదకంటే యీ విషయం మీద యెక్కువగా దృష్టిని కేంద్రీకరించాలనీ విజ్ఞప్తి చేశారు.

సభలో హాజరై ఉన్న వర్తకులకూ, ముఖ్యంగా చర్చలలో పాల్గొని తోడ్పడిన వర్తక ప్రముఖులకు కృతజ్ఞతను తెలియపరస్తూ, మాట్లాడిన వ్యాపార

ప్రముఖులందరు కనీసధరల నిర్ణయ సిద్ధాంతం విషయంలో కమిటీతో ఏకాభిప్రాయం వెలిబుచ్చినందుకు ఛైర్మన్‌గారు తమ సంతృప్తిని వెల్లడించారు. శ్రీ యస్. వి. రంగారావుగారికి సమాధానంయిస్తూ ఛైర్మన్‌గారు, దేశ వ్యవసాయానికీ, తన్మూలకంగా వ్యాపారానికీ దెబ్బతగిలే వ్యావసాయిక సంక్షోభం రాబోతున్న కారణంచేతనే కమిటీ యింతటి కార్యనిర్వహణకు సాహసించి పూనుకున్నదని చెప్పారు. యిలాంటి విషయాలలో రాజకీయవేత్తల, యితర ప్రజా ప్రముఖుల అమూల్య అభిప్రాయాలు యెంతైనా అవసరమనీ, దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారిలాంటి ప్రముఖులు చాలా లోతుకుపోయి దీని విషయం ఆలోచించి తమ అభిప్రాయం యిచ్చారనీ, అలాంటి పెద్దలు సంకుచిత దృష్టిలేకుండా, నిష్పాక్షికంగానూ, విశాలంగానూ సమస్యలను చర్చించి అభిప్రాయాలు యిస్తారనీ ఛైర్మన్‌గారు వివరించారు. పైగా కనీసధరల మూలకంగా రైతువర్తకుల మధ్య పరస్పర అవిశ్వాసం కలగటానికి అవకాశం యేమాత్రం కనిపించటంలేదని అన్నారు.

కనీసధరలు అమలు పరచటం కొందరు కేంద్రప్రభుత్వంద్వారా జరగాలనీ, కొందరు రాష్ట్రీయ ప్రభుత్వంద్వారాననీ, మరికొందరు ఒకజిల్లాకంటే తక్కువ ప్రదేశాలలో అమలు జరగాలనీ, చేసిన సూచనల సందర్భంలో మాట్లాడుతూ, ఈ కనీసధరల సమస్యను కేంద్రప్రభుత్వం తీసుకొన్నప్పుడు, గుంటూరులాంటి ముఖ్యప్రదేశంలోనే అమలు పరచవలసి ఉంటుందనీ, గుంటూరు టుబాకో మార్కెటుకమిటీ అమలు పరచటందానికి సహాయకారిగానే ఉంటుందనీ, యిది తగిన సమయంలో, సరియైన కృషియనీ, వివరించి, ఛైర్మన్‌గారు వేలంపద్ధతి ఈ ప్రధాన సమస్యకు దోహదమిస్తుందికాని దీనికిబదులు అది అమలు పరచవలెననటం మంచిది కాదనీ, చెప్పారు. శ్రీ పి. వెంకటరత్నంగారు చేసిన కంపల్‌సరీ మార్కెటింగు సూచనను ప్రశంసిస్తూ, ఛైర్మన్‌గారు, దానికి కావలసిన పనులన్నీ సాధ్యమైనంత త్వరలోనే పూర్తికాగలవని ఆశించారు.

25-1-47 తేదీన చర్చించవలసిన అంశాలను నిర్ణయించుకునేందుకై సబ్ కమిటీ 24-1-47 సాయంత్రం 4 గంటలకు వాయిదా వేయబడింది.

# 24-1-47 సాయంత్రం 4 గంటలకు సమావేశము

హాజరైన సభ్యులు :—

| | | |
|---|---|---|
| 1 | శ్రీ డి. వి. అప్పారావు | సభ్యులు |
| 2 | మిష్టర్ యస్. మహబూబ్ | ,, |
| 3 | ,, యం. ఏ. సలాం | ,, |
| 4 | శ్రీ కె నరశింగరావు | ,, |
| 5 | మిష్టర్ యఫ్. యన్. బి. జాన్సన్ | ,, |
| 6 | మిష్టర్ జి. కమ్మింగ్ | ,, |
| 7 | శ్రీ లావు అంకమ్మ | ,, |
| 8 | శ్రీ గట్టుపల్లి ఆంజనేయులు | ,, |
| 9 | శ్రీ కె. శంకరయ్య | ,, |
| 10 | శ్రీ కొల్లా వెంకయ్య, | ఛైర్మన్ |

16-1-47 న జరిగిన సమావేశం చర్చల వివరాలలో (హౌసింగ్స్) సూచించిన విధంగా, రిపోర్టులోని మొదటి 3 భాగాలు ఏకగ్రీవంగా ఆమోదింపబడిన విషయం తనకు తెలియనే తెలియదని మిష్టర్ జాన్సన్ తనతో చెప్పినట్లుగా ఛైర్మన్ గారు సభ్యులకు తెలియజేశారు. ఈవిషయమై తరువాత సమావేశంలో చర్చించవచ్చునని చెప్పి, యిప్పటినుంచి చర్చల వివరాలను అతిశ్రద్ధతో వినవలసిందనీ అసందర్భాలురాకుండా ఉండేందుకు సావధానులై ఉండవలసిందనీ ఛైర్మన్ గారు సభ్యులకు విజ్ఞప్తి చేశారు.

రిపోర్టులో 4 నుండి 8 భాగాలవరకు చదువబడిన సందర్భంలో వచ్చిన ముఖ్య అంశాలను, మొదటిభాగంలో శ్రీ కె. శంకరయ్యగారు సూచించిన యింకా రెండు అంశాలను, తయారు చేశారు. సభ్యుల ఆమోదానంతరం ఆయా విషయాలు రిపోర్టులో చేర్చబడుతవి. చర్చకై తయారు చేసిన అంశాలు యివి.

1. పొగాకు గ్రేడ్ చేసి అమ్మినప్పుడు, డొల్లింపున అమ్మినపుడు, వచ్చే ఆదాయం లోని వ్యత్యాసాలకుగల ముఖ్యకారణాలు.

2 'గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీ సూచించిన రేట్లు – సబ్ కమిటీ సూచించిన రేట్లు' అనేపదాలు '45-46 రేట్లు – 46-47 రేట్లు' అనే పదాలనే బదులుగా వాడుట.

3. పి. యల్. కూ నెం 5 రు కూ ధరలు రు 90 లు, రు 300 లు వరకు హెచ్చించుట.

4. పెద్దగ్రేడ్లకు 20%, నెం 5కు, డి. జి., పి. యల్. గ్రేడ్లకు 35% పెంచుట (గుంటూరు టుబాకో మార్కెటు కమిటీ సూచించిన రేట్లకంటే).

5. తగాదాల సందర్భంలో సహాయకారిగా నుండుటకు గుంటూరు గ్రేడ్ల శాంపిళ్లు గుంటూరు టుబాకో మార్కెటు కమిటీవారివద్ద నుంచుట.

6. గ్రేడింగు సూపరువైజర్లు తప్పనిసరిగా తనిఖీ చేయుట.

7. కచ్చాగ్రేడుకుకూడా కనీసధరలు నిర్ణయించుట.

8. కనీసధరల స్కీమును మదరాసురాష్ట్రమంతటా అమలు పరచుట.

9. టుబాకో మార్కెట్ కమిటీ గ్రేడింగు యిన్స్పెక్టర్ల నియామకంవల్ల కలగ వచ్చునని చెప్పబడుతున్న యిబ్బందులను గురించి చర్చించుట.

10. (గుంటూరు జిల్లా) అధిక విస్తీర్ణంలో అమలు పరచుటవలన కలిగే కష్ట నిష్టూరాలను చర్చించుట.

11. చట్ట వ్యతిరేకులకు తక్షణ శిక్షలు విధించే అధికారాలను కొందరు ఉద్యోగు లకు కల్పించుటవల్ల కలిగే అపాయాన్ని చర్చించుట.

12. యిండియా పొగాకుకు 1947 లో మార్కెటు పరిస్థితులను గురించి విచారించుట.

13. కనీసధరల విషయంలో విచారించుట. అంతిమ నిర్ణయానికి వచ్చిన అనంతరం మదరాసు ప్రభుత్వంవద్దకు ఒక రాయబారవర్గాన్ని పంపుట.

14. పొగాకు పంటకు ఎంతవరకు సారవంతమైన భూములు కావలెనో చర్చించుట.

15. రిపోర్టు నాల్గవభాగంలోని, 3, 4 పేజీలలో (టైపుచేసిన రిపోర్టులో) సూచించిన అంకెలు యెలావచ్చినదీ తెలుపుతూ కొంత వివరణను ఆభాగంలో చేర్చుట.

16. యకరం 1 కి 675 పౌ॥ సగటుపంట యెలావచ్చినదీ, తెలుపుతూ కొంత వివరణను ఆభాగంలో చేర్చుట.

17. యిప్పటి చర్చల ననుసరించి గ్రేడ్లవర్ణన తగినట్లుగా మార్పుజేసి డైరెక్టరు గారి అనుమతి పొందుట.

18. బి. ఢుల్. కు కూడా ధరను నిర్ణయించుట.

19. పొగాకు పంటకు ఎంతవరకు సారవంతమైన భూములు కావలెనో చర్చించుట.

20. ఏవైనా యితర మాటల మార్పులు చేయుట.

21. ఎండు వర్జీనియా పొగాకుకుకూడా గ్రేడ్లను నిర్ణయించుట.

22. రిపోర్టు 8 వ భాగం చివరలో 'సిగిరెట్లు, చుట్టల పరిశ్రమలను నెలకొల్పి అభివృద్ధిపరచే విషయంలో ప్రభుత్వానికి సలహాలను' అనేమాటలు చేర్చుట.

23. మొదటిభాగం మొదటి పేజీలో 'తెలిపగల' అనేమాటను తొలగించుట.

24. ఒకేరకం నాటు పొగాకుకు ధరలలో గల వ్యత్యాసానికి కారణాలను చర్చించుట.

25—1—47 న హాజరైన సభ్యులు.

| | | |
|---|---|---|
| 1. | శ్రీ కె. శంకరయ్య | సభ్యులు |
| 2. | శ్రీ కొల్లా వెంకయ్య | ఛైర్మన్ |
| 3. | మిష్టర్ యస్. యన్. బి. జాన్సన్ | సభ్యులు |
| 4. | శ్రీ పి. ప్రకాశరావు | ,, |
| 5. | శ్రీ కె. నరశింగరావు | ,, |
| 6. | శ్రీ లావు అంకమ్మ | ,, |
| 7. | శ్రీ డి. వి. అప్పారావు | ,, |
| 8. | శ్రీ గట్టుపల్లి అంజనేయులు | ,, |
| 9. | మిష్టర్ యస్. మహబూబ్ | ,, |
| 10. | శ్రీ డి. రంగారావు | ,, |
| 11. | శ్రీ కె. రామకృష్ణమూర్తి | ,, |
| 12. | మిష్టర్ యం. ఎ. సలాం | ,, |
| 13. | శ్రీ డి. యన్. మూర్తి | ,, |

మొదటి 3 భాగాలలో 16-1-47 న ప్రతిపాదింపబడిన సభ్యులచే ఆమోదించబడిన సవరణలు ఆయా ప్రదేశాలలో చేర్చబడినవి.

విషయ వివరణ పద్ధతిలో నాలుగు చిన్న సవరణలు ఏకగ్రీవంగా ఆమోదింపబడినవి. యింకా మూడు సవరణలు ఆమోదింపబడినపుడు ఒక్క సభ్యుడు మాత్రమే తటస్థంగా ఉన్నాడు.

గ్రేడుచేసి అమ్మినప్పుడూ, డొల్లింపున అమ్మినపుడు వచ్చే ఆదాయంలోని భేదం విషయంలో శ్రీ డి. వి. అప్పారావుగారు ప్రతిపాదించిన సవరణ అంగీకరింపబడింది. 4 వ భాగంలో కొన్ని చిన్న చిన్న సవరణలు, రచనా పద్ధతిలో కొన్ని సవరణలుకూడా అంగీకరింపబడినవి.

ఈ స్థితిలో శ్రీ కె. రామకృష్ణమూర్తి, జనాబ్ యం. ఎ. సలాం, యం. యల్. ఏ., గార్లు సభవదలి వెళ్ళిపోయారు. కొద్ది నిముషాల తర్వాత సలాంగారు తిరిగి వచ్చారు.

ఫ్లూక్యూర్డు వర్జీనియాకు స్టాండర్డు గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీ గ్రేడ్లను గురించిన, మార్పు చేయబడిన నూతన నిర్ణయం శ్రీ కె. శంకరయ్యగారిచే ప్రతిపాదింపబడి, సభ్యులచే చర్చించబడి, నలుగురు సభ్యులు మాత్రము తటస్థులై యుండగా అంగీకరింపబడింది. ఈ చర్చల కాలంలో శ్రీ డి. యన్. మూర్తిగారు వచ్చారు. శ్రీ కె. రామకృష్ణమూర్తిగారుకూడా తిరిగి వచ్చారు. ఈ స్థితిలో అసలు కనీసధరల సిద్ధాంతంమీద తమ అభిప్రాయాన్ని తీసుకోవలసిందని శ్రీ డి. యన్. మూర్తిగారు కోరారు. ఛైర్మన్ గారు జవాబు చెప్తూ, గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీ, యితర సభ్యులను కోఆప్టు చేసుకొనే అధికారంతో ఒక సబ్ కమిటీని నియమించిందనీ, ఆ కమిటీ ప్రముఖ ఉత్పత్తిదార్లను, వర్తకులనూ కలుపు కొన్నదని చెప్పి, ఆయా ప్రముఖుల సలహాలు సబ్ కమిటీ చర్చలలో ప్రతిభాగం లోనూ అవసరమేననీ, అందువలన శ్రీ డి. యన్. మూర్తిగారు తమ అభిప్రాయా లను చివరలో యివ్వవచ్చుననీ, ప్రస్తుతం చర్చలలో పాల్గొని తమ సలహాలను యిచ్చి తోడ్పడవలెననీ విజ్ఞప్తి చేశారు.

ఈ సమయంలో శ్రీ డి. రామారావుగారు తాము యిచ్చిన అసమ్మతి (డిసెంటు)ని సభ్యులకు చదివి వినిపించవలసినదనికోరారు. ఛైర్మన్ గారు డిసెంటు విషయం చివరకు విచారించబడుతుందని సమాధానం యిచ్చారు.

కనీసధరల నిర్ణయం కేంద్రప్రభుత్వంద్వారా జరిగితే దానికి తానుదానికి సుముఖుడే అయినప్పటికీ, అసలు ఆ సిద్ధాంతానికే తాను ప్రస్తుతం వ్యతిరేకి కావటంవల్ల దానికి సంబంధించిన చర్చల వివరాలలో తనకు యేమాత్రం శ్రద్ధ లేదని సభ్యులకు శ్రీ. డి. యన్. మూర్తిగారు తెలియపరచారు. అనిచెప్పి వారు యీ విషయంలో తమ అభిప్రాయం యిప్పుడే వెల్లడింపనీయక పోయినట్లయితే, సబ్ కమిటీ సభ్యత్వానికి రాజీనామా యిస్తానని అన్నారు. ఛైర్మన్, కొందరు యితర సభ్యులూ, ప్రత్యేక అభిప్రాయాలుగాని, డిసెంటుగాని చివరకు యివ్వ

వచ్చునని సమాధానం యిచ్చారు. అనంతరం మొదటి 3 భాగాలు తాను ఆమోదించినట్లు భావించబడుతున్న విషయం తనకు యేమాత్రం తెలియదని వ్రాసిన జాబును చదువవలసిందని మిష్టర్. యస్. యక్ బి. జాన్సన్ ఛైర్మన్‌గారిని కోరారు. మొదటి 3 భాగాలు ఏకగ్రీవంగా ఆమోదింపబడిన నాటి వివరాలను ఛైర్మన్‌గారు సభ్యులకు విశదపరచి జాన్సన్‌గారి లేఖను చదివారు. ఆలేఖలో యీ క్రిందివిధంగా వ్రాసి ఉన్నది.

"ఫ్లూకూర్డు పొగాకులోని వివిధగ్రేడ్లకు కనీసధరలు నిర్ణయించి, ప్రభుత్వామోదానికి పంపబడనున్న మీ రిపోర్టులోని ఉపోద్ఘాతభాగంలో మీరు యీక్రింది విధంగా ఒక పేరాను చేర్చియున్నారు.

ప్రథమంలో పొగాకును ప్రవేశపెట్టి, తగిన ప్రచారంచేసి, సరుకును ప్రతియేడూ కొనుగోలు చేస్తూన్న యిండియన్ లీఫ్ టుబాకో డెవలప్‌మెంటు కంపెనీ లిమిటెడ్‌వారు యిచ్చిన ప్రోత్సాహంవల్ల రైతులకు యితర వ్యాపార పంటల కంటే పొగాకుమీద వ్యామోహం యెక్కువై, యిటీవల ఆహార పంటలనుగూడా వదలి పొగాకునే పండించేవరకుగూడా పరిస్థితులు వచ్చినవి.

16 వ తేదీ సమావేశంలో, యీ పై వాక్యము నిజంకాదనీ, యిండియన్ లీఫ్ టుబాకో డెవలప్‌మెంటు కంపెనీవారు ఆహార ధాన్యాలుకూడా వదలి పొగాకును పండించమని రైతులను యెప్పుడూ ప్రోత్సహించనేలేదనీ, కాబట్టి ఆభాగాన్ని రిపోర్టులోనుండి తొలగించవలసిందనీ, నేను మీకు సూచించాను.

అంతట మీరు సమాధానం చెప్తూ, యిండియన్ లీఫ్ టుబాకో డెవలప్‌మెంటు కంపెనీవారే, రైతులను ప్రోత్సహించి, ఆహార పంటలనుకూడా వదలి పొగాకు పండించటానికి బాధ్యత వహించారని మీభావంకాదని, నాకూ యితర సభ్యులకు చెప్పి ఆభాగాన్ని తగినరీతిగా సవరించటానికి మీరు దయతో అంగీకరించారు.

రిపోర్టులోనుండి యీక్రింది మాటలను తొలగించవలసినదని నేను సూచిస్తున్నాను. "యితర వ్యాపారపంటల కంటే పొగాకును యెక్కువ పండించటానికీ,

యిటీవల ఆహార పంటలనుగూడ వదలి పొగాకునే పండించటానికి ప్రోత్సాహం యిచ్చింది."

16 వ తేదీ చర్చల వివరాలు (ప్రొసీడింగ్స్) మీఆఫీసు నుండి నాకు పంప బడిన కాపీలోని 6 వ పేరాలో ఈక్రింది విధంగాఉంది. 'ప్రతిపాదించబడిన యీసవ రణలతోనూ, సూచనలతోనూ, 7 వ పేజీ చివరవరకు (ఉపోద్ఘాతభాగం) రిపోర్టు మొదటి రీడింగులోనే ఏకగ్రీవంగా ఆమోదించబడింది' అని.

రిపోర్టులోని మొదటి 7 పేజీలు మొదటి రీడింగులోనే ఏకగ్రీవామోదాన్ని పొందిన విషయం నాకు యేమాత్రము తెలియనే తెలియదని మీకు నేను విన్న వించకోరుచున్నాను. అసలు ఆభాగం ఓటింగుకు పెట్టిన విషయమే నాకు తెలి యదు. ఈ పరిస్థితులలో, మీరిపోర్టుతో నేను ఏకీభవించుటలేదని తెలుపుటకు యెంతయు విచారించుచున్నాను. నా యీ అనంగీకారాన్ని మీరు రికార్డు చేసిన యెంతయు కృతజ్ఞుడను.

ఇట్లు,
మీ విశ్వాసపాత్రుడు,
(సం.) యఫ్. యస్. బి. జాన్స్టన్,
సభ్యుడు
(యిండియన్ లీఫ్ టొబాకో డెవలప్మెంటు కంపెనీ లిమిటెడ్)

ఈఉత్తరం వ్రాసిన ధోరణికి ఛైర్మన్‌గారు తమ ఆశ్చర్యాన్ని ప్రకటించి యిది సభ్యులందరి ప్రతిష్టకూ సంబంధించిన విషయంగనుక, 3 భాగాలు ఏకగ్రీవంగా ఆమోదింపబడిననాడు హాజరై యున్న గౌరవనీయ సభ్యులను యీవిషయంమీద తమ తమ అభిప్రాయాలను ప్రకటించవలసినదని కోరారు. శ్రీ కె. శంకరయ్యగారు యితర సభ్యులు ఆనాడు మూడు భాగాలు ఏకగ్రీవామోదాన్ని పొందిసమాట నిజమేనని, యిలాంటి అసందర్భం కలగటం విచారకరమనీ అన్నారు. యిది బహుశః భాష తెలియనందువల్ల జరిగియుండవచ్చునని శ్రీ డి. రామారావుగారు, జాన్‌స్టన్‌గారిని సమర్థించారు. శ్రీ డి. రామారావుగారు మాట్లాడుతూ, యిలాంటి సమావేశాల చర్చల విధానాలు తనకు తెలియనందువలనా, విదేశ దిగుమతిదారుల వద్దనుండి వచ్చిన విశేషాలవలనా, యిండియన్ టుబాకో అసోసియేషన్ తమకు యిచ్చిన ఉత్తరువులవలనా, తానే అభిప్రాయాన్ని మార్చుకో వలసి వచ్చిందనీ, ఆప్రకారం మార్చుకున్నాననీ ప్రకటించారు. జాన్‌స్టన్‌గారు తమకు సభ్యులలో విశ్వాసం లేకపోలేదనీ. కాని అసమయంలో తమకు తెనుగు సరిగా తెలియనందున అర్థం చేసుకోలేకపోవటం జరిగిందనీ అన్నారు. ఈ సంగతి రికార్డు చేయాలని జనాబ్ యం. ఎ. సలాం, యం. యల్. ఎ. గారు ప్రతిపాదించారు.

శ్రీ డి. యన్. మూర్తిగారు తమ అభిప్రాయం చెప్పనీయ వలసిందని, మరల పట్టుదలతో కోరారు. సభ్యులందరూ, అభిప్రాయాలను చివరలో రికార్డు చేయవచ్చునని వారికి సమాధానమిచ్చారు.

నిర్ణయించవలసిన కనీసధరలను గురించి, శ్రీ కె. శంకరయ్య, శ్రీ గట్టుపల్లి ఆంజనేయులుగార్లు చెరియొక ప్రతిపాదన చేశారు. ఈరెంటిని ఆధారం చేసికొని ఛైర్మన్ గారు యిద్దరు ప్రతిపాదకులకూ అంగీకారమయ్యేలాగున ధరలను సూచించగా అవి అంగీకరింపబడినవి. యిందుకు ముగ్గురు సభ్యులు తటస్థులుగా ఉన్నారు. మిష్టర్. యఫ్. యన్. బి. జాన్స్టన్, యితర చోట్ల ధరలు తెలియనిదే పొగాకుకు కనీస ధరలు నిర్ణయించటానికి అవకాశం లేదనే కారణంమీద వ్యతిరేకించారు.

ఇతర మార్కెట్లను గురించి పరిశోధనలుచేసే సందర్భములో రిపోర్టులో ఒక వాక్యం యెలా ఉండాలి అనే చర్చలో శ్రీ. డి. యస్. మూర్తిగారు ప్రసంగిస్తూ యీ పరిశోధన అనవసరమనీ, రైతుకు నిజంగా సహాయ పడవలెనంటే, మేలు రకం పొగాకును పండించే అవకాశాలు కల్పించాలనీ వాదించారు. యిండియన్ సెంట్రల్ టుబాకో కమిటీకి చెందిన డా. కదం, నారాయణస్వామిగారలు మన పొగాకు యితర దేశాల పొగాకుకంటే తక్కువరకమని అన్నారని శ్రీ. డి. యస్. మూర్తిగారు చెప్పారు. చైర్మన్‌గారు మాట్లాడుతూ, శ్రీ. డి. యస్. మూర్తిగారు చెప్పిన అధికారులకంటే ఉన్నతస్థితిలో ఉన్న యిండియన్ సెంట్రల్ టుబాకో కమిటీయొక్క టుబాకో యుటిలైజేషన్ అధికారి యిచ్చిన అభిప్రాయాన్ని సభ్యులకు యెరుకపరచారు. పై చర్చ, అంతట, ఓటుకు పెట్టబడింది. నలుగురు తటస్థులతో అది ఆమోదింపబడింది.

సబ్‌కమిటీ 5, 9, 11, 13, అంశాలను చర్చించి, నలుగురు సభ్యులు తటస్థులై యుండగా యీ క్రింది నిర్ణయాలు చేసింది.

1. గ్రేడ్లవిషయం పేచీలలో సహకరించేందుకని, శాంపిల్లు మార్కెటు కమిటీల, యిన్స్పెక్టర్ల వద్ద ఉంచుట.

2. యిండియన్ సెంట్రల్ టుబాకో కమిటీ నియమించని యెడల, గుంటూరు టుబాకో మార్కెటుకమిటీయే గ్రేడింగు యిన్స్పెక్టర్లను నియమిస్తుంది.

3. ఈ సందర్భంలో న్యాయ విచారణకు నియమింపబడిన అధికారుల చర్యల విషయంలో మార్కెట్‌కమిటీ పరిశీలిస్తుంటుంది.

4. మద్రాసు ప్రభుత్వం వద్దకు ఒకరాయబార వర్గాన్ని పంపించాలి. (నలుగురు సభ్యులు తటస్థులుగా ఉన్నారు.)

7, 24 అంశాలను ప్రతిపాదకులైన శ్రీ. కె. వి. అప్పారావుగారు ఉపసంహరించుకున్నారు.

8,12 అంశాలు ప్రతిపాదకులైన శ్రీ. డి. రామారావు, శ్రీ. కె. రామకృష్ణమూర్తిగార్లచే ఉపసంహరించుకోబడినవి. ప్రతిపాదకులైన జి. కమ్మింగుగారు లేక పోయినప్పటికి 10 వ అంశం చర్చించబడింది. అధిక విస్తీర్ణ కారణంవల్ల కనీస ధరలఆచరణ సాధ్యంకాదనే అభిప్రాయాన్ని, శ్రీ. డి. యస్. మూర్తి, యఫ్.యస్. బి. జాన్సన్, డి. రామారావు, కె. రామకృష్ణమూర్తిగార్లు వెల్లడించారు, కాని అధిక సంఖ్యాకసభ్యులు యీ అభిప్రాయంతో ఏకీభవించలేదు.

రిపోర్టులో చేర్చబడటానికై చైర్మన్‌గారు యింకా రెండు అంశాలను ప్రతిపాదించారు. ఒకటి, యెక్సైజు ఉద్యోగుల మామూళ్ళను గురించి రైతులు యిచ్చిన సాక్ష్యం, రెండు: యిండియాలోనూ, యితరచోట్లనూగల మాన్యుఫాక్చరింగు కంపెనీలతో సంబంధంగల కొన్ని విదేశీయ కంపెనీలే ఆర్డర్లు తీసికొని వ్యవహరిస్తుండటంచేత, నాటుపొగాకు విషయంలో పోటీలేకుండా చేయాలని. ఒకసభ్యుడు తటస్థంగా, ముగ్గురు వ్యతిరేకంగా, ఉండగా, మొదటి ప్రతిపాదన అంగీకరించబడింది. యిద్దరు తటస్థులు, యిద్దరు వ్యతిరేకులతో రెండవదిగూడా ఆమోదించ బడింది. అంతటితో రిపోర్టులోని 3 నుండి 8 వ భాగం వరకు జరిగిన చర్చలలో వచ్చిన అంశాలు అన్నిటిమీద చర్చ ముగిసినందున మొత్తం రిపోర్టును చైర్మనుగారు ఓటుకు పెట్టారు.

జనాబ్ యం. ఎ. సలాంగారు కనీసధరల మూలసిద్ధాంతానికి సంబంధించిన మొదటి మూడుభాగములు యిదివరకే అంగీకరింపబడి యున్నందున, యిప్పుడు మొత్తం రిపోర్టును ఓటుకు పెట్టనవసరం లేదని ఒకపాయింటు ఆఫ్ఆర్డరు సూచించగా అది అంగీకరింప బడింది.

శ్రీ. డి. రామారావు, శ్రీ. కె. రామకృష్ణమూర్తి, మిస్టర్ యఫ్. యస్. బి. జాన్సన్, శ్రీ. డి. యస్. మూర్తిగారలు, వ్రాతమూలకముగా ఒక డిసెంటును యిచ్చారు. అది రిపోర్టు చివరలో ప్రకటించ బడింది.

చైర్మన్‌గారు డిసెంటులోని కొన్నివిషయాలను వివరించ వలసినదని అడుగగా, ఆ సభ్యులు చెప్పారు.

చివరకు, సమావేశానికి హాజరుకాని సభ్యులనుండి, వారి సంతకాలు, అభిప్రాయాలు, రిపోర్టును సర్క్యులేట్ చేసి, సేకరించాలని సబ్ కమిటీ నిర్ణయించింది.

చైరుమన్ గారు తమ అంత్యోపన్యాసంలో, సబ్ కమిటీ సభ్యులందరికీ, ముఖ్యంగా పర్యటనలో పాల్గొని తోడ్పడిన శ్రీ. కె. శంకరయ్య, యస్. మహబూబ్, శ్రీ గట్టుపల్లి ఆంజనేయులుగార్లకు తమ అభివందనాలు తెలియజేశారు. తగిన సహకారం యిచ్చినందుకై, శ్రీ. సి. వి. యస్ చెట్టిగారినీ, మార్కెట్ కమిటీ ఉద్యోగులనూ, చైరుమన్ గారు అభినందించారు.

అంతటితో సబ్ కమిటీ సమావేశం ముగించబడింది.

ప్రభాత్ ప్రెస్, గుంటూరు. ఆ. 51. కా. 200 పేపరు సప్లయి



## మనము ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA103B224 |
| పుస్తకం పేరు | ప్రభుత్వ పీపుల్స్ వార్ మధ్య చర్చల సందర్భంగా జనం వాడి వాళ్ళ ప్రజా పోరు వాళ్ళది |
| తారీఖు | 30 January 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 219 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI,II,104,BCI |
| లేని పేజీలు | 123, 124 |
| తయారు చేసినది | S. Lakshmi |
| పేజీలు విడదీసినది | S. Lakshmi |
| స్కాన్ చేసినది | sharmila |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |